c NPRoID443

సామాజిక పరిణామక్రమంలో

# భారత మహిళ



రచన:

జె. రామచంద్రారెడ్డి

చెవ్వారిపల్లె



వెల 0-10-0

సామాజిక పరిణామక్రమంలో

# భా ర త మ హి ళ



చెవ్వారిపల్లె
జంబుల రామచంద్రారెడ్డిగారి
ప్రథమ రచన.



వెల పదిఅణాలు

ప్రథమ ముద్రణ వెయ్యి ప్రతులు.

అక్టోబర్ 1954.

సర్వహక్కులు రచయితవి.

9127

ప్రచురణకర్త, రచయిత:
జె. ఆర్. రెడ్డి.

ముద్రణ:
ప్రభాత్ ప్రెస్, ప్రొద్దుటూరు.

NPRO21443

## అంకితము

ఏకైక పుత్రుడనైన, నన్నే తనసర్వస్వం గా భావించి బాల్యమాదిగా విద్య, బుద్ధి, జ్ఞానోదయం కలిగించి పితృ వియోగాన్ని మరపించిన పూర్ణ ప్రేమైక స్వరూపిణియైన మాతృదేవికి.

# విషయసూచిక



# తొలిపలుకు

★

ఈపుస్తకంయొక్క ప్రధానోద్దేశ్యం స్త్రీ పురుష సంబంధాలు ఆదిమదశనుంచీ నేటివరకు ఎలా పరివర్తన చెందుతూ వచ్చాయి? ఈపరివర్తనలకు అనివార్యమైన కారణాలు ఏమిటి? ఈపరివర్తనలకు స్వరూపాన్నిచ్చిన ధార్మిక నియమాలు ఏమిటి? ధార్మికాదర్శాల ముసుగున స్త్రీజాతిని మానవత్వాన్నుంచి ఎలా వంచించటం జరిగింది? వర్తమాన సమాజంలో న్యాయాదర్శాల ముసుగున సర్వసాధారణంగా చెలామణీ అవుతున్న అవినీతికీ, అసభ్యతకుగల మూలకారణాలేమిటి? కుల్లి కంపుకొడుతున్న మృతశరీరాన్ని శృంగారించుకొంటూ దాని గతవైభవాన్ని స్తుతిస్తూ సాగిపోవలిసిందేనా? భరింపశక్యముకాని దుర్గంధపూరితమైన ఈకళేబరాన్ని భూస్థాపితం చేయాల్సిన అవుసరంలేదా? గతానికి చెందిన ఈమృత వ్యవస్థా స్థానంలో నూతనమైన సజీవ వ్యవస్థను నిర్మించాల్సిన అవుసరంలేదా? వగైరా సమస్యలను పూర్ణదృక్పథంతో చర్చించటం మాత్రమే జరిగింది. అంతేకానీ సామాజిక వ్యవస్థా ప్రభావానికిలోనై నేడు స్త్రీజాతిని ఆవహించియున్న అసభ్య, అనైతిక వ్యవహారాలను సమర్థించేందుకుగాను తీసుకొన్న పాక్షికవాదం ఏమాత్రంకాదు.

నేటిమానవజాతి యొక్క విజ్ఞానాన్ని సభ్యతను దృష్టిలో ఉంచుకొన్నపుడు, ప్రాచీన కాలపునాటి కుటుంబం పైన స్త్రీకే సర్వాధికారాలను కల్గించే మాతృ సత్తాకాన్ని గానీ, మహాభారత కాలంనాటి ద్రౌపదివలె అయిదుగురు భర్తలు కలిగుండి పతివ్రతగా, చెలామణీ కావాలన్నప్పటికీ,

ఎలాగర్హ్యనీయ మాతూవుందో, అదేవిధంగా ఏకపత్నీ వ్రతం పేరుతో సీతాదేవివలె అరణ్యా వాసాలకు గురిచేయూ లన్నప్పటికీ అసంభవం, అవివేకం అవుతూవుంది. అయితే యివన్నీ చరిత్రలోనిఒక్కొక్క దశలో అనివార్యమైన సామా జిక వ్యవస్థా విశేషాలుగా ఉంటూ వచ్చాయనేది యదార్థ సత్యం.

యిలాంటి అతిసహజమైన వ్యవస్థా విశేషాలను భారత దేశంలోని సభ్యజాతి కాలచక్రంలో చరిత్ర గర్భంలోకి సం లీనం చేసుకొంటూ నూతన వ్యవస్థను నిర్మించుకొంటూ నేటివ్యవస్థలోకి చేరుకొంది-కానీ యింకాఅనేక జాతులు ప్రాచీన వ్యవస్థా విశేషాలను సహజ వాతావరణంలో ఆచ రిస్తూ ప్రాచీన భారత రూపు రేఖలను మనకు బోధిస్తున్నాయి.

ఒకజాతి, లేక దేశములోని సామాజిక ఆర్థిక, రాజ కీయ, ధార్మిక, విశేషాలను సంపూర్ణంగా తెలుసుకోనిదే, వివిధ మతభావాలుగల సమూహాలను ఆర్థికంగా, నైతి కంగా విభజింపబడిన వర్గాలను వారివారి జీవిత విశేషాలను తెలుసుకోనిదేఆజాతియొక్క ఉత్కృష్ణతనునిర్ణయించలేము.

యీప్రాతి పదికపైన విచారించి నట్లైతే నేటి భారత మహిళను ఎన్నోతరగతుల క్రింద విభజించాల్సి వుంటుంది. మిత్రరాజ్య సమితికి అధ్యక్షురాలు నేటిభారతమహిళ, కేంద్ర ప్రభుత్వ మంత్రిణి, కార్యదర్శిణి, పార్లమెంటు సభ్యురాలు, అత్యున్నత పదవు లలంకరించి అత్యున్నత స్థాయికి చేరుకొంది నేటి భారతీయ మహిళ

అయితే వేళ్లపైన లెక్కించ గలిగినవీరేనా భారత దేశపు స్త్రీజాతి రూపురేఖలను నిర్ణయించేది? లేక పురు షుని నిరంకుశత్వానికి బలిపశువుగా, దాసీరూపంలో విధవా

రూపంలో భోగభాగ్యాల కొరకుగాదు. కేవలం గంజినీళ్లకు మాత్రమే రూకదుడ్డుకు తనను తాను సర్వసాధారణంగా, బహిరంగంగా అతి పవిత్రమైన తనశీలాన్ని అర్పించుకొం టున్న కోటానుకోట్ల అభాగ్యజీవులా?

అత్యున్నత శిఖరాగ్రాన్నందుకొన్న ఒకసోదరినిచూచి సంతోషించవలెనా? దేశదేశాలలో కీర్తినార్జిస్తున్న భారత నారీమణిఅని గర్వించవలెనా? లేక అత్యంత హేయస్థితిలో అచేతన జీవిత మార్గంగా విధిగా భావించి సమాజ యినుప పాదాలక్రింద నలిగిపోతున్న సోదరిని కళ్లారాచూస్తూ ఏమను కోవాలి? ఏమిచేయాలి? ఒకే దేశంలో, ఒకేజాతిలో యిలాంటి ఆకాశ, పాతాళ అంతరాలకుగల సామ్యంఏమిటి? వగైరా జిజ్ఞాసా పూర్ణసమస్యలు నేడు ప్రతిభారతీయుని ఎదుర్కొనే విషమసమస్యలు, యిలాంటి జిజ్ఞాసా పూర్ణసమస్యలే నన్నీ పుస్తక రచనకు ప్రోత్సహించాయి.

చరిత్రగర్భంలో అణగివున్న గతవ్యవస్థ విశేషాలను వర్తమాన సమాజంలోని చెడును. భావిసమాజ నిర్మాణా నికి అవసరమైన పథకాలను విపులీకరించటం యిలాంటి అణుమాత్ర పుస్తకాల ద్వారా సాధ్యం అయ్యేవిషయం కాదు. అయినప్పటికీ ప్రథమ ప్రయత్నంగా ప్రతిఒక విష యాన్ని క్లుప్తంగా పాఠకులకు అందించేందుకు ప్రయత్నం చేశాను.

కాబట్టి యీపుస్తకాన్ని విశాల దృక్పథంతో ఆది నుంచీ తుదివరకు పరిశీలించనిదే ఏఒక శీర్షికనో తీసుకొని అదేప్రామాణికంగా తమభావాలకు అన్వయించుకొనటం గానీ లేకరచయితఉద్దేశ్యాన్నివక్రమార్గంలోచిత్రించేందుకు గానీ పూనుకొనవద్దని పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాను.

అచ్చు పొరపాట్లు చూచేఅవకాశం లేకపోయినందువల్ల యీ పుస్తకంలో ఎక్కువతప్పులు దొర్లడమే కాకుండా పులిస్టాఫ్‌లు, కామాలు, ఐక్యపదాలను విడదీసేవిగాను, విడి పదాలను ఐక్యం చేసేవిగాను ఉంచటం జరిగింది. అంతే కాకుండా ఆఖరున తప్పొప్పుల పట్టిక తయారు చేసేటపుడు కొన్నిపదాలకు వివరణయివ్వటం, కొన్నింటిని మార్చాల్సిన ఆవశ్యకత వుందని గ్రహించాను. యీ యాదృచ్ఛిక పొరపాట్లను రెండవ ముద్రణలో సవరిస్తూ, మరికొంత విషయ వివరణను యిచ్చేటందుకు కృషిచేయగలనని విశ్వసిస్తున్నాను.

ప్రధానంగా ఆర్థికయిబ్బందులవల్ల పుస్తకం క్లుప్తంగా వుండవలెననే వుద్దేశ్యం సేకరించిన విషయాన్నంతటినీ యిచ్చేటందుకుగానీ, యివ్వబడిన విషయానికి తగిన వివరణ యిచ్చేటందుకుగానీ అడ్డుతగిలింది.

ప్రథమంలో మూఢ మతభావాలనుంచి తొలగించి అభ్యుదయ దృక్పథంవైపు మళ్లించి యీ పుస్తక రచనకు సూచనలిచ్చిన కామ్రేడ్ గజ్జల మల్లారెడ్డికి, ముందుగానే విక్రయ భారాన్నికూడా స్వీకరించి ప్రోత్సాహాన్నిచ్చిన మిత్రులకు అభివందనాలు.

జె. ఆర్. రెడ్డి.
12-10-54



1

# ఆదిమ కాలపు - స్త్రీలు

మానవుడు జంతు జాతులనుంచీ పరివర్తన చెందే దశలోనూ, ఆతర్వాత ఆటవిక దశలోనూ స్త్రీ పురుష సంబంధాలు జంతువులవలెనే ఉంటూవచ్చాయనే దాంట్లో సందేహంలేదు. మానవుని విజ్ఞానాభివృద్ధితోపాటు యీ స్త్రీ పురుష సంబంధాలు కూడా నిరంతరం పరివర్తన చెందుతూ వచ్చాయి. మానవసృష్టికి స్త్రీ పురుష అనే రెండుజాతులు. యీజాతులమధ్య పరస్పర సమన్వయం అత్యంతావశ్యకమౌతూంది. అయితే యీ స్త్రీ పురుష సంబంధాలు, సర్వ దేశాలయందు, సర్వ కాలాలయందు ఒకే రకంగా వుండక వివిధ కాలాలలో వింతవింత మార్పులు చెందుతూ వస్తున్నాయి. ఆదిమ సమాజంనుంచీ స్త్రీ పురుష సంబంధాలు ఏయే దేశాలలో ఎలామార్పు చెందుతూవచ్చాయి? అందుకు ఆయా కారణాలుఏమిటి? వగైరావిషయాలను తెలుసుకొంటేగానీ నేటిసమాజంలో పాతుకపోయిన ధర్మం, నీతి, న్యాయం వగైరాల పేరుతో, జరుగుతున్న అన్యాయం, అవినీతి, అక్రమవిధానాలను తొలగించి, మానవజాతిని అధఃపతనాన్నుంచి కాపాడేందుకు సమాజంలో నేటి సభ్యతకు అనుగుణంగా నూతనమైనటువంటి మానవుని నైతికోన్నతిని పెంపొందించేందుకు కావలసిన మార్పులు, వాటికొరకు మన కర్తవ్యాన్ని తేల్చలేము. అందుకు ఆయా దశలలో

ఉత్పన్నమయిన సాహిత్యాన్ని ప్రకృతినుంచి లభ్యమయ్యే చారిత్రక ఆధారాలను పరిశీలించాల్సి వుంటుంది. భారతదేశ ప్రాచీన సంస్కృతిని, వేదాలు, ఉపనిషత్ లు, మహాభారతం వగైరా వాఙ్మయం మనకు తెలియ జేస్తున్నది. ప్రాచీన చరిత్రలో రెండవదశను మనుస్మృతి, యాజ్ఞ వల్క్యస్మృతి తెలియజేస్తాయి. అయితే వీటికాలాలను యిదమిద్ధంగా తేల్చి చెప్పటం సాధ్యంకాదు. యీదశలో మానవునికి గృహాంత ర్భాగాలు చెట్లు, కొమ్మలు ప్రధాన నివాస స్థానాలు. అరణ్యాలలోని గొప్ప గొప్ప క్రూర మృగాలనుంచి తమ్ము తాము కాపాడు కొనేందుకు గృహాంతర్భాగాలు చెట్లు కొమ్మలుతప్ప వారికి వేరొకమార్గం లేకపోయింది. అప్పటికి ప్రజలు సమూహాలుగా లేకపోవటమే యిందుకు కారణం. కుటుంబాన్ని ఉత్పత్తి చేయుటం, పోషించటం స్త్రీయొక్క ప్రధాన బాధ్యతలు. సంతానాన్ని పెంచి పోషించటంలో కరుణామయిగాను, కుటుంబాన్ని రక్షించు కొనుటలో రౌద్రమూర్తిగాను ప్రవర్తించేది. వీరికిప్రధానం కుటుంబాన్ని అభివృద్ధి చేసుకోవాలనే వాంఛవుండేది. కుటుంబం అంటే అయిదారుగురు, లేక పదిపన్నెండుమంది గుంపులు చెల్లా చెదరుగా వుండేవి. కాబట్టి కుటుంబం అంటే గుంపులని మాత్రమే. వీరిలో మానవజ్ఞానం యింకా వికసించలేదు కాబట్టి తండ్రి కొడుకు, తల్లి కూతురు అనే విచక్షణ కూడా వారికిలేదు. వారికి కావలసినదల్లా కుటుంబ అభివృద్ధి. కుటుంబంఅభివృద్ధి కావాలంటే, సంపర్కంజరగాలి. అయితే ఎవరితో సంపర్కం చేయాలి, ఎవరితో కూడదు అనేటంత

విజ్ఞానం లేకపోవటమేగాక, కొన్నికొన్ని సందర్భాలలో ఒకస్త్రీ ఒకపురుషుడే మిగలటం, లేక కొంతమందిస్త్రీలు ఒక పురుషుడు మిగలటం జరిగినపుడు, కుటుంబాభివృద్ధి కొరకు అందరిస్త్రీలతోనూ ఒక్క పురుషుడేసంతానోత్పత్తిని కలుగచెయ్యటం ద్వారా ఆ తెగను అభివృద్ధి చేసుకోవాల్సి వచ్చేది. యీసంతానాభివృద్ధి ఋగ్వేద కాలంలోకూడా వుండింది. ఋగ్వేదంలో ఆరోగ్యాన్ని దృష్టిలోపెట్టుకొని, (ఆరోగ్య విషయాలను అంటే పుట్టేసంతానం దృఢంగా వుంటే వారికికలిగే సంతానంకూడా ధృడంగా వుందనే అభిప్రాయానికి వచ్చారు.) ఒకస్త్రీ పదిమందికంటే ఎక్కువ సంతానాన్ని కనకూడదని శాసించటం జరిగింది. నేటిసభ్య సమాజీకులమనుకొని గర్వపడే వారంఅంతా యీఆటవికుల వారసులమేనని గ్రహించాల్సి ఉంటుంది. అయితే యీఆట వీక మానవులనుంచి అనేకదశలుగా నూతనానుభవాలతో, నూతనదశను నిర్మించుకొంటూ, మనం నేటిసమాజానికి చేరు కొన్నాం. వేదకాలానికి పూర్వం ఆదిమ వ్యవస్థలేక ఆటవిక దశగా పేర్కొనబడింది. యీదశలో మనుష్యులు అరణ్యాలలో సంచరిస్తూ, పండ్లుఫలాలు, జీవజంతువుల వేటద్వారా పొట్ట నింపుకొనేటపుడు స్త్రీ పురుష సంబంధాలు నియమబద్ధ రహితంగా స్వేచ్ఛగా సంచారితమయినప్పటికీ, ఆకాలపు మానవులు ఆహార సంపాదన కొరకు తనకాలాన్ని ఎక్కువగా వినియోగించాల్సి వుండటంవలన స్త్రీ పురుష సంబంధాలు సంతానోత్పత్తికి మాత్రమే సంపర్కంజరుపబడేది. ఆదశలో యీసంబంధాలకు నియమాలు, సూత్రాలు కల్పించు కొనా

ల్సిన అవుసరంగానీ, అవకాశంగానీ లేకపోయిందనే విషయాన్ని చూశాము. యీదశలో ఫలానా స్త్రీ పురుషులు యీవిధంగా సంచరిస్తున్నారని వేలెట్టి చూపాల్సిన అవుసరంగానీ, ఒకరిప్రవర్తన మరొకరికి ఆటంకంగాగానీ ఉండలేదు. ఏస్త్రీ ఏపురుషునితోనైనా, ఏపురుషుడు ఏస్త్రీతోనైనా స్వేచ్ఛగా సంచరించినప్పటికీ అదిఒక విద్యుక్త ధర్మంగా పరిగణింపబడేది. వ్యభిచారం అనేపదం యీ కాలంలో సృష్టికాలేదు. యీఆదిమదశను, ఆదిమ కమ్యూనిస్టుదశను మాతృసత్తాక యుగమని పిలువటం జరుగుతూవుంది. మాతృసత్తాక యుగపు స్త్రీ అంటే ఏమిటి? శూరత్వంతో క్రూరమృగాల నిర్జించటం, కుటుంబాన్ని రక్షించటం ఆమె స్వీకరించింది. నిర్భీకతతో అరణ్య సంచారం చేసింది. అటవీమృగ సంచయంద్వారా కుటుంబాన్ని పోషించింది. కుటుంబ పాలనయందు చతురత్వం, పర్వతారోహణలయందు సాహసం కనపరచింది. గుహాంతర్భాగములు యీమెకు చిరపరిచితములు ఘోర వృక్షరాజములుఅధిరోహించటంలోను తీవ్రవాహినీ నదుల అవలీల దాటగల్గిన ప్రతిభామూర్తి ఆనాటి స్త్రీమూర్తి. నేటి ఉద్గ్రంథాలలో ఉల్లేఖించబడిన కల్పిత దుర్గ కాదు. ఆనాటిస్త్రీ ప్రత్యక్ష కార్యాన్విత ప్రచండదుర్గ. ఆనాటి శాసనకర్త తల్లి. తల్లి తర్వాత కూతురు అధికారంకొరకు తల్లి కూతుల్లమధ్య సంఘర్షణ. యీమార్పు చెందే అధికారాలతో పురుషునికి ఏలాంటి సంబంధంలేదు. నాటిపురుషుడు అధికారహీనుడు, శక్తిహీనుడు, ఆకాంక్షారహితుడు, భవిష్యత్ హీనుడు. స్త్రీకి దాసుడుగా మాత్రమే ఆనాటి పురుషుడు పరిగణింపబడేవాడు.

# ఋగ్వేద కాలపు - స్త్రీలు

తర్వాతదశలో మనుష్యులు సేద్యము, పశుపాలనము ద్వారా జీవితం గడపటం ప్రారంభించారు. యీదశలో చెల్లాచెదరుగా నిరంతరం అరణ్యాలలో సంచరించే ప్రజలు తాత్కాలిక స్థిరనివాసాలు ఏర్పరచుకొని కొన్ని సమూహాలుగా ఏర్పడినారు. పశువులు, జంతువులు అరణ్యప్రాంతాల విస్తరణకొరకు యీసమూహాలు (తెగలు) మధ్య యుద్ధాలు జరిగేవి. కొన్ని కారణాలవల్ల యీయుద్ధాలనుంచి స్త్రీని దూరంగా పెట్టుతారు. ప్రధానంగా యుద్ధంలో స్త్రీలు చనిపోవటంవల్లగానీ, శతృవుల చేతుల్లో పడిపోవటంవల్లగానీ ఆ తెగలో పుట్టేవారి సంఖ్యతగ్గి ఆ తెగ బలహీనమౌతుంది. అంతేగాకుండా యీసమయంలో ఉత్పత్తి పరికరాల వికాసం చెందలేదు కాబట్టి ఉత్పత్తి కార్యక్రమంలో కఠిన పరిశ్రమ చేయాల్సివచ్చేది. కఠిన పరిశ్రమ చేయటంలో స్త్రీకంటే పురుషుడు బాగా చేయగల్గేవాడు. వగైరా కారణాలవల్ల స్త్రీని యింటిదగ్గరఉంచి గృహకార్య నిర్వహణభారం వప్పగించటం జరిగింది.

యీవిధంగా ఏర్పడిన తెగలు ప్రథమంలో స్థిరనివాసాలు ఏర్పరచుకొనక ఒక్కొక్క స్థలంలో కొద్దికాలం మాత్రమే ఉంటూ వేరొక ప్రదేశాలకు వెల్లుచుండెడివి.

పశుపాలన వ్యవసాయముతో పాటు, మాంసాహారము కూడా ప్రధానంగా వుండటమే యిందుకు కారణం అంటే మాంసాన్ని చ్చే జీవజంతువుల అన్వేషిస్తూ అవి సమృద్ధిగా దొరికే స్థలాలకు వెల్లటం జరిగేది. యీదశలోనే భారత దేశానికి ఆర్యులుఅనే ఒక కొత్తరకపుజాతి పండ్లు, ఫలాలు, జీవజంతువుల వెతుక్కుంటూ దాదాపు 10వేల ఏండ్లక్రితమేవచ్చారు. యీఆర్యులు రాకముసుపే భారత దేశంలోవున్న ప్రజలు ఆటవిక దశను గడచి స్థిర నివాసాలు ఏర్పరచు కొన్నట్లు చెప్పబడింది. ఆర్యులు ఉత్తరమున హిమాలయాలద్వారా ప్రవేశించి ఉత్తర ప్రదేశాలలోవున్న ద్రావిడులతో యుద్ధాలుచేసి వారిని దక్షిణానిక తరిమివేశారు. తర్వాతకాలంలో యీఆర్యులే భారత దేశంలో ఆర్య ద్రావిడ సమ్మిశ్రిత సంస్కృతిని నిర్మించారు.

భారత దేశంలో స్థిరపడిపోయిన ఆర్యులు ఆనాటి సామాజిక విధివిధానాలను, స్త్రీ పురుష సంబంధాలను, సామాజికజీవనాన్ని తెలియజేసే సాహిత్యాని సృష్టించారు. ఆసాహిత్యాన్నే నేడు వేదాలుఅని పిలువటం జరుగుతూవుంది. ఆనాటి సామాజిక చరిత్రను తెలియజేయుటంలో ఋగ్వేదం ప్రధానపాత్ర వహిస్తుంది.

ఆటవిక దశలోనూ, ఋగ్వేద ప్రారంభ కాలంలోను స్త్రీపురుష సంబంధాలుసామూహికంగావుండేవి. యీదశలో ఉత్పత్తి వినిమయంకూడా సామూహికంగా వున్నట్లు చెప్ప బడింది. స్త్రీ పురుష సంబంధాలు కూడా తండ్రి కూతుల్లు, తల్లికొడుకులు, అక్కచెల్లెండ్లు, అన్నదమ్ములు అనేభేదాలు

గానీ, వయోభేదంగానీ లేకుండా సంచరించబడేవి. మానవజాతి కొంత అభివృద్ధి చెందటంతో యీవిధమైన స్త్రీ పురుష సంబంధాలు భవిష్యస్సంతతికి హానికరములని తెలుసుకొనటంతో వీటిని రద్దుచేసి బంధువివాహ పద్ధతి అమలులోకి తెచ్చారు. బంధువివాహ పద్ధతిలో పెత్తల్లి పినతల్లిబిడ్డలైన అక్క, అక్కచెల్లెండ్లు, అన్నదమ్ములు పెండ్లాడవచ్చును. తండ్రికూతుల్లకూ, తల్లికొడుకులకూ మధ్య సంబంధాలు నిషేదింపబడినాయి. రెండవ దశలో సోదరీ సోదరుల మధ్య సంబంధాలు నిషేధింప బడినాయి. యీపద్ధతికి, వెనుకటి పద్ధతులకు పోల్చినట్లైయితే చాలా మార్పులు జరిగినాయనే చెప్పవచ్చు. యీవిధమైన బంధువులమధ్య సంబంధాల నిషేధాలతోపాటు, వివాహము చేసుకొనేవారిమధ్య వయస్సు కూడా దాదాపు సమానంగా వుండేటట్లు చూడబడింది. అయితే యీమార్పుల కొరకు ఋగ్వేద కాలపు అంత్యదశలో కూడా ఘర్షన జరుగుతున్నట్లు చెప్పబడింది. ఋగ్వేదం చివరలో సోదరీ సోదరులమధ్య సంబంధాల గురించి ఘర్షన జరుగుతున్నట్లు ఋగ్వేదంలో చెప్పబడింది.

"యమి తనసోదరుని యముని ప్రేమిస్తుంది. యముడు యిది వరుణదేవునికి తెలిస్తే కోపంవస్తుందని నిరాకరిస్తాడు. యమి యిది దేవతల కంగీకారమైన దేనని వాదిస్తుంది." 'ఋగ్వేదం'

"ప్రజాపతి కూతురు సీతాసావిత్రి తనసోదరుడైన సోమున్ని పెండ్లాడమని కోరుతుంది. కానీ సోముడు తన రెండవ సోదరియైన శ్రద్ధను పెండ్లి చేసుకోవాలంటాడు. సీతాసావిత్రి తండ్రి సహాయంవల్ల సోముని భర్తగా

పొందుతుంది.'' ''తైత్తిరీయ బ్రాహ్మణంలో చెప్పబడింది.''

"ఆదిసృష్టికి కర్తయైన ప్రజాపతి సృష్టికొరకు తన కూతురుతో సంభోగించినట్లు ఇతరేయ బ్రాహ్మణం తెలియ జేస్తూంది.

"దక్షుడు తన సోదరియైన దక్షను వివాహమాడి 60 మంది కూతుళ్లను కంటాడు. యీ 60 మందిలో 10 మందిని దక్షుని సోదరుడైన ధర్ముడు వివాహ మాడుతాడు. దక్షుని రెండవ సోదరుడైన మరీచి కుమారుడు, కశ్యపుడు 13 గ్గురిని పెండ్లాడతాడు. అంటే పెత్తండ్రి కూతుళ్లను పెండ్లాడతాడు. "హరివంశం.''

''పదిమంది ప్రచేతసులకు సోముడు కొడుకు. సోము డికి మరీష అనే కూతురు ఉంటుంది. యీమెను సోముడూ తన తండ్రిగారైన పదిమంది ప్రచేతసులకుయిస్తాడు. మరీషకు దక్షప్రజాపతి జన్మిస్తాడు. దక్షుడు తనకూతుర్ని తాతయైన బ్రహ్మకుయిస్తాడు. వారిద్దరికీ నారదుడుజన్మిస్తాడు.'హరివంశం.

''విశిష్ట ప్రజాపతి తనకూతురైనశతరూపను వివాహ మాడుతాడు. మనువు తనకూతురైన ఇళను పెండ్లాడినట్లు జహ్ను తనకూతురైన జహ్నవీ గంగను పెండ్లాడినట్లు హరి వంశం 11, 10, 27 అధ్యాయాలలో చెప్పబడింది.

యీవిధంగా స్త్రీ పురుష సంబంధాలను జంకూ గొంకూ లేకుండా చెప్పారంటే, ఆనాటిసామాజిక దృష్టిలో యిలాంటివి సహజంగా జరుగుతూ వున్నటువంటివే కాబట్టి నిర్మొహమాటంగా యీవిధమైన సంబంధాలను సాహిత్యంలో యిమిడ్చటం జరిగింది.

ఆదిమ కమ్యూనిస్టు గణసంఘుఉచ్ఛ దశనుంచీ ఋగ్వేద రచనాకాలం ప్రారంభ మవుతుంది. ఋగ్వేదకాలం నాటికి సామాజిక, ఆర్థిక, నైతిక సంబంధాలను సమన్వయం చేస్తూ ఒక నూతన సంస్కృతిని నిర్మించటం జరిగింది. వుత్పత్తి వినిమయం సామూహికంగానే వుంటూనే వ్యక్తిత్వాన్ని, వ్యక్తి నైపుణ్యాన్ని (విజ్ఞానం) వ్యక్తిగతశ్రమను గుర్తించటంజరిగింది. యీకాలంలోనేసమాజానికిరూపు రేఖలు దిద్దే ఆచార్యులు కొంతమంది ఏర్పడ్డారు. వీరు సమాజానికి అభ్యుదయకర సూచనలు యివ్వటంద్వారా భవిష్యత్ లో సమాజం విచ్ఛిన్నం గాకుండా కాపాడేందుకు కృషిచేశారు. వీరు సమాజంలో అరాచకము, అసభ్యతకు దారితీసే స్త్రీ పురుష సంబంధాలకు కూడా కొన్ని సూచినలు చేశారు. అంటే సామాజికంగా, ఆర్థికంగా, నైతికంగా స్త్రీపురుషులు సమాన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కల్గివుంటూ, కేవలం స్త్రీ పురుష కామ సంబంధాలకు మాత్రం కొన్ని నియమాలు ఏర్పరచారు.

యీనియమాలు ఏర్పడే దశలో సమాజిక రూపం ఒకే పరివారం, లేక ఒకే గోత్రానికి చెందిన కొన్ని పరివారాలు కొంత సామూహికంగా వుండినవి. యిందులో తల్లులకు స్త్రీకి ప్రాధాన్యత వుండటంవలన, యీదశకు మాతృసత్తాక యుగమని చెప్పబడింది. యీదశలో సమాజంలోని ఏసభ్యుడైనప్పటికీ తనుచేసే ఆలోచనలుగానీ, పనులుగానీ సమాజ శ్రేయస్సుకు భిన్నమైనటువంటి విధంగావుండకుండా మనోవాక్కాయ కర్మల సమాజం (తెగ) లోవుండే ప్రతి

ఒకరు సమానమేననే దృక్పథంతో ఆచరించవలె (1) నంటూ ఋగ్వేదం పేర్కొంటూవుంది. దీన్నిబట్టితేలేదేమంటే సాఘుజీవిత ఆచార వ్యవహారాలలో స్త్రీపురుష వయోవృద్ధ భేదం లేకుండా ఏకాభిప్రాయం కల్గివుండినారు. ఉత్పత్తి వినిమయం సామూహికంగా జరిగేది. ఉత్పత్తి సాధనాల (పరికరాల) పైనకూడా సామూహిక అధికార ముండెడిది. ప్రతిస్త్రీపైన ప్రతి పురుషునికి, ప్రతి పురుషునిపైన ప్రతిస్త్రీకి అధికారముండినది. హెచ్చుతగ్గు వ్యవస్థలుగానీ, సతీత్వ విధి విధానాలుగానీ, సంయమణ శుష్క వేదాంతాలుగానీ మచ్చు కైనా కనబడవు. అందరు ప్రకృతిబిడ్డలూ, సత్యవ్రతులూను. యీవిధమైన సామూహిక సమాజ జీవితంలో ఫలానాబిడ్డ తండ్రి ఫలానాఅని నిశ్చయించుట కష్టముకాబట్టి, బిడ్డలపైన తల్లులకే అధికార ముండెడిది. బిడ్డల పేరుగోత్రాలు తల్లుల పేరటనే చలామణీ అయేవి. యీమాతృసత్తాక యుగపు అవశేషాలు వైదికధర్మ వుద్ధారకుడైన శంకరాచార్యుని జన్మభూమి కేరళలో యింతవరకు నిల్చేవున్నాయి.

యీ విధమైన సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుష సంబంధాలను, సమాజ శ్రేయస్సును దృష్టిలోవుంచుకొని కొన్ని నియమాలు ఏర్పరచారని చూచాము. ఆనియమాలు, స్త్రీ పైన పురుషుని పెత్తనంగానీ, పురుషునిపైన స్త్రీ పెత్తనం గానీ చలాయించాలనే ఉద్దేశాలతో కూడుకొన్నవిగాక స్త్రీ పురుషుల స్వాతంత్ర్యాలు సమానమైన హోదాలో

---

1 "సమానోమంత్రః సమితి సమానో సమానమ్ మనః సహ చిత్త మసామ్
ఋగ్వేదం అ 8 అ 8 మ 3.

వుండునటుల చూడబడింది ఋగ్వేదం. ఏ స్త్రీగానీ ఒక పురుషునితో మాత్రమే సంబంధము పెట్టుకోనవలెననీ, ఆపురుషునితో సంబంధం వున్నంతకాలం వేరొకపురుషునితో సంబంధాన్ని పెట్టుకోనటాన్ని నిషేధించింది. అయితే జీవిత పర్యంతం ఒకే పురుషునితో సంబంధం కలిగివుండాలనే కఠోర శాసనాన్ని కూడా నిషేధించింది. అలాగే స్త్రీ నియమించుకొన్న ప్రథమ పురుషుడు చనిపోయినపుడుగానీ, యిష్టము లేనపుడుగానీ వేరొక పురుష సంబంధాన్ని ప్రోత్సహించింది.

"స్త్రీ ప్రథమంగా నియమించుకొన్న పురుషుడు సోమద్వితీయుడు, గంధర్వ తృతీయుడు, అగ్నిష్ట చతుర్థపురుషునినుంచీ నియమించుకోనబడేవారు. మనుష్యా" (1)

"హే స్త్రీ జీవించి యున్నపుడు పురుషునిద్వారా నీవు పొందిన సుఖాన్ని గతించిన పురుషునిద్వారా పొందజాలవు. కాబట్టి నీ యిహలోక సుఖసౌఖ్యాలకు ఎలాంటి అవాంతరాయాలు లేకుండుటకుగాను జీవించియున్న పురుషులతో నీకు యోగ్యమైనటువంటి వానిని యింకొకని వేదోక్త ప్రకారం స్వీకరింపుము." (2)

ఋగ్వేదాన్నుంచీ మనకు లభ్యమయ్యే యీ ఆధారాలు ఒకే కాలంలో ఏ ఒకరిద్దరి ద్వారానో, క్రోడీకరించబడిన విషయాలుగానీ, లేక ఊహాకందిన విషయాలను వల్లిం

---

1. సోమః ప్రథమో వివిదే గంధర్వః వివిద ఉత్తర్వః
తృతీయో అగ్నిష్టే పతిస్తురీయుస్తే మనుష్యజాః (ఋ మం 10సూ 85 మ40

2. ఉదీష్వనార్యభి జీవలోకమ్ గతాసుమేత ముపశేషఏహ
హస్తాగ్రాభ స్వదిధషోస్త్వేదమ్ పత్యుర్జ నిత్యమభిసమ్ వభూయ.
ఋ మం.10 సూ.18 మం.8

చటంగానీ కాదు. ఋగ్వేద రచన వందలఏళ్ల వరకూ ఆనాటి సామాజిక విధానంలో జరుగుతున్న మార్పులు. ఆమార్పుల కొరకు సంఘర్షణను. వాటిపరివర్తనను తెలియజేస్తూ అనేక మందిద్వారా రచించబడుతూ వచ్చిన శ్లోకాలను కూర్చటం జరిగింది. (1)

ఇంతవరకు మనము చూచిన మార్పులకు దేవరపద్ధతి, నియోగపద్ధతి విధానాలుగా మార్పుచెందాయి. ప్రథమంలో దేవరపద్ధతి స్త్రీకి చనిపోయిన పురుషుని సోదరులతోమాత్రమే సంబంధం కల్పించుకొనవచ్చుననే విధానం అమలులోకి వచ్చింది. తర్వాత నియోగపద్ధతి ఆచరణలోకి వచ్చింది. నియోగపద్ధతి ప్రకారం, స్త్రీ తనయిష్టమువచ్చిన పురుషునితో సంబంధం పెట్టుకొనవచ్చు. ఋగ్వేదంఈ దేవర నియోగపద్ధతులను. గురించి యీవిధంగా చెప్పబడింది.

"హేస్త్రీ ప్రథమ వివాహము చేసుకొన్న స్త్రీపురుషులవలెనే ఎక్కడైతే మీజీవిత సౌలభ్యంకొరకు అనుకూల పరిస్థితు లుంటాయో, అక్కడే నివసించి భార్యాభర్తలవలె పరస్పరానురాగులై దేవరన్యాయంబునసంచరించుడు' (2

---

1. ఋగ్వేద రచనా క్రమాన్ని గురించీ, ఆనాటి సంపూర్ణ సామాజిక విధివిధానాలాగురించి వేరొక పుస్తకంలో వివరించబడింది.

2. "కుహస్విద్దోషా కుహవస్తో రశ్వినాకు హాభిపిత్యామ్ కరతః కుహోషతుః కో వాం శయుత్రా విధవేవ దేవరం మర్యనయోషా కృణుతేస ధస్తఆ

ఋ అ-7 అ-8 సూ-18 మ-2

"హే స్త్రీ చనిపోయిన నీపురుషునికి బదులు సనాతన ధర్మప్రకారం వేరొక పురుషుని స్వీకరించి, తద్వారా పుత్తు న్నమయ్యే సంతానాన్ని సమాజంలో యోగ్యులుగా తయారుచేసి సమాజానికి సౌభాగ్యాన్ని చేకూర్చుము." (1)

కాలాంతరంలోని యోగంద్వారా స్త్రీ పరిగ్రహించే పురుషుని దేవర అని పిలవటం జరిగింది. (2) యీనాటి నియోగపద్ధతి భార్య చనిపోయిన పురుషుడు, భర్త గతించిన స్త్రీ వీరిమధ్య ప్రధానంగావుంటూ, స్త్రీ పురుషులలో ఎవరైనా రోగగ్రస్థుడైనపుడుగానీ, నపుంసకత్వం వంధ్యాదోషం వగైరాసందర్భాలలో సంతానంకోరకునియోగం (సంబంధం) చేసుకొనవచ్చు. యిదే నియోగ పద్ధతిని మనువు కాలంలో మరికొన్ని మార్పులతో చూస్తాము.

ఆటవిక దశనుంచి స్త్రీ పురుష సంబంధాలలో జరుగుతూ వచ్చిన మార్పులు, యాదృచ్ఛికంగా జరుగుతూ వచ్చినవికాదు. మానవుడు చెల్లాచెదరుగా సంచరించటం మాని సమూహాలుగా ఏర్పడటం, స్థిరనివాసాలకు పునాదులు పడటంద్వారా ఋగ్వేద కాలంనాటి మానవుని జీవితంలో స్థిరత్వం, విశ్రాంతి లభించాయి. ఫలితంగా సమాజంలోను, ప్రకృతిలోను కలిగే పరివర్తనలకు కారణాలు వెదుకటం

1. ఇయం నారీ పతిలోకం వృణానా నిపద్యత ఉపత్వా మర్త్యప్రేతమ్ ధర్మ పురాణ మనుపాల యంతీత స్యైప్రజాం ద్రవణం చేహి ధేహి
అధ-కా 18 అను-3 సూ-3 మ-1

2. దేవర కస్మాద్ ద్వితీయో వర ఉచ్యతే నిరుక్తం. అ-3 ఖండ-15

ఆరంభించాడు. సమాజంలోను, ప్రకృతిలోను మంచిచెడ్డలను అన్వేషించి భవిష్యత్ జీవనానికి మంచియేదో, చెడ్డయేదో గుర్తించి చెడును ఖండిస్తూ, మంచిని ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నం చేస్తూ వచ్చాడు. అంతకుముందుదశలలో సంతానం కొరకు మాత్రమే వుంటూవచ్చిన స్త్రీపురుషసంబంధాలలో ఋగ్వేదకాలం నాటికి ప్రత్యేకగుణం అగుపించింది. అంటే సంతానవాంఛను అధికమించి కామవాంఛకు, ప్రాముఖ్యత ఏర్పడింది. తద్వారా విశృంఖల పరివర్తన అనిష్ట, అనర్థా, లకు ప్రాచీన పద్ధతులు దారితీశాయి. ఫలితంగా సమాజ భద్రతకు హానికల్గి, సమాజం తిరిగి విచ్ఛిన్నమయ్యే ప్రమాదం ఏర్పడింది. యీదశలో ప్రాచీన విధానాలకు కేవలం భిన్నమైన విధానాలుగాగాక, ప్రాచీన విధానాన్ననుసరించి యీ నూతన విధానాలను నిర్మించుకొంటూ వచ్చారు.

యింతవరకు మనంచూచిన మార్పులతోపాటు, స్త్రీ పురుషులుసంబంధాలుకల్గించుకొనేటపుడు వారంతకు వారుగా గాక ఆ తెగ పెద్దలద్వారా ఆసంబంధాలు నిర్ణయింపబడేవి. యీ సాంప్రదాయమే కాలాంతరంలో వివాహరూపంధరించి నేడుకూడా ఒకతంతుగా చెలామణీ అవుతూవుంది.

ఋగ్వేద కాలంలో నూతన స్త్రీ పురుష సంబంధాలు గానీ, లేక మల్లీమల్లీ ఏర్పరచుకొనే సంబంధాల సందర్భాలలోగానీ ఆ తెగపెద్దలుచేరి ఆవధూ వరులతో యీవిధంగా పలికించి, వారి సంబంధాలను ధ్రువపరచేవారు.

"హేస్త్రీ నేను (సౌభాగ్య) గృహస్థాశ్రమంలో సుఖ సౌఖ్యాల కొరకు నిన్ను పాణిగ్రహణం చేస్తున్నాను. నీకు

అప్రియమైన పనులు నేను ఎప్పుడూ చేయను అని ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఆదేవిధంగా స్త్రీకూడా నీకు అప్రియమైన ఏవ్యవహారంగానీ నేనెన్నడూ చేయను. మనమిద్దరం వ్యభిచార దోషరహితులమై వృద్ధాప్యం వరకు ఆనందమయమైన వ్యవహారాలను మాత్రమే చేస్తాము. మన యీ ప్రతిజ్ఞను ప్రజలందరూ సత్యమనినమ్మేరీతిగా వ్యవహరిస్తాము. ఋషులు, ఆర్యులు, (గణపెద్దలు) సూర్యుడు, అగ్ని మనిద్దరిమధ్య సాక్షులు. ఆర్యులు నన్ను నీకోరకు, నిన్ను నాకోరకు మనమిద్దరం పరస్పర ప్రీతితో కార్యాన్వితులమై గృహకృత్యాలు యోగ్యతతో చేసుకొనేందుకుగాను యిచ్చారు. అనృతంఆడము. ఎల్లపుడు ధర్మముతో మెలగుతాము. సమస్త ప్రపంచానికి ఉపకారం చేసేందుకు సత్యా విద్యను ప్రచారం చేస్తాము. దాంపత్య ధర్మంప్రకారం పుత్రులకని వారిని సుశిక్షితుల చేస్తాము. యీ నియమాలను సక్రమంగా పాలిస్తామని సాక్షుల యెదుట ప్రతిజ్ఞచేస్తున్నాము. రెండవ స్త్రీని గానీ, రెండవ పురుషునిగానీ, మనస్సు కర్మవాక్కులయందుగానీ యితర్లను కోరము. ఆర్యులను సంబోధిస్తూ మేమిద్దరం గృహాశ్రమంకొరకు వివాహము చేసుకొంటున్నాము. మీరు మాకు సాక్షులుగా వుండండి అని చెప్పబడుతుంది." (1)

---

1. "గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తంమయా పత్యాజరదష్టిర్యథాసః
భగో అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయదేవాః"
"ఇహైవ స్తం మావి యౌష్టం విశ్వ మాయుర్వ్యశ్నుతమ్
క్రీడన్తౌ పుత్రైర్నప్తృభి ర్మోదమానౌ స్వే గృహే."

ఋ అ 8, 3 - సూ 2, 7, 28 - శ్లో॥ 1, 2

అయితే యీవిధంగా ఆర్యుల సమక్షంలో నిర్ణయించుకొన్న సంబంధాలు స్త్రీపురుషులకు తర్వాత యిష్టమువున్న లేకున్న కట్టుబడి దాంపత్య జీవితాన్ని దుఃఖమయంగా సాగించాలని చెప్పదుఋగ్వేదం.దాంపత్యజీవితానికి ప్రథమసంబంధం ఫలప్రదంకాకపోతే పురుషునినుంచిస్త్రీకిగాని,స్త్రీనుంచి పురుషునికిగాని తిరిగి వేరొక సంబంధాలను నిర్ణయించుకొనటంలో ఎలాంటి ఆటంకాలు వుండకూడదు. స్త్రీపురుషులు యిద్దరుకూడా సంతోషంతో విడిపడి వేరొక సంబంధాలను నిర్ణయించుకొనటంలో పరస్పర ప్రోత్సాహ ముండవలెనంటూ తెలియజేస్తుంది. (1)

ఋగ్వేదంలో ఆదిమ సంబంధాలనుంచీ పరివర్తన చెందుతూ వచ్చిన మార్పులను సూచిస్తుంది. కానీ ప్రధానమైన ఆర్థిక వ్యవస్థలో యెలాంటి మార్పులు జరగనట్లే సూచిస్తుంది. సామూహిక గ్రామవ్యవస్థ (అంటే పనిచేయటంలోను, అనుభవించటంలోను అందరూ సమాన భాగస్థులేననే భావం కల్గివుండటం.) ఛిన్నాభిన్నం గాకుండా వుండే విధానాన్ని అనుసరించి ఆచరణ సాధ్యమైన మార్పులను తెచ్చారు. అయితే యీమార్పులు ఆచరణలో పూర్ణత్వాని, తర్వాత మహాభారత కాలంలోనూ, ఆతర్వాత మనువు కాలంలోనూ కూడా పొందలేక పోవటాన్ని చూస్తాము. , వేదకాలంనాటి ప్రజలు యీమార్పులకొరకు కృషిచేస్తూ సామూహిక వ్యవస్థను కాపాడ్రాకో గల్గారు. కానీ ఋగ్వేదకాలం అంత్యదశనుంచీ సామూహిక వ్యవస్థ ఛిన్నాభిన్నమై పోయింది.

---

1. అన్యమిచ్ఛ స్వసుభ గేపతింమత్ -ఋ.మం -10సూ10

అయినప్పటికీ స్త్రీ పురుష సంబంధాలలో ప్రాచీన సంబంధా లకు, ఋగ్వేదంలో సూచించబడిన నూతన సంబంధాలకు మధ్య ఘర్షణ జరుగుతూ వున్నట్లు ముందుముందు చూస్తాము.

స్త్రీ పురుష సంబంధాలలో తీసుక రాబడిన మార్పు లను చూశాము. యీ మార్పులద్వారా స్త్రీల విషయంలో సామాజికంగా స్త్రీకున్న విలువను తగ్గించటంగానీ, అందుకు కృషిచేయటంగానీ జరగలేదు. స్త్రీలుకూడా పురుషునితో సమానంగా సామాజిక కార్యక్రమాలలో పాల్గొంటూ వున్నట్లు చెప్పబడింది.

వేదకాలం నాటికి మానవుని జీవితంలో స్థిరత్వం, విశ్రాంతి దొరకటంద్వారా విజ్ఞానానికి పునాదులు వేయ బడ్డాయని చూశాము. అయితే యీ విజ్ఞాన అన్వేషణ స్త్రీలకు సంబంధంలేకుండా, పురుషులు మాత్రమే చేయటం జరగలేదు. పురుషులతోపాటు స్త్రీలుకూడా అధ్యయనము, అన్వేషణ వగైరా కార్యక్రమాలలో పాల్గొంటూ వుండినారు.

"స్త్రీలు పురుషులతో సమానంగా బ్రహ్మచర్యాశ్రమం ద్వారా శిక్షణ పొందడం, వేదపాఠ అధ్యయనం చేయడం, చేయించడం సంఘ శ్రేయస్సుకుగాను అవుసరం కల్గినపుడు స్త్రీలు తమ యోగ్యమైన పనిని చేయటం."

హారీతస్మృతిలోగూడా స్త్రీవిద్యను గురించి స్త్రీలలో రెండు తెగలుగా వున్నట్లు చెప్పబడింది. 1. బ్రహ్మవాదినీ, 2. సద్యోవధూ. బ్రహ్మవాదినీ పురుషులతోపాటు విద్యనభ్య

---

"పురాకల్పేషు నారీణాం మౌంజీ బంధన మిష్యతే
అధ్యాపనంచ వేదానాం సావిత్రీ వాచనం తథా."

సించటం, యితర్లకు బోధించటం, సమాజ శ్రేయస్సుకొరకు పాటుపడటం,సద్యోవధూ పురుషులతో సమానంగా ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొనటం, సంతానాన్నికని సమాజ అభి వృద్ధికి తోడ్పడటం, ఉ॥ బృహదారణ్యక వుపనిషత్ కాలపు గార్గి, మహాభారత కాలపునాటి సులభ, రామాయణకాలపు నాటి శబరి, స్వయంప్రభ వగైరాలను బ్రహ్మవాదినులుగా మనంచూస్తాము.

ఋగ్వేదం 5, 61, 8 సాయణుడు నిర్వచనంచేస్తూ పతిపత్ని ఒకే తత్వానికి చెందిన సమానమైన రెండుభాగాలు కాబట్టి అన్నివిధాలా వారు సమానులు· లౌకికంగా, నైతి కంగా,ధార్మికంగాఆర్థికంగాఅన్నివిధములైనపనులయందువా రుసమ్మిశ్రితంగా భాగస్వాములు కాలసినవారే అంటూపున రుద్ఘాటిస్తూ వుందని నిర్వచించాడు.

"స్త్రీలు కన్యాత్వ దశలో బ్రహ్మచర్య మవలంభించి పూర్ణ యౌవన సంప్రాప్తు లగువరకు విద్య వేదపాఠ అధ్య యనం గావించి, యౌవన దశయందు అనుకూలమైన పతిని పొందవలెనని అధర్వణవేదం తెలియజేస్తూవుంది.'' (1)

స్త్రీ విద్యను గురించి, ఆనాటి స్త్రీలు స్వతంత్రంగా వేద రచన చేయటంలో పాల్గొన్నట్లుకూడా వేదాలు మనకు తెలియజేస్తున్నాయి. అంభృణ్ పేరుగల మహర్షి కూతురు వాంగ్ అనునామె ఋగ్వేదంలో 10 మండలం, 125 సూక్తం రచించింది. యీామె ఆనాటి స్త్రీయొక్క సాహిత్య ప్రతిభను

(1) బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్.
అధ॥ కా॥ ప్ర24 అ3 మం18.

సాంఘిక కార్య కలాపాలలో ఆమె నిర్వహించిన పాత్రను వర్ణించింది.

"నేను ధనుస్సుధరించి రుద్రునివలె సంచరించగలను. (బ్రహ్మ) గణసంఘంయొక్క శత్రువులైన వారిని నాశనం చేసేందుకు ప్రజలకోరకు పోరాడుతాను. ప్రజలకు ఆధారము నేనే. పృథివియందు, ఆకాశమందు సంచరించగలను. సర్వత్రా నాస్వరూపాన్ని ప్రదర్శించగలను." (1)

యీమె తనఅధికార ఆధిక్యతలను గురించి యీవిధంగా చెప్పింది.

"నేను రాణిని. (రాష్ట్రి) నేను ఐశ్వార్యాన్ని ప్రోగు చేయగలను. ప్రప్రథమంగా నేను దేవతలకు జ్ఞానప్రధానం చేశాను. కాబట్టి దేవతలు అనేక స్థలాలలో నన్ను స్థాపించి పూజించారు. నన్ను ప్రతిచోటికి వేళ్లేదానినని, నివసించే దానినని స్తుతించారు." (2)

యీమె సాహిత్య రంగంలో సరస్వతిగా, సామాజిక రంగంలో (దుర్గ) శత్రు సంహారిణిగా, మాతగా, సర్వాధికారిణిగా, కష్టించి వస్తుసంచయం చేసేదానిగా చెప్పింది.

---

1. అహమ్ రుద్రాయ ధనురాతన్యామి
   బ్రహ్మద్విషే శరవే హంతవా ఉ
   అహమ్ జనాయ సమదక్ృణో
   మ్యహం ద్యావా పృథివీ ఆవివేశ.
2. అహమ్‌రాష్ట్రీ సంగమనీ వసూనాం
   చికితుషీ ప్రథమాయజ యానామ్
   తాం మా దేవా వ్యందధు పురుత్రా
   భూరిస్థాత్రాం భూర్యా వేశయంతీమ్.

యీామె రచనలో మాతృ సత్తాక యుగపు స్త్రీ శక్తిని ప్రతిబింబించింది. ఋగ్వేదకాలానికి పూర్వంనుంచి, ఋగ్వేద ప్రారంభం వరకు ఆదిమ కమ్యూనిస్టు గణసంఘాలు, లేక సాముదాయక కుటుంబాలు అని చెప్పబడుతుంది. సాముదాయక (సామూహికఆస్థి) ఒక తెగ, లేక గోత్రం. మొత్తంగా కలిసి వ్యవహరించడం జరిగింది. యీాదశలో ఒక్కొక్క తెగకు ఒక స్త్రీ నాయకత్వంవహించి నడిపింది. ఆ తెగలో పిల్లలు అందరి పిల్లలుగానే భావించబడుతారు. ఆస్థి సంపాదనా సామూహికంగానే వుంటుంది. తర్వాతదశలో సమిష్టికుటుంబాలు ఏర్పాటుఅవుతాయి. సమిష్టిఆస్థి తల్లి, తండ్రి, బిడ్డలు, తమ్ముళ్లు, పెండ్లికాని తోబుట్టువులు, యిల్లుభూమి,పరికరాలు, పశువులు, జంతువులు వగైరా ఆకుటుంబానికి మాత్రమే ప్రత్యేకించబడినవి. యీాదశలోకూడా స్త్రీ పురుషునికి సరి సమానమైన హోదాలోనే వ్యవహరించింది.

ఋగ్వేద కాలంలో ఉత్పత్తి పరికరాలలో వచ్చిన మార్పులు, ఉత్పత్తిని కొంత సౌలభ్యంచేశాయి. దీనితో పాటు యుద్ధాలలో వేరొక తెగలనుంచీ ఖైదీలుగా గొని రాబడినవారి సంఖ్యకూడా పెరగటం ప్రారంభించింది. యీా ఖైదీలద్వారా ఎక్కువపనులుచేయించి ఉత్పత్తిని అవసరాని కంటే ఎక్కువగా తయారు చేయటం, (చేయించటం) ప్రారంభమయింది. ఖైదీలుగా వచ్చిన వారిలో సౌందర్యవతులను ఆ తెగలోని వారికి వుంపుడు కత్తెలుగా వుపయోగించుకొనటం జరిగేది. సమిష్టి కుటుంబాలలోని ప్రధానంగా పురుషులే యుద్ధాలలలో పాల్గొనడం, తమ వాటాకు వచ్చిన

ఖైదీలపైన పురుషుడే అధికారం కలిగివుండటం, ఉత్పత్తి కార్యక్రమాలలలో యీ ఖైదీలను (దాస) వుపయోగించు కోవటంద్వారా విశ్రాంతి, సుఖసౌఖ్యాల అదనంగా అనుభవించాలనే కోరిక వగైరా కారణాలు వ్యక్తిగతఆస్థికి పునాదులు ఏర్పడ్డాయి. యీదశలో కుటుంబమనేదే ముఖ్యం అయిపోతుంది. ఆస్థికి, సంతానానికి స్త్రీలకు సర్వస్వంపైనా ఒకేవ్యక్తి అధికారం కలిగివుంటాడు.

యింతవరకు మనంచూచిన ఆదిమ దశను తర్వాత శాస్త్రకారులు(కృతయుగం)కృత-సత్యయుగమనికీర్తించారు. ఆనాటి వ్యవహారాలు తర్వాత వారికి అసభ్యంగా అగుపించినప్పటికీ ప్రధానంగా వారు పరిశుద్ధ హృదయాలతో నిష్కపటంగా వ్యవహరించారు కాబట్టి, వారి వ్యవహారాలకు దోషాన్ని ఆపాదించలేకపోయారు.

వేదకాలం తర్వాత త్రేతాయుగం ప్రారంభ మవుతుంది. అంటే సత్యయుగంలోనివారు నిష్కలంకహృదయులు కాబట్టి వారి ధర్మాన్ని సంపూర్ణంగాను, త్రేతాయుగంలోని ప్రజలలో హృదయ పరివర్తనజరిగింది కాబట్టి, ధర్మం నాలుగింట ఒకభాగం హరించిందని చెప్పటం జరిగింది. యీయుగానికి సంబంధించిన చరిత్రను రామాయణం ప్రతిబింబిస్తుంది.



## రామాయణ కాలపు - స్త్రీలు

రామాయణ కాలంనాటికి ప్రైవేటుఆస్థి సంపూర్ణంగా ఆచరణలోకి వచ్చింది. ఇక్కడ మనమొకవిషయాన్ని గుర్తించాల్సి వుంటుంది. యీమార్పులు, పరివర్తనలు ఆనాటి మొత్తం ప్రజానీకానికి చెందినవికావు. తెగలలో జరిగే యుద్ధాలలో విజయం గాంచటంద్వారా కొన్ని తెగలు బలపడటమేగాక, ఆ తెగలు ప్రత్యేక సంస్కృతిని నిర్మించుకొంటూ వచ్చాయి. ఆప్రత్యేక సంస్కృతీ ప్రభావాల ఫలితంగా వ్యక్తిగత ప్రాబల్యం అమలులోకివచ్చింది. అయితే యీ తెగలనుంచి విడిగా వుండిపోయిన తెగలు, వాటి సామూహిక విధానాన్ని కాపాడుకొంటూ వచ్చాయి. యిటువంటి తెగలుమనకు మహాభారత కాలంనాడు, తర్వాత బుద్ధయుగంలో కూడా అగుపిస్తాయి. ప్రైవేటుఆస్థికి బీజాలు మొదట్లో అర్యులే వేసినారు. యీదశలోనే ఆర్యులు సతీ సాంప్రదాయాన్ని కూడా ప్రవేశపెట్టారు. వీరి సిద్ధాంత ప్రకారం స్త్రీ భోగ్య. పురుషుడు భోగి. భోగి (పురుషుడు) అనంతరం భోగ్య (స్త్రీశరీరాన్ని) వుండేటందుకు అధికారం లేదు. యీసాంప్రదాయం అమలులోకి వచ్చింతర్వాత స్త్రీలు విపత్కర విపరీత పరిస్థితులను ఎదుర్కోవాల్సి వచ్చింది. ప్రైవేటు ఆస్థితోపాటు ఆర్యులు బహుపత్నిత్వాన్ని కూడా

కల్గివుండేవారు. ఫలితంగా ఆర్యులు మరణించినపుడు అతని కాష్టంపైనే అతన స్త్రీలు అందరు కాలిపోవాల్సి వచ్చింది. యిందుకు మరి రెండు కారణాలుకూడా వున్నాయి. 1. తన తర్వాత తనస్త్రీలను యితరులుభోగించకూడదనేఅభిప్రాయం. 2. అతని మరణానంతరం అతనికి యింకొక ప్రపంచంవుంది. (స్వర్గం) అక్కడ యితని దేవత ఇంద్రుడు అనేకమంది వేశ్యలతో వివహరిస్తుంటాడు. యితనుకూడా అక్కడే పోవాల్సి వుంటుంది. కాబట్టి అక్కడ యితని సుఖసౌఖ్యాలకు ఎలాంటి అవాంతరాయాలు కలుగకుండా యిక్కడినుంచే అతనికి సంబంధించిన సమస్త విలాస వస్తువులు అతనితో అక్కడికి తీసుకపోవాలనే వాంఛ. యీ సాంప్రదాయం తర్వాత ద్రావిడులలోకూడా వ్యాపించింది.

పరశురామ చరిత్ర మాతృ సత్తాకయుగం నుంచీ, పితృసత్తాకయుగపు మార్పును సూచిస్తుంది. జమదగ్ని అనే మునీశ్వరుడు కుమారుడైన పరశురాముని తల్లియైన రేణుకను చంపమని ఆజ్ఞాపిస్తాడు. పరశురాముడు ఎలాంటి సంకోచం లేకుండా తండ్రి ఆజ్ఞప్రకారం తల్లిని సంహరిస్తాడు. అంటే మాతృ సత్తాకయుగంలో పుత్రునికి తల్లిఆజ్ఞ ప్రధానమైతే, పితృసత్తాకయుగంలో తండ్రిఆజ్ఞ పుత్రునికి అనుల్లంఘనీయం గావుంటుంది.

రామాయణం ముఖ్యంగా రాముని ఏకపత్నివ్రతాన్ని, సీత ఏక పతివ్రతాన్ని ఆధారంగా తీసుకొని ఆనాటి సామాజిక పరివర్తనను చిత్రించటం జరిగింది. అంతకు మునుపు మనముచూచిన బహుభార్యత్వకంటే సీతారాముల ఏకపతి,

ఏక పత్నీవ్రతాలు శ్రేయస్కరమైనవే. అయితే చరిత్ర
కారుడు పితృసత్తాకయుగపు ఆశయమైన స్త్రీని అన్నివిధాలా
పురుషునికి ఆశ్రితదాసీ అనే భావాలను అందులో యిమిడ్చటం
వల్ల సీతా రాముల దాంపత్యజీవితం అతి నికృష్టంగా తయా
రైంది. అంతేగాకుండా మొత్తం స్త్రీజాతి దుర్గతికి ధార్మిక
ముసుగులు బలమైన పునాదులు వేయబడ్డాయి. రావణవధ
తర్వాత సీత తన పాతివ్రత్యాన్ని ఋజువు చేసుకోనేందుకు
అగ్నిపరీక్ష గావాల్సి వచ్చింది. కానీ తర్వాత దశలో పురు
షుని ఆత్మగౌరవానికి విఘాతం కలిగించే ఒక్కమాటకు సీత
అగ్ని పరీక్షద్వారా తిరిగి తెచ్చుకొన్న పాతివ్రత్యాన్నేగాక
తనజీవిత సర్వస్వాన్నే అర్పించాల్సి వచ్చింది. అంటే స్త్రీజీవితం
పురుషుని యిష్టాసష్టాలకు అడుగడుగున బలిదానం చేయాల్సిన
పరిస్థితులు కల్పించబడినవన్న మాట యీపితృసత్తాక కుటుం
బంలో, కుటుంబంపైన తండ్రి సర్వాధికారాలు కల్గివుంటాడు.
తండ్రితర్వాత పెద్దకొడుకుకు ఆఅధికారాలు సంక్రమిస్తాయి. భర
తుని రాజ్యత్యాగం, లక్ష్మణుని సోదరప్రేమ వగైరాలు
యీవిషయాన్ని ధృవపరుస్తాయి. యీధార్మిక ముసుగులు
తగిలించి స్త్రీజాతియొక్క అస్థిత్వానికే విఘాతం కల్పించ
బడింది. యిది రామాయణ కర్తయొక్క ప్రధానోద్దేశ్యం.
అయితే యీవిధంగా తలెత్తుచున్న పురుషుని నిరంకుశత్వా
నికి ప్రాచీన సాంప్రదాయిక స్త్రీ స్వాతంత్ర్య అవశేషలకు
మధ్య ఘర్షణను ప్రతిబింబించే పలురకాల పాత్రలుకూడా
రామాయణంలో ప్రధాన్యత వహిస్తాయి. ఆర్యస్త్రీ అయిన
కైకేయి దశరధునితోపాటు యుద్ధాలలో పాల్గొంటుంది.

యీామె శౌర్య సాహసాలకు ప్రతిఫలమే రాముని వనవాసానికి కారణమయింది. ద్రావిడ మునీశ్వరుని కూతురైన శూర్పనఖ ఆదిమ సాంప్రదాయాన్ననుసరించి రామలక్ష్మణుల పొందగోరుతుంది. సుకేతుడను యక్షుని కూతురు తాటక, ఆర్యజాతీయుడైనజంభకుమారుడు సుకేతునివరిస్తుంది. యీావర్ణాంతరసంబంధాన్ని వశిష్ఠుడు సంహరించలేక సుందుని చంపిస్తాడు. తాటక, కుమారుడు వశిష్టుడు చేసిన హింసకుప్రతిహింస చేస్తారు. వశిష్టాశ్రమంలో వున్నవారందరు ప్రాణసంరక్షణార్థం పలాయణం చిత్తగిస్తారు. వశిష్టుడు తాటకను, తాటక కొమారుని రాక్షసు కండని శపిస్తాడు. అంటే ఆర్యజాతినుంచి వెలివేయడం అన్నమాట. దీనితో తాటక క్రోధం, ద్విగిణీకృతమయి బ్రాహ్మణులను సర్వనాశం చేసేందుకు పూనుకొంటుంది. తర్వాత రామునిద్వారా తాటకను చంపించటం జరుగుతుంది. అయితే పురుషాధిక్యతకు ప్రాముఖ్యత యిచ్చిన రచయిత వీరిది రాక్షస ప్రవృత్తి అనాల్సి వచ్చింది.

వ్యభిచారం అపవిత్ర మైనదనే ఉద్దేశ్యాన్ని ఇంద్ర, అహల్య పాత్రలద్వారా నిరూపించబడింది. వేదకాలపుస్త్రీ స్వాతంత్ర్యాన్ని బ్రహ్మచర్యము ద్వారా విద్యాభ్యాసణ, ఆధ్యాత్మిక చింతనను శబరి, స్వయంప్రభ వగైరాలద్వారా వ్యక్తం చేయబడింది. బహు పత్నీత్వం వలన కలిగే అనర్థాలను దశరథుని రాజమహల్‌లో వున్నట్టి మయిన కుతంత్రాలు, వాటివల్ల కలిగిన అనర్థాలద్వారా నిరూపించబడింది.

వాలి సుగ్రీవులగాథ సామూహిక కుటుంబపద్ధతినుంచి ప్రైవేటు ఆస్తికి మార్పుకొరకు జరిగిన ఘర్షణగా వుంటుంది. యీకాలానికి ద్రావిడులలో చాలామంది ఆర్యులప్రాబల్యాన్ని అంగీకరించి, వారికి అణగి మణగివుంటూ ఆర్థికంగా, సైనికంగా ఆర్యులకు సహాయం చేయుటంద్వారా ఆర్యుల సానుభూతిని సంపాదించుకొనేవారు. వాలిసుగ్రీవులు ఆర్యులకు యుద్ధాలలో సహాయం చేసినందుకుగాను ఆర్యులు వీరికి సమిష్టిగా అనుభవించమని పారితోషికంగా తారనుయివ్వటం జరిగింది. వీరు కొంతకాలం సమిష్టిగానే వుంటారు. కానీ వ్యక్తిగత ఆకాంక్షలకు త్వరలోనే లోనై వారి సమిష్టి భావాన్ని కోల్పోవటం జరుగుతుంది.

రామాయణ యితివృత్తానికి ఆధారం వాల్మీకి, నారదునివలన వినినట్లు చెప్పబడింది. అయితే నారదుడు ఎవరివల్ల ఎక్కడ సంగ్రహించినాడనే వివరాలుమాత్రం చెప్పబడలేదు. ఋగ్వేదంలో ఒక శ్రీరాముని పేర్కొనటం జరిగింది. అయితే ఋగ్వేదంలోని శ్రీరాములకు సీత సోదరియని చెప్పబడింది. రామాయణ రచనా విధానాన్నిబట్టి అధర్వణ వేదకాలపు నాటి సామాజిక పరిస్థితులతో సరిపోల్చవచ్చు. మనప్రాచీన వాజ్మయాన్ని దేన్నికూడా ఫలానా కాలపునాటిదిఅని లెక్కపెట్టలేము. ఎందుకంటే హిందూదేశ గణితశాస్త్ర ప్రకారం (ప్రాచీన) 60 ఏండ్లవరకు మాత్రమే లెక్కపెట్టగలం. కాబట్టి ప్రాచీన కాలాన్నిగురించి సరైన అంచనావెయ్యటం కష్టం. బుద్ధుని కాలాన్నుంచీ మాత్రమే మనకు సరైన కాల నిర్ణయం దొరుకుతుంది.

అథర్వణం వేదకాలంనాటి స్త్రీని గురించి ఒకవైపు పురుషునియొక్క ఆశ్రితగా, అబలగా, రక్షితగా చేసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నప్పటికీ మరొకవైపు స్త్రీ తన ఆస్తిత్వాన్ని కాపాడుకోనేందుకు ప్రయత్నిస్తూ వచ్చింది. కాబట్టే రామునికి తాటకను చంపినందుకు స్త్రీహత్యా దోషంగానీ, శూర్పనఖను పరాభవించినందుకు దుర్మార్గుడని కానీ చెప్పబడలేదు. ఎందుకంటే స్త్రీలుకూడా పురుషునితో సమానంగా వ్యవహరించడం, తొడచరిచి యుద్ధంచేయడం ఆనాటి స్త్రీజాతికి లజ్జాకరమైన విషయంకాదు. ధైర్యసాహసాలను కనబరచటం గౌరవంగా భావించబడేది.

అయితే పితృసత్తాక యుగపు వ్యక్తిగత అధికారాన్ని కాపాడటమే ప్రధాన వుద్దేశం గావటంవల్ల రామాయణం ధార్మిక ముసుగులు తగిలించుకొని ప్రథమంలోనే దైవత్వాన్ని ఆపాదించుకోనాల్సి వచ్చింది. యీ దైవత్వం కూడా ప్రజల హేతువాద విమర్శనలకు ఎగిరిపొయ్యేదశలో ఆధ్యాత్మిక ముసుగు తగిలించుకొని ప్రత్యక్ష మయింది. దీన్నిబట్టి మనకు తేలేదేమంటే వాల్మీకిరామాయణం మహాభారతకాలం తర్వాత ఫ్యూడల్ వ్యవస్థయొక్క విధివిధానాలను రామాయణకాలం నాటికే సమాజంలో కలవని నిరూపించేదుకు రచయిత విఫల ప్రయత్నం చేశాడు. ఎందువల్లనంటే వాల్మీకి రామున్ని ఆదర్శవీరుడుగానూ, సత్యసంధుడుగానూ, దైవాంశ సంభూతుడుగాను చిత్రించాడు. కానీ ద్రావిడ నాయకుడైన వాలిని ప్రత్యక్షంగా ధర్మయుద్ధంలో జయించలేక కుట్రద్వారా చాటునుంచి వధించటంతో అతని

ఆదర్శము, సత్యసంధత మంటలో గలిసిపోయాయి. ప్రాచీన సాంప్రదాయిక హక్కులయిన వేదాధ్యయనం చేయదలచిన శంభుని శూద్రుడనే కారణాన్నిబట్టి హత్యచేయడంతో అతని దైవత్వమేగాక, మానవత్వాన్నికూడా కోల్పోతాడు. అతని ఏకపత్నీవ్రతం నగుబాట్లపాలై రచ్చకెక్కింది. యీవిధంగా కపోల కల్పిత విషయాలను రామాయణానికి అంటగట్టుట వల్ల రామాయణం చారిత్రక ప్రాముఖ్యతనే కోల్పోయి కేవలం కల్పిత గాథగా తయారయి కూర్చుంది. అయినప్పటికీ ఫ్యూడల్ ప్రభువులు ప్రజల్లో రామాయణంపైన భక్తి ప్రపత్తులు కలిగించటంలో కొంతవరకు సఫలులయారనే చెప్పవచ్చు. అయితే యీమూఢ భావాలను అప్పుడప్పుడు బట్టబయలు చేస్తూవచ్చిన మహానుభావులుకూడా లేకపోలేదు.

300 800వందలఏడ్లనాటి వేమనయోగి యీవిధంగావిమర్శించాడు

ఆ॥ కనక మృగము విభుని కద్దులేదనకుండ తరుని విడచి
చనియె దాశరథియు, తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా

ఆ॥ అగ్నిబాణముచేత అంబుధింకినపుడె రాముడవలికేళగ
లావుమరచి, వరుస కొండలుమోసి వారధిలగ కట్టె.



# మహాభారత కాలపు - స్త్రీలు

5000 ఏండ్ల క్రిందటి చరిత్రను మహాభారతం తెలియ జేస్తుంది. మహాభారత ప్రధాన లక్ష్యం ప్రాచీన సామాజిక కుటుంబ విధివిధానాల గురించి, సమాజం విచ్ఛిన్నమవుతూ ప్రైవేటుఆస్థి ప్రాబల్యం కొరకు ప్రాకులాడే సామాజిక పరస్పర విరుద్ధ శక్తులమధ్య ఘర్షణను ప్రతిబింభిస్తుంది. ఆనాటి యీ సామాజిక పరివర్తన సంధికాలాన్ని తెలియజేయటంలో కేవలం అభూత కల్పనలకు ప్రాముఖ్యత యివ్వకుండా వాస్తవికతను, డొంకతిరుగుల్లు లేకుండా తెలియచేయుటంవల్ల మహాభారతం వేదప్రతిపత్తిని పొంది పంచమవేదంగా, ప్రామాణిక గ్రంథంగా పరిగణింపబడుతూవుంది.

యీ కాలంనాటికి సామాజిక వ్యవస్థలో ఆదిమకమ్యూనిస్టు గణసంఘ అవశేషాల ప్రాబల్యం పూర్తిగా వున్నట్లు చెప్పబడింది. భీష్ముడు గణసంఘాలయొక్క ప్రాబల్యాన్ని గురించి ధర్మరాజుతో యీవిధంగా చెప్తాడు. వస్తుసంపాదకులు, కార్యశూరులు, నిపుణులు, ఆయుధధారణులు, పలువిధ కళాకౌశలులు, ఒక్కకులము, ఒక్కయిల్లుగా గలవారు యెట్టివారితోనైనా స్నేహపూర్వకముగా వ్యవహరించువారును, మొదలగులక్షణములతో కూడుకొన్న గణప్రజలు అట్టివారితో మైత్రీ పూర్వకంగా దగురీతుల వారిని ఆదరించి

వారిసహాయాన్ని పొందవలెను. లేనియెడల రాజ్యము అపాయకరంబు. గణప్రజలు ఏ ప్రభువునకు అండగా వుందురో ఆ ప్రభువునకు సిరిసంపదలు వుండును. కాబట్టి గణప్రజల గుర్తెరింగి ప్రవర్తించవలెనని చెపుతాడు.

(శాంతిపర్వం తృతీయాశ్వాసం 30 ప॥ నుంచి 41 వరకు)

దీన్నిబట్టి యీకాలంనాటికి బానిస విధానమూ, సంపత్తి వీటిపైన వ్యక్తిగత అధికారాల కొరకు బానిస ప్రభువులలో ఉత్పన్నమయిన ఆంతరంగిక కక్షలతో సతమతమవుతూవున్న రాజ్యాంగనీతి. మరొకవైపు సంపత్తికొరకు, వ్యక్తిగత సుఖసౌఖ్యాలకొరకు కుటుంబంలోనే స్పర్థలు, హత్యలు అంటే ఏమిటోకూడా ఎరుగని గణతంత్ర కుటుంబ విధానమూ, వీటితోపాటు గణతంత్ర సమాజం యొక్క స్త్రీ స్వాతంత్ర్యంవొకవైవు, మరొకవైపు స్త్రీని అస్వాతంత్ర్యనుగా చేసి పురుషుని పెత్తనంక్రింద త్రొక్కిపెట్టాలనే నూతన ప్రైవేటు సామాజిక విధివిధానాలూ, పరస్పర విరుద్ధములైన పాతకొత్త ధార్మిక సాంప్రదాయాలమధ్య ఘర్షణ మొదలైన సమాచారాన్ని మహాభారతం మనకు తెలియజేస్తుంది.

దాశరాజు కూతురు మత్స్యగంధి యమునానదీ తీరమున పడవలనడిపే కార్యక్రమంలో నిమగ్నయై వుంటుంది, వశిష్ఠుని మనుమడు పరాశరుడు అను మునీశ్వరుడు సంచారం చేస్తూ నదిని దాటేందుకు అక్కడికి వస్తాడు. మత్స్యగంధిని చూస్తూనే యీాయనకు కామం పెల్లుబుకుతుంది. తనకోర్కెను తీర్చేందుకు తనతోసంభోగించమని మత్స్యగంధిని ప్రార్థిస్తాడు.

అందుకు ఆమెకూడా సమ్మతిస్తుంది. కానీ అక్కడే జనసంచార ప్రదేశంలో పరాశరునితో సమాగమాన్ని తిరస్కరిస్తుంది. పరాశరుడు ఆమెకు ప్రాచీన స్త్రీ పురుష సంబంధాలను గురించి బోధిస్తూ యిది ప్రాకృతిక ధర్మాలలో ప్రధాన ధర్మం. "అంటే స్త్రీ తిరిగి తిరిగి పురుషులను స్వీకరించినప్పటికీ కన్యాత్వంబు దూషితంబుగాదు అని బోధించి ఆమెను సమ్మతింపజేసి అక్కడే తమకోర్కెను నిర్లజ్జతో తీర్చుకొంటారు. ఫలితంగా వీరికి వేదవ్యాస మునీంద్రుడు జన్మిస్తాడు."(1) యీవిధంగా జరిగిన వీరి సంపర్కాన్నిగానీ, వీరి పుత్రుడైన వేదవ్యాసునిగానీ సమాజం ఏనాడూ తిరస్కరించలేదు. అదనంగా వారిని పూజించటం, స్తుతించటం జరుగుతూవుంది. యిక్కడ వీరి జనప్రదేశంలో నిర్లజ్జతో కామక్రీడలు సల్పటం ఒకసత్యాన్ని తెలియజేస్తూవుంది. అదేమిటంటే యిక్కడమనం వీరి కామకోర్కె అనేదాన్ని ప్రధానంగాగాక,సృష్టిక్రమానికిఅవసరమైన యీకార్యాన్ని ఋతుకాలప్రవర్తనను తెలిపేఆదిమప్రజలుమెలగేవారనిమనంయిది పరికేచూశాము.ఆసత్యాన్నేపరాశరమత్స్యగంధివ్యవహారం పునరుద్ఘాటిస్తూవుంది. అంతేగాక మత్స్యగంధి పరాశరుని సంవాదం, వారి ఆచరణ మనకు ప్రాచీన సాంప్రదాయపు పోకడలు యీకాలానికీ నశించలేదనీ, వాటికి యీకాలంలో యింకా విలువ వుండివదని తెలియజేస్తుంది.

మత్స్యగంధి పరాశరుని సంబంధంతో యోజనగంధి లేక పుష్పగంధిగా మారుతుంది. యీమెతిరిగి భారత ప్రపితా

(1) పేజీ–60–61 ఆదిపర్వం. తృతీయాశ్వాసం

మహాన్యుడైన శంతనుని వరించి సత్యవతిగా మారుతుంది. శంతనుడు సత్యవతికంటే మునుపు గంగఅనేస్త్రీని వరిస్తాడు. యీగంగా శంతనులకు జరిగేసంవాదంకూడా స్త్రీ సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని వ్యక్తంచేస్తుంది. గంగ శంతనుని వరించే టపుడు కొన్ని షరతులుపెడుతుంది. నేను ఏమిచేసినప్పటికీ, ఎలా ప్రవర్తించినప్పటికీ, నాఅభీష్టం ప్రకారం నీవు నడచు కొననినాడు మనసంబంధం రద్దవుతుంది అనిచెపుతుంది. శంతనుడు అందుకు అంగీకరిస్తాడు. కానీ భీష్ముని జననాంతర్వాత శంతనుని వ్యతిరేక ప్రవర్తనవల్ల గంగ శంతనుని విడిచి వెల్లిపోతుంది. (1)

తర్వాత శంతనుడు సంతానవతియైన యోజనగంధి యొక్క సౌందర్యానికి మోహితుడై వివాహ మాడ గోరు తాడు. అయితే యీకాలానికి తండ్రితర్వాత పెద్దకొడుకుకు అధికారం అనే సాంప్రదాయ ప్రకారం శంతనుని తర్వాత భీష్ముడు అధికారం వహించాల్సి వుంటుంది. యోజనగంధి నాకు కలిగే సంతానానికి అధికారం వచ్చేటట్లైతే వివాహ మాడతా నంటుంది. యిది పెద్దఆటంకమై కూర్చుంటుంది. యీసమస్యను పరిష్కరించేందుకు భీష్ముడే యోజనగంధి వద్దకెల్లి నీసంతానానికే అధికారం నప్పగిస్తామని యోజన గంధితో చెపుతాడు. కానీ యోజనగంధి మీసాంప్రదాయం ప్రకారం నీవు పదవీత్యాగం చేచినప్పటికీ, నీకుకలిగే సంతాన మైనా ఆహక్కును గుంజుకొనవచ్చు నంటుంది. భీష్ముడు రాజ్య పరిత్యాగముతో పాటు, ఆజన్మ బ్రహ్మచర్యవ్రతం

1. ఆదిపర్వం చతుర్థాశ్వాసం 102 పేజీ

దాల్చినట్లు ప్రకటించటంతో, పేచీ పరిష్కారమై యోజన గంధి శంతనుని వివాహమాడి సత్యవతిగా మారుతుంది. (1)

యీచరిత్రలో మత్స్యగంధి పరాశరుని సంబంధాన్ని వీరిపుత్రుడు వేదవ్యాసుని, తర్వాత మత్స్యగంధి శంతనుని సంబాధాన్నిబట్టి ఋగ్వేదంలో మనంచూచిన స్త్రీ పురుష సంబంధాలు, స్త్రీ స్వాతంత్ర్యాన్ని సర్వసాధారణ మైనదిగా మాత్రమేనని తెలుసుకోనగలం.

యీ సత్యవతీ శంతనులకు చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అను యిద్దరు పుత్రులు జన్మిస్తారు. చిత్రాంగదుడు బాల్యంలోనే గంధర్వులచేత చంపబడుతాడు. విచిత్రవీర్యుడు కాశీరాజు పుత్రికలైన అంబా, అంబికలను వివాహమాడి నిస్సంతానుడై చనిపోతాడు. (2)

పిత్రార్జితాన్ని వంశపరంపరకు మాత్రమే గుత్తకు తీసుకొన్న భరతవంశంలో బ్రహ్మచారి, రాజ్యత్యాగి అయిన భీష్ముడు మాత్రం మిగులుతాడు. భీష్ముడు వివాహానికి సమ్మతించకపోవటంవల్ల వంశగత హక్కులకు తిలాంజలి అర్పించాల్సిన పరిస్థితులు ఏర్పడుతాయి. అప్పుడు ప్రాచీన సాంప్రదాయానికి, నూతన సాంప్రదాయాన్ని సమన్వయంచేసి అంబా, అంబికలయందు క్షేత్రజుల ఉత్పన్నం చేసేందుకు వేదవ్యాసుని నియమిస్తారు. సత్యవతి వేదవ్యాసుని సంతానోత్పత్తికి నియోగిస్తూ యీవిధంగా చెపుతుంది. పుత్రిడవైననిన్ను ఆజ్ఞాపించేహక్కు తండ్రితోపాటు తల్లికివుంది. అయినను

1. ఆదిపర్వం పేజీ 105, 106, 107.
2. ఆదిపర్వం పేజీ 114.

నేటివరకూ మార్పు చెందుతూ వచ్చిన మూడువిధాలైన ధర్మప్రవృత్తులును నీవెరుగనివి కావు. (1) కాబట్టి నీసోదరుడైన విచిత్రవీర్యుని భార్యలయందు దేవరన్యాయంబున క్షేత్రజులను బడసి రాజ్యక్షయాన్ని కాపాడుమని కోరుతుంది. ప్రాచీన సాంప్రదాయాన్ని గుర్తెరింగిన సత్యవతి

1. మహాభారతంశాంతిపర్వంలో స్త్రీపురుష సంబంధాలను కృత, త్రేతా, ద్వాపర యుగాలను సంకల్ప, సంస్పర్శ, మైథున, ద్వంద్వ అంటూ నిర్వచించారు.

సంకల్ప:- (సాముదాయక) అంటే యేస్త్రీ అయినా, యేపురుషునితోనయినా సంభోగించవచ్చు. అది వారివారి సంకల్పాన్నిబట్టి (యిష్టాన్ని) ఉంటుంది. దానికిసామాజికంగాగానీ, వ్యక్తిగతంగాగానీ అడ్డంకులేమీ వుండవు. యిది ఆదిమ సమూహాల్లోనూ, ఆదిమకమ్యూనిస్టు గణసంఘాలలోనూ వుండినది.

సంస్పర్శ:- అతి సన్నిహిత బంధువులమధ్య స్త్రీ పురుష సంబంధాలు నిషేధింపబడి ఒకగోత్రానికీ (తెగ) మరొక గోత్రానికీమధ్య సాముదాయిక పద్ధతిలో సామూహిక వివాహ పద్ధతి. యీపద్ధతిలో మార్పిడిద్వారావచ్చిన స్త్రీలతో ఆతెగలోని పురుషులందరితో సంబంధాలుంటాయి. యిది ఆదిమ కమ్యూనిస్టు గణసంఘాల ఉచ్ఛదశలో వుంటాయి.

మైథునం:- ప్రకృతి సహజమైన స్త్రీ పురుష సంబంధాలలో అంతిమదశ, జంటకుటుంబం (స్త్రీ పురుషులు) తమకిష్టమైనంత కాలం కలిసి వుండి, తర్వాత విడిపోవచ్చు. వీరుకలసివున్నంత కాలం యితరులతో సంపర్కం ముండకూడదు. యిది భారత కాలపు గణసంఘాలలో ముఖ్యంగా వుండినది.

ద్వంద్వం:- పురుషుడు పెళ్ళిచేటు ఆస్థికి సర్వాధికారియై స్త్రీ కూడా అతని సంపత్తిలో చేరిపోతుంది. యిది మహాభారత కాలం తర్వాత అమలులోకి వస్తుంది. యీపద్ధతితో సామూహిక గణతంత్ర ఆశయాలు సంపూర్ణంగా విస్మరింపబడుతాయి.

ఆజ్ఞను వేదవ్యాసుడు సిరసావహించి తానుకూడా యీధర్మాలను గుర్తెరింగినవాడు కాబట్టి నంబికయందు దృతరాష్ట్రుని, అంబాలికయందు పాండురాజును, వీరి పరిచారికయందు విదురుడు జన్మించేవరకు వారితో వ్యవహరించి వెల్లిపోతాడు. 1

పాండురాజు గర్భవ్యాధిగ్రస్తుడు అయినప్పటికీ కుంతి మాద్రి అనేవారిని వివాహమాడుతాడు. కుంతి తండ్రియింట వున్నపుడే సూర్యుడు అనే అజ్ఞాత వ్యక్తి వల్ల కర్ణునికన్ని ఏటి ఒడ్డున పారేసిపోతుంది. అయినప్పటికీ యీమె వివాహానికి యోగ్యురాలయింది. పాండురాజు సంతానోత్పత్తికిఅశక్తుడై కుంతీమాద్రిలను నియోగపద్ధతిని పుత్రులకనమని ఆజ్ఞాపిస్తాడు. కుంతి అందుకు తిరస్కరిస్తుంది. పాండురాజు యీ పద్ధతి ధర్మసమ్మతమేనని చెపుతూ యీ ఉదాహరణలను తెలియజేస్తాడు. కేకయరాజుభార్య ఋత్విజులవలన (బ్రాహ్మణులు) ముగ్గురుపుత్రులకనినట్లు, ఋషితాశ్వనిభార్య విధవయైఏడుగురు పుత్రులకనినట్లు, కల్మాషపాదునిభార్య వశిష్టునివలననశ్మకుండను వానిని కనినట్లు చెపుతూతనస్వజన్మ విషయం కూడా ఆవిధంగా జరిగిందేనని చెపుతూ, ప్రాచీన స్త్రీపురుష స్వేచ్ఛాచారాలను గురించి తెలియజేస్తూ స్త్రీలు సర్వస్వాతంత్రులై సర్వప్రాణి ధర్మంబైన ఋతుకాల నియమంబును దప్పక యిచ్చవచ్చిన పురుషులతో సంచరించుచుండినట్లు, కాలాంతరంలో ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతుడు తనతల్లి ఒకవృద్ధునితో సంభోగించుటచూచి దాన్ని సహింపక యిది మొదలు పరిగ్రహీతలైన స్త్రీలు యితరులతో పొందుకూడ

(1) ఆదిపర్వం పేజీ 113-114

దని శాసించాడు. అయినప్పటికీ ఉత్తర కురుదేశములందు(1) యిప్పటికీ పూర్వాచారమునే స్త్రీ పురుషులు ఆచరించుచున్నట్లు కుంతి మాద్రిలకు నచ్చచెప్పి నియోగంద్వారా వారిని సంతానాన్నికనేందుకు సమ్మతిపరుస్తాడు. కుంతిమాద్రులు సమ్మతించి అజ్ఞాత వ్యక్తులద్వారా (2) కుంతి ధర్మరాజు, భీముడు, అర్జునుని మాద్రి నకుల సహదేవులను కంటారు. వీరిని పంచపాండవులు అని పేర్కొనబడింది. *

మహాభారత రచయిత యీ పంచపాండవులను, వీరి సమిష్టి భార్యయైన ద్రౌపదిని కథానాయకులుగా, ఆనాటి ప్రాచీన నూతన ధార్మిక సాంప్రదాయాలకు ప్రతినిధులుగా చిత్రించాడు. యీధార్మిక ప్రతినిధుల ఆచరణనుబట్టి మనకు ఆనాటి సామాజిక చరిత్ర విపులంగా తెలియగలదు.

---

1. ఉత్తర కురుదేశాలు ఆనాడు నేపాల్, టిబెట్, మలయా, ఇండో చైనా, బర్మా వగైరా దేశాలను పేర్కొనటం జరిగింది.

2. కుంతీ మాద్రిలతో వ్యవహరించినవారు మానవులేననే విషయాన్ని ఋగ్వేదంలోని విషయాలనుబట్టిచూస్తే తెలుస్తుంది. ఋగ్వేదంలో స్త్రీ ఒకే పురుషునితోగాక, తిరిగి తిరిగి పురుషులను స్వీకరించినపుడు వారి పేర్లు ప్రథముడు సోముడు, ద్వితీయుడు గంధర్వుడు, తృతీయుడు అగ్నిష్ట అంటూ పేర్కొంటూవుంది. దీన్నిబట్టి మనకు తేలేదేమంటే, కుంతికూడా అదే సాంప్రదాయ ప్రకారం నియమించుకొన్నవారిని సూర్యుడు, ఇంద్రుడు, వాయువు అని పేర్కొనటంజరిగింది. అంటే వ్యక్తులపేర్లకు బదులు యీవిధంగా వారికి వారి ఆరాధ్యప్రకృతి శక్తులు వగైరా పేర్లను ఉపయోగించటం సాంప్రదాయంగా వచ్చినదే ననే విషయం స్పష్టమవుతుంది.

* ఆదిపర్వం 126 వ పేజీనుంచి 133 వ పేజీవరకు.

అర్జునుడు మత్స్య యంత్రాన్ని కొట్టి ద్రౌపదిని తమ యింటికి తీసుకెళ్తాడు. ద్రౌపదిని ఎవరు వివాహమాడాలనే విషయంలో వీరుఒక చిక్కుసమస్యను ఎదుర్కొనాల్సి వస్తుంది. నూతన సాంప్రదాయ ప్రకారం మత్స్య యంత్రాన్ని అర్జునుడు కొట్టినాడు కాబట్టి ద్రౌపదిని అర్జునుడే వివాహమాడాలి. అయితే అదేనూతన సాంప్రదాయం పెద్దవాడైన ధర్మరాజు అవివాహితుడుగా వుండగా చిన్నవాడైన అర్జునునివివాహాన్ని నిషేధిస్తుంది.యీవిషమధార్మిక సమస్యను పరిష్కరించటంలో పాండవులు విఫలులౌతారు. ప్రాచీన సాంప్రదాయాలను గుర్తెరింగిన కుంతీదేవి ద్రౌపదిని అయిదుగురు కలిసి సామూహికంగా అనుభవించమని ఆజ్ఞాపిస్తుంది. తర్వాత ధర్మరాజు కూడా తమ్ములకు వేదవ్యాసుని వలనవినిన ప్రాచీన సాంప్రదాయాలను బోధించి ద్రౌపదిని మన యేవురము కలిసి పరిగ్రహిస్తాము అని చెప్తాడు. (1)

యీనిర్ణయాన్ని ద్రుపదుడు తెలుసుకొని యీ ధార్మిక సంకరమైన పద్ధతికి సంశయాన్ని వెలిబుచ్చుతాడు. ధర్మరాజు ద్రుపదుని సంశయ నివారణకుగాను మునుపు జటలుడను ఋషికన్య ఏడుగురు పతులను కలిగివుండినటుల, దాక్షాయని యను మునికన్య ప్రచేతసు లనబడు పదిమంది సోదరులకు భార్యగా వుంటినట్లు వగైరా పూర్వుల చరిత్రలను తెలియ జేస్తూ యిది ప్రాచీన సత్సాంప్రదాయమేగానీ, ధర్మసంకర మైన పద్ధతి కాదని నిరూపిస్తాడు. ధర్మజుని వాదాన్ని వేద వ్యాసుడుకూడా బలపరచటంతో సమస్య పరిష్కారమయి

---

1. ఆదిపర్వం సప్తమాశ్వాసము 24 పేజీ.

పాండవులు అయిదుగురు ద్రౌపదిని భార్యగా స్వీకరిస్తారు.(1) పాండవులు అయిదుగురు కలిసి ఒకేభార్యను కలిసివుండటమే గాక, ప్రతిఒకరికి ప్రత్యేక ప్రత్యేకంగా స్త్రీలను వివాహ మాడారు. మరికొందరు స్త్రీలతో వీరికి అతిథి ధర్మంగానూ, నియోగపద్ధతిని సంబంధాలుకూడా వుంటాయి. ఉ॥ భీముడు హిడింబతోను, అర్జునుడు ఉలూపి, చిత్రాంగద వగైరాల తోనూ యీసంబంధాలలో వీరికి పుత్రులుకూడా కలిగారు. సత్యవతి, కుంతి వారి వివాహాలకు పూర్వమే సంతానాన్ని కనివుండినప్పటికీ, తిరిగివివాహానికి యోగ్యులుగా వుండటమే గాక, పతివ్రతలుగాకూడా పరిగణింపబడినారు. అంబా, అం బాలికలు వైధవ్యాన్ని పొందికూడా సంతానాన్ని కనటం, ఆసంతానమే భారతదేశ అధినేతలుగా (రాజులు) చెలామణీ అయినారు. కుంతిమాద్రిలు (క్షేత్రజులను) వేరొక పురుషు లతో సంతానాన్ని కనినప్పటికీ వీరికిగానీ, వీరి సంతానానికి గానీ ఎలాంటి కలంకము రాలేదు. ద్రౌపది అయిదుగురు భర్తలు కల్గివుండికూడా సాధ్వి, పతివ్రత కాగల్గింది. అలాగే పురుషులుకూడా ఎక్కువమంది స్త్రీలను కలిగి వుండినప్పటికీ, ఎక్కడికక్కడ వరించటం, త్యజించటం జరిగినప్పనకీ వీరి ధర్మనిష్టకు, న్యాయపరతకు భిన్నంకాలేదు. యీ వ్యవహా రాలను యీనాటి సమాజం క్షమిస్తుందా? క్షమించదు. క్షమించాలనికూడా మన ఉద్దేశంకాదు. మరి యీవ్యవహారా లను నేడు అతినీచంగా, అతిహేయంగా చూడబడే విధానా లను అతిపవిత్రంగా ఆనాటి యీవ్యవహారాలను ఎందుకు

1. ఆదిపర్వం సప్తమాశ్వాసము 24 పేజీ.

భావించి స్తుతిస్తూవుంది? వీటికి సమాధానాలు చారిత్రక దృక్పథంతో చూస్తేగానీ లభించవు. చారిత్రక దృక్పథాన్ని విస్మరించి చూడటంద్వారా ఊహాకుఅందని విషయాలయి కూర్చుంటాయి. ఫలితంగా ఆనాటి చరిత్రకు, సామాజిక వ్యవహారాలకు దైవాంశాన్ని అంటగట్టటమో, లేక కల్పిత కథలని తోసిపారెయ్యటమో జరుగుతుంది. బూర్జువా పండితులు వ్యాఖ్యానించినట్లు పాండవులకు మాత్రమే దైవాంశత్వాన్ని గుర్తించటం అవివేకమే అవుతుంది. ఎందుకంటే యీఆచార వ్యవహారాలను మనం ఒక్క పాండవవంశంలోనే గాక, యితరత్రాకూడా చూశాము. దీన్నిబట్టి తేలేదేమంటే ఆనాటి సమాజంలోవున్న మానవులందరూ దైవాంశముగలవారేనని ఒప్పుకోనాల్సివస్తుంది. ఆదిమసాంప్రదాయాన్నుంచి ఋగ్వేద కాలంలో ఆర్యఋషులద్వారా తీసుకురాబడిన నియోగ దేవర విధానాలను, వగైరా మార్పులను స్త్రీ పురుష సంబంధాలలో తీసుకొని రాబడినట్లు చూశాము. మహాభారత కాలంనాటికి పైవేటుఆస్తికి ప్రాబల్యంఏర్పడటం, అందుకు అనుగుణంగా శ్వేతకేతుడు సృష్టించిన నూతన విధానం స్త్రీ పురుష సంబంధాలలో ఆచరణలోకి రావటానికి జరుగుతున్న ప్రయత్నాలను చూశాము. మహాభారత కాలంనాటి అచార వ్యవహారాలను ప్రాచీన సాంప్రదాయానికి అనుగుణంగా వుండినట్లు మనకు స్పష్టమవుతూవుంది. శ్వేతకేతుడు సృష్టించిన నూతనవిధానం ఆనాటి సమాజానికి చాలా కటువుగా అగుపించింది. యీవిధానం స్త్రీపైన పురుషుని సంపూర్ణ పెత్తనాన్ని నిర్ణయిస్తూవుంది. దానితో

సమాజంలో స్త్రీ పురుషులమధ్య పెద్దఅఖాతము ఏర్పడింది. యీనూతన విధానాన్ని వ్యతిరేకించి, పూర్వపు సాంప్రదాయాన్నే వాంఛించే స్త్రీలను వ్యభిచారులు, కులటలు, భ్రష్టులుగా పరిగణించటం, యీనూతన విధానాన్ని స్వీకరించి పురుషుని అధికారాన్ని సంపూర్ణంగా తలదాల్చిన స్త్రీలను సాధ్వి, పతివ్రతలని బుజ్జగించటం జరిగింది. అయితే ప్రాచీన కాలంనుంచీ సహస్రాబ్దాలుగా సమాజంలో పాతుకుపోయిన అలవాట్లను, సాంప్రదాయాలను సమాజం త్వరలో త్యజించలేకపోయింది. ప్రధానంగా సమాజంలో అగ్రస్థానం వహించి పురుషునిపైన పెత్తనం చలాయిస్తూ వచ్చిన స్త్రీతన స్వాతంత్ర్యాన్ని హరించివేసే యీనూతనవిధానానికి అంతసులభంగా, అంత త్వరగాలొంగిపోవటం చాలకష్టమైన విషయం కాబట్టే ప్రాచీన ధార్మిక అవశేషాలను సమాజంతోపాటు, ప్రైవేటు ఆస్తికి ప్రాతినిధ్యం వహించిన భారతకథానాయకులుకూడ అనుసరించాల్సి వచ్చింది. తర్వాత దశలలో యీప్రాచీన స్త్రీపురుష సంబంధ అవశేషాలు ప్రపంచంలోని అన్ని దేశాలలోకూడ వుంటూనేవచ్చాయి. కాలాంతరంలో సన్నగిలినప్పటికీ, భారతదేశంలో కొన్ని తెగలలో నేటివరకుకూడ నిలచివున్నట్లు చూస్తున్నాము.



# అతిథి విధానం

అతిథి విధానం ఋగ్వేద కాలంలో ప్రారంభమయి, మహాభారత కాలంనాటికి అమానుషంగా తయారయింది. యీవిధానం ప్రకారం అతిథిఅంటూ యింటికి వచ్చేవాడెవరైనప్పటికీ, అతని భోజన తాంబూలాదికములతో తృప్తి పరచడమేగాక, అతిథి కోరినప్రకారం ఆయింటి యిల్లాలుగానీ, లేక ఆయింటిలోవున్న స్త్రీలెవ్వరైనాగానీ అతని కామతృష్ట తీర్చేందుకు వారిదేహాలను అర్పించాల్సి వుంటుంది. సుదర్శన మహాముని యింటిలో లేనపుడు ఆయింటికి ఒక బ్రాహ్మణుడు అతిథిగావస్తాడు. సుదర్శునిభార్య ఓఘావతి గణసంఘాచారాన్ననుసరించి అతిథితో కలిసి శయ్యాగృహంలో వుంటుంది. యింతలో సుదర్శనుడు యింటికివచ్చి భార్యను తలుపుతియ్యమని పిలుస్తాడు. అతిథిఆమెనుపలుకవద్దని ఆజ్ఞాపిస్తాడు. ఆమె ఆఆజ్ఞను మన్నిస్తుంది. సుదర్శనుడు తిరిగితిరిగి పిలవగా నీభార్య అతిథి కోర్కెను తీరుస్తూవుంది అని అతిథే జవాబిస్తాడు. యీసంగతివిని సుదర్శనుడు ఆనంద భరితుడై తన జన్మ పావనమైందని సంతోషిస్తాడు. సత్యకాముజాబాలిని గురువు నీతండ్రి ఎవరని అడుగుతాడు. జాబాలి తన తల్లిని దానికి సమాధానం అడుగుతాడు. ఆమె తనతండ్రిగృహంలో నిత్యమూ అనేకమందిఅతిథులు రావటం, వారినిసత్కరించటం, సంతృప్తిపరచటం జరిగేది. ఫలితంగా జాబాలి జన్మిస్తాడు.

ఆపరిస్థితులలో ఆమె జాబాలితండ్రి ఎవరని చెప్పగలుగుతుంది. యీవిధానము గణసంఘ ఆచారాల విచ్ఛిత్తికి పునాదులు ఏర్పడటంతో అపరాధంగా పరిగణింపబడినట్లు చిరకారిగాధ తెలియజేస్తూంది.

గౌతముడు యింటలేనపుడు ఇంద్రుడతిథిగావచ్చి గౌతముని భార్యతో సంభోగిస్తాడు. యిది గౌతమునికి తెలిసి కొడుకు చిరకారినిపిలిచి తల్లితల నరుకమని ఆజ్ఞాపించి వెళ్లిపోతాడు. చిరకారి పూర్వోక్త ధర్మప్రకారం తల్లిగౌరవమున అధికం, తల్లిసరనేయం కానీ ప్రస్తుతం నూతనంగా పొడసూపే ధర్మప్రకారం తండ్రిఆజ్ఞ అనులంఘనీయం. యిందులో ఏది ఆచరించవలె, ఏది కూడదు అనే ఆలోచనలో తికమక బడుతుంటాడు. యింతలో తండ్రి తిరిగివస్తాడు. అతని కోపము చల్లారిపోయి వుంటుంది. తల్లిని చంపనందుకు చిరకారి శ్లాఘిస్తాడు. అంటే యిక్కడ తల్లిఅధికారాలు సన్నగిలినప్పటికీ, నూతన నియమాలకు యింకా పటుత్వం రాలేదనే విషయాన్ని తెలియజేస్తుంది.

✓ యుచథ్యజుడను మునిభార్య మమతను బృహస్పతి అతిథిధర్మంబున నిందుచూలాలిని సంభోగించగా గర్భపిఘాతం కలిగి దీర్ఘతముడు పుట్టంధుడుగా జన్మిస్తాడు. యీదీర్ఘతముడు ప్రద్వేషిణిని వివాహమాడుతాడు. వీరికి గౌతమాదు లయిన పలువురు పుత్రులు కలుగుతారు. దీర్ఘతముడు ప్రద్వేషిని యొక్క శ్వేచ్ఛాచారాలను మందలించగా ప్రద్వేషిని యీవిధంగా జవాబిస్తుంది. పతి భార్యను భరిస్తాడు కాబట్టి భర్తఅయినాడు. భార్య భరియింప బడింది కాబట్టి భార్య

అయింది. యీరెండు ధర్మాలు మనయందు ఎప్పుడూ లేవు. యెల్లకాలము నిన్ను నేనే భరియించాల్సి వచ్చింది కాబట్టి నీవు నాకు భర్తవు, నేను నీకు భార్యను ఎప్పుడు కాలేదు. నీవు యెక్కడికైనా పొమ్మని చెపుతుంది. (1) దీర్ఘతముడు కోపించి పతిలేని భార్యలు (స్త్రీలు) ధనవంతులైనప్పటికీ, ఎక్కువ కులస్థులైనప్పటికీ, అలంకార హీనలుగా, మాంగల్య రహితులుగా వుండుదురుగాక అని శాసిస్తాడు. (2) ప్రద్వేషిని యితనిని కాళ్లు చేతులుకట్టి గంగలో వేయమని పుత్రుల ఆజ్ఞాపిస్తుంది. పుత్రులు తల్లిఆజ్ఞను పాలిస్తారు. గంగలో కొట్టుకొనిపొయ్యే దీర్ఘతముని బలిఅనురాజు రక్షించి తన భార్యయందు సంతానోత్పత్తిని కలుగచేయమని ప్రార్థించి రాజమహల్‌కు పంపిస్తాడు. బలిభార్య సుధేష్ణ యీపుట్టంధుని అసహ్యించుకొని గాదిలఅనే దాసినినియమిస్తుంది. గాదిలకుపదకొండుగురుపుత్రులు కలుగుతారు. తనభార్యకు కలిగిన సంతానం

---

1. తే|| పతియు భరియుంచుగావున భర్తయయ్యె, భామ భరియింపబడుగాన భార్యయయ్యె, బరగనివి మనయందు వీడ్వడియె, నిన్ను నేను యెల్ల కాలము భరియింతుగాన.

2. క|| పతిహీనలైన భామను అతిధనవంతులయ్యును కులజలయ్యును ననలంకృతలయ్యెను మాంగల్య రహితులయ్యెను కృపణవృత్తి నిగియు మొదలుగాన్.

తిండి, గుడ్డ వస్త్రాలను యిచ్చేవాడు భర్తగాను, తిండి గుడ్డ వస్త్రాల కొరకు మరొకరిపైన ఆధారపడిన స్త్రీ భార్యగాను యీనూతన ధర్మం తెలియజేస్తూవుంది. అంటే స్వయంపోషకి అయిన స్త్రీ పోషితగా చెయ్యబడింది.

కాదని బలి గురించి దీర్ఘతముని తిరిగి ప్రార్థించి సుధేష్ణను నియోగించగా అంగరాజు జన్మిస్తాడు. (1)

యిలాంటి గాధలూ, ఉదాహరణలూ మహాభారతం లోనూ, వ్యాసుడు రచించిన అష్టాదశ (18) పురాణాలలోనూ కొల్లలుగా దొరుకుతాయి. అయితే యివన్నీ మనకు తెలియజేసేదేమిటి? ఆదిమ వ్యవస్థనుంచీ, ఆదిమ కమ్యూనిస్టు గణ సంఘాలుగా మానవ సమాజం పరివర్తన చెందటం, ఆదశలో స్త్రీ శ్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఋగ్వేద కాలంలో ఏర్పడిన సామూహిక కుటుంబాలలోకూడా స్త్రీని గృహకృత్యాలలో మాత్రమే నియోగించినప్పటికీ, సమాజంలో ఆర్థిక నైతిక రంగాలలో పురుషునితో సమానమైన అధికారాలు కల్గివుండినట్లు చూశాము. మహాభారతకాలంనాటికి ఉత్పత్తిపరికరాలు వికసించటం, ఉత్పత్తి (సంపత్తి) పైన, ఉత్పత్తి పరికరాల పైన ప్రైవేటు హక్కులు (వ్యక్తిగత) ఏర్పడటం, ఉత్పత్తి పరికరాలపైన, బానిసలపైన, బానిసలద్వారా, ఉత్పత్తిచేయబడే అదనపు సంపత్తిపైనా ఒకేవ్యక్తి అధికారాన్ని కల్గివుండటంద్వారా సమాజంలో బానిసలూ, యజమానులూ అనే రెండు ప్రధాన వర్గాలు యేర్పడుతాయి. ఫలితంగా గృహచ్ఛిద్రాలు, పరస్పర వైసమ్యాలు ప్రజలలో ఉత్పన్నమయాయి. యీదశలో ప్రైవేటుఆస్తి, యేకపత్నీ కుటుంబమూ, పురుష ప్రాబల్యమూ, స్త్రీ బానిసత్వమూ యీ ప్రాతిపదికపైన తయారయే నూతనసిద్ధాంతాలు, విధివిధానాలు మరొకవైపు ప్రాచీన గణసంఘ పునాదులపైన ఏర్పడ్డ సామూహిక

---

1. ఆదిపర్వం 111, 112 పేజీలు.

కుటుంబ విధివిధానాలు భవిష్యత్ కు యీ రెండింటిలో ఏది ప్రాతినిధ్యం వహించాలనే విషయంలో పాతకొత్త విధానాల మధ్య జరుగుతున్న సంఘర్షణను యీ గాధలూ వగైరాలు మనకు తెలియజేస్తాయి. కొల్లలుగావున్న యీగాధలన్నీ ఏవిధానాన్నికూడా సంపూర్ణంగాగాక, రెండువిధానాలతో కూడుకొన్న పరస్పర సంఘర్షణను తెలియ జేస్తున్నాయి. మహాభారత కాలంనాటి యీ వైవిధ్యాలకు తర్వాతిదశలోని జమదగ్ని గాధకూ (1) చాలావ్యత్యాసం కలిగింది. జమదగ్ని భార్య రేణుక చిత్రరధ గంధర్వునిపై ప్రేమపూర్వకంగా చూస్తుంది. జమదగ్ని కొడుకైన పరశురామునితో తల్లిని నరికి వేయమని ఆజ్ఞాపిస్తాడు. అతడు వెంటనే నరికి వేస్తాడు. చిరకాలి గాధలోవున్న సందిగ్ధ పరిస్థితులు పూర్తిగా యీ కాలానికి నశించి పోయాయని యీగాధ తెలియ జేస్తుంది. యీదశలో స్త్రీయొక్క ప్రాణాలపైనకూడా పురుషునికి సంపూర్ణమైన అధికారం స్థిరపడింది. బానిస విధానంలో పుట్టుకొచ్చిన అమానుష దౌర్జన్యాధికారాలు, స్త్రీయొక్క స్వేచ్ఛనూ, వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా హరించివేశాయి. పురుషుని దౌర్జన్యాకివర్గ రాజ్యాంగయంత్రమూ, ధర్మము, నీతి, న్యాయము మద్దతు నిచ్చాయి. అంటే బానిస యజమానులైన ప్రభువులు, వీరి తాబేదారులైన శాస్త్రకారులు వీటిని

1. పరశురాముని గాధ రామాయణంలోనే చూశాము. అయితే చారిత్రక పరిణామక్రమంలో చూచినపుడు మహాభారతకాలం తర్వాత చారిత్రక పరిణామాన్ని తెలియజేసే గాధను రచయిత రామాయణ కాలానికి దిగలాగడం జరిగిందనే విషయం స్పష్టమవుతుంది.

సృష్టించటం జరిగింది. ధర్మము, నీతి, న్యాయాలు అనేవి కమ్యూనిస్టు గణసంఘాలలోనూ, తర్వాత సామూహిక కుటుంబాలలోనూ కూడా వుంటూనే వచ్చాయి. అయితే సామూహిక గణతంత్రాలలోను, సామూహిక కుటుంబాల లోను, నీతినియమాలు, జాతిలింగ వయోవృద్ధ భేదాలు లేకుండా అందరినీ కంట్రోల్ చేశాయి. బానిసప్రభులద్వారా తయారుచేయబడిన ధర్మం, నీతినియమాలు సమాజంలో కొందరిని కంట్రోల్ చేస్తూ, కొందరికి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నిచ్చాయి. ఒకే కుటుంబంలో స్త్రీకి ఒకధర్మం, పురుషునికి ఒకధర్మం వింతంతు, తోబుట్టువులు, ముదుసలులు, పిల్లలు అనే తారతమ్యాలతో ప్రతిఒకరికి వారి బాధ్యతలను నిర్వ చిస్తూ ధర్మం, నీతినియమాలు అమలులోకి వచ్చాయి. యివి సమాజంలో పాదుకొంటూ పాదుకొంటూవచ్చి, నేడు ఎంతనీచంగా, ఘోరంగా తయారయాయనే విష యాన్ని ముందుముందు చూస్తాము.



# మనుధర్మ శాస్త్రం - స్త్రీలు

మనుస్మృతినిగురించి మహాభారతంలో అక్కడక్కడ పేర్కొనటం జరిగింది. యీ రెండింటిలోని వస్తువిషయాన్నిబట్టి చూస్తే, మహాభారతం తర్వాతనే మనుస్మృతి ఉత్పన్నమయిందని ధృడంగా చెప్పవచ్చు. (1) మనుస్మృతిలో ప్రాచీన సామూహిక విధివిధానాలను పునరుద్ధరించే ప్రయత్నం జరిగినప్పటికీ, వర్గరాజ్యాంగ లక్ష్యాలనుకూడా ప్రధానంగా ప్రతిబింబిస్తుంది. యితని కాలంలోవున్న అనేక విధాలైన స్త్రీ పురుష సంబంధాలను ఉత్తమ, మధ్యమనికృష్ట అంటూ పదివిధాలుగా నిర్ణయించి వాటిని సిద్ధాంతీకరించటం జరిగింది. (2)

1. బ్రహ్మ:- స్త్రీ పురుషులు విద్యాయుక్తులై, పరస్పర ప్రేమికులై వ్యవహరించుట. (యీవిధానాన్ని మనం ఋగ్వేదంలో చూశాము.)

---

1. మహాభారతం వ్యాసుడు రచించనది అయిదువేల శ్లోకాలే అయితే తర్వాత తర్వాత కాలాలలో చేర్చిన అదనపు శ్లోకాలతో కూడుకొని లక్షశ్లోకాలకు పెరిగింది. యీవిధరంగా మనుకాలానికి తర్వాతచేర్చబడిన సంక్షిప్తాలలో మనుస్మృతిలోని విషయాలను కాలానుగుణ్యాంగా సందర్భాన్నిబట్టి వాడటంజరిగింది.
2. బ్రహ్మోదైవస్త దైవార్షః ప్రజాపత్యాస్తథా ఆసురః
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమ.

మనుస్మృతి 6, 12

2. దైవ:- పురోహిత సహితంగా, కర్మయుక్తంగా తలిదం డ్రుల యిష్టాలపైన జరుపబడేవి.

3. ఆర్ష:- వరునివల్ల కట్నంపుచ్చుకొని కన్యాదానం చేయుట.

4. ప్రజాపత్య:- యిరుపక్షాలకు లాభదాయకమైన పద్ధతిలో వివాహముజరుగుట. (యీపద్ధతి బంధుత్వ సంబం ధాలు నిషేధింపబడిన తర్వాత తెగలలోను, తర్వాత కుటుంబాలలోనూ కన్యలను వేరొక తెగకిచ్చి బదులు కన్యను తెచ్చుకొనుట.)

5. అసుర:- వరుడు కన్యకుగానీ, కన్య వరునికిగానీ కట్నం యిచ్చే పద్ధతి.

6. గాంధర్వ:- ఆసమయంలో అనిమయంగా ఏకారణాలవల్ల నైనా స్త్రీ పురుషులు పరస్పర యిష్టముతో కలి యుట. ఉ॥ శకుంతల, దుష్యంతుని సంబంధం.

7. రాక్షస:- బలాత్కారంగా కొట్లాడిగానీ, యుద్ధము చేసిగానీ, కపట తంత్రోపాయాల ద్వారాగానీ కన్యను తెచ్చుకొనుట. ఉ॥ కృష్ణుడు రుక్మిణిని, అర్జునుడు సుభద్రను తెచ్చుట.

8. పైశాచిక:- ఒంటరిగాశయనించియున్న, మధ్యం వగైరా సేవించి మత్తులోవున్న కన్యతో బలాత్కారంగా సంభోగించుట.

మను ప్రధానంగా సవర్ణవివాహాలను ప్రోత్సహిస్తాడు. కానీ ఎవరైనా ఉచ్చజాతి స్త్రీ పురుషులు నీచజాతివారితో సంబంధాలు కల్పించుకొంటే వాటినికూడా స్వీకరించాడు. అందుకు అనుగుణంగా మరిరెండు విధానాలను సూచించాడు.

9. అనులోమ:- ఉచ్ఛజాతి పురుషుడు, నీచజాతి స్త్రీ వివాహ మాడుట.

10. ప్రతిలోమ:- ఉచ్ఛజాతి స్త్రీ నీచజాతి పురుని వివాహ మాడుట.

ఈదశలో సంతానాన్ని కాపాడేందుకు సంతాన బాధ్యతలను, ఆస్థి సంక్రమాన్ని ప్రథం గంగా, ఔరస, క్షేత్రజ అంటూ నిర్ణయించటం జరిగింది.

ఔరస: పై పదివిధమ్ములైన వివాహాలద్వారా సంబంధాలను కల్గించుకొన్న స్త్రీ పురుషులకు కలిగిన సంతానం తండ్రి యొక్క ఆస్థికి వారసుడగును.

క్షేత్రజ:- భర్త సంతానోత్పత్తియందు అశక్తుడైనపుడుగానీ, నిస్సంతానుడై మరణించినపుడుగానీ భర్త యొక్క వంశానికి, లేక సంపత్తికి వారసుని కొరకు నియోగం ద్వారా (ఇతరులతో) సంతానాన్ని కనినపుడు, ఆసంతానం జీవించి, లేక మరణించియున్న పురుషుని ఆస్థికి వారసుడగును. ఉ॥ అంబా, అంబాలికలు మరణించినవిచిత్రవీర్యునివంశావలి కొరకు వ్యాసునిద్వారా ధృతరాష్ట్ర, పాండురాజులనుకనుట. కుంతీ మాద్రిలు జీవించియున్న పాండురాజు వంశావలి కొరకు పాండవులను అజ్ఞాత వ్యక్తులద్వారా కనుట. నియోగం ప్రధానంగా విధవస్త్రీ, భార్య చనిపోయిన పురుషుడు వీరిమధ్య జరుగుతుంది. వివాహానికి పూర్వం కన్యాయువతులు గానీ, విధవతో పెండ్లికాని యువకుడుకానీ, భార్యచనిపోయిన పురుషునితో కన్యగానీ నియోగసంబంధం చేసుకొన

కూడదు. కుటుంబంలో పురుషులు చనిపోయినపుడు కనిష్టుని భార్యను జ్యేష్టుడుగానీ, జ్యేష్టునిభార్యను కనిష్టుడుగానీ నియోగం చేసుకొనవచ్చు. వారసత్వం కొరకు చేసుకొనే నియోగాలలో స్త్రీకొరకా, లేక పురుషునికొరకా అనేవిషయాన్ని నియోగానికి పూర్వమే నిర్ణయించు కోవాల్సి వుంటుంది. స్త్రీకొరకైతే కలిగే సంతానం స్త్రీకే చెందుతుంది. పురుషుని కొరకైతే పురుషుని, యిద్దరికొరకైతే కలిగే సంతానంలో చెరిఒకరుగానీ, చెరియిద్దరినిగానీ తీసుకోల్సి వుంటుంది. లేక యౌనజీవితం కొరకైతే యిద్దరు భార్యా భర్తలవలె గృహస్థ ధర్మవిధులను నిర్వర్తిస్తూ, యిద్దరు కలసి మెలసి సంతానం యొక్క సుఖ సౌభాగ్యాలకొరకు పాటుపడాల్సి వుంటుంది. స్త్రీ పురుషుల నియోగ పద్ధతులు, అనేక రకాల వివాహ పద్ధతులు వగైరాలను విపులంగా చెప్పబడినప్పటికీ వ్యభిచారాన్ని గురించి చాలా కఠినమైన శిక్షలు చెప్పబడినవి. (1) భర్తను కలిగుండి ఏస్త్రీ అయితే గర్వించి వ్యభిచారానికి పాల్పడుతూ వుంటుందో, ఆస్త్రీని సంఘము (లేక రాజు) జనసమూహము ఎదుట కుక్కలతో కరిపించి చంపవలె. ఆదేవిధంగా తనస్వంత భార్యను విడిచి యితరుల భార్యలను (పరస్త్రీ) గానీ, వేశ్యలనుగానీ కామించి సంభోగించిన పురుషుని (పాపిని) లోహపు కడ్డీలను ఎర్రగాకాల్చి

1. "భర్తారమ్ లంఘయేద్యాస్త్రీ స్వజ్ఞాతి గుణదర్పితా,
తామ్ శ్వాభిః ఖాదయేద్రాజా సంస్థానే బహుసంస్థితే"
"పుమాం సందాహ యేత్పాపంశయనే తప్త ఆయసే,
అభ్యా దధ్యుశ్చ కాష్టాని తత్ర దహ్యేత పాపకృత్."
మనుస్మృతి 8, 371, 372.

జనబాహుల్యం ముందర ప్రాణముతోనే అతని శరీరాన్ని కాల్చి భస్మము చేయాలి అంటూ పేర్కొంటూవుంది.

మనకంటే కొద్దికాలం క్రితం సామాజిక సూత్రాలను, విధివిధానాలను నిర్ణయించిన యాజ్ఞవల్క్యస్మృతి వ్యభిచారాన్ని గురించి యీవిధంగా చెప్తూవుంది. యాదృచ్ఛికంగా గానీ, యిష్టపూర్వకంగాగానీ, బలాత్కారంగాగానీ స్త్రీ వ్యభిచారానికి పాల్పడినపుడు బహిష్టుతో వ్యభిచారదోషం శుద్ధి అవుతుంది. లేదా ప్రసవంతో విముక్తి చెందుతుంది. (1)

యాజ్ఞవల్క్యస్మృతి కాలంనాటికి వ్యభిచారందోషంగా పరిగణింప బడినప్పటికీ, స్త్రీలు పోయిన శీలాన్ని తిరిగి అంత సులభంగా సంపాదించుకోనగల్గేవారు. అంటే సామూహిక విధానాలు, అతిథి పద్ధతి ప్రబలంగావుండి సమాజంలో ఏక పత్నీత్వం, ప్రైవేటుఆస్తి, వర్గరాజ్యాంగమూ వొకవైపు జన్మిస్తూవున్న సంధికాలంలోని వర్గరాజ్యాంగపు నీతి, న్యాయం, ధర్మం వగైరా విషయాలలో కేవలం కటువుగా లేకుండా, కొంత సర్దుబాటు, సల్లుబాటు తత్వాన్ని ప్రదర్శించాయి. కానీ యిదే ధర్మం, నీతి, న్యాయాలు మనువు కాలంలో ప్రవేశించే టప్పటికి కఠినంగా, బలవత్తరంగా తయారయాయి. అంటే స్త్రీని గృహానికిమాత్రమే పరిమితం చేసి, పురుషుని ఆధిపత్యాన్ని స్వీకరించాలనే నూతన పరివర్తనకు స్త్రీయొక్క మెడలు వంచటంలో పురుషుడు కొంచం విజయాన్ని సంపాదించగల్గాడు.

---

1. వ్యభిచారాత్ ఋతౌ శుద్ధి,
గర్భేత్యాగో విధీయతే. (యాజ్ఞవల్క్యస్మృతి 1, 72.)

మనువు కాలంలో వ్యభిచారం అపవిత్రంగా భావించబడినప్ప టికీ, స్త్రీ పురుషులకు ఎన్నోసందర్భాలలో ఎన్నోరకాల పరపురుషులతో సంభోగాన్ని స్త్రీ పురుషుల పరస్పర విరు ద్ధాభిప్రాయాలు కలిగినపుడు ప్రథమ వివాహాన్ని రద్దుచేసి తిరిగి వివాహము చేసుకొనేందుకు కావసినన్ని మార్గాలను సూచిస్తూవుంది కానీ యిష్టమున్నా లేకపోయినా పురుషుడు వున్నా, లేకపోయినా ఒకసారి జరిగిన వివాహానికి స్త్రీతన జీవిత పర్యంతము కట్టుబడి అఘోరించాలనే విషమ పరిస్థితు లను స్త్రీలకు కల్పించలేదు. మనుస్మృతి భర్త వియోగం వగైరా సందర్భాలలో స్త్రీలు విశృంఖల ప్రవర్తనులు గాకుండా వుండేటందుకుగాను యీవిధంగా సూచించాడు.

"పతి ధర్మార్థముకొరకు పరదేశంపోయినపుడు, 8 సం వత్సరములు విద్యాకీర్తికొరకు పోయినపుడు, 6 సం॥ ధన సంపాదన కొరకు పోయినపుడు 3 సం॥ వేచివుండి నియోగం ద్వారా రెండవ పతిని నియమించుకొని సంతానాన్ని కన వచ్చును. అయితే యీలోగా వివాహిత పతివచ్చినపుడు యీరెండవ సంబంధం విడిపోవాల్సి వుంటుంది. (1) అలాగే పురుషుడుకూడా నిజభార్యయందు 10 సం॥ వరకు సంతానం కల్గి చనిపోతున్నపుడు, 8 సం॥ వరకు సంతానోత్పత్తి లేన పుడు అప్రియములు పలికేస్త్రీని విడిచి రెండవ స్త్రీని

1. ప్రోషితో ధర్మకార్యార్థ, ప్రతీక్ష్యో ష్టౌనరః సమాః
విద్యార్థషడ్ యశోర్థ వా కామార్థ త్రీంస్తువత్సరాన్.
"వన్ధ్యాష్టమేధి వేద్యేతు మృతప్రజా,
ఏకాదశే స్త్రీ జననీ సద్యస్త్వ ప్రియవాదినీ.

మ.9, 76, 81.

నియోగం ద్వారా సంబంధం కలుగ చేసుకొన వచ్చును. అలాగే స్త్రీ కూడా పురుషుడు సంతానోత్పత్తియందు అశక్తుడైనప్పుడు (1) రెండవ పురుషునితో నియోగం ద్వారా మొదటి పురుషుని కొరకు సంతానాన్ని కనవచ్చు.

మనుస్మృతి స్త్రీల వివాహ సందర్భంలో తల్లిదండ్రులకు, తోబుట్టువులకు కన్యయొక్క బాధ్యతలను వొప్పగించక స్త్రీలకే స్వాతంత్ర్యాధికారాన్ని కల్గించాడు. ఉ॥ కన్య రజస్వలానంతరం 3 సం॥ ములు వేచివుండి తదుపరి తనకనుకూలమైన వరుని వెదకి వివాహము చేసుకొనవలెను. పరస్పర విరుద్ధ స్వభావాలుగల కన్యను పురుషుడుకానీ, పురుషుని స్త్రీగానీ వివాహము చేసుకోనేకంటే ఆమరణ పర్యంతం వివాహం చేసుకొన కూడదని చెపుతూవుంది. (2)

యీవిధంగా పూర్ణయౌవనంలో పరస్పర ప్రేమికులై చేసుకొనే వివాహాలు, దాంపత్య జీవితంలో స్పర్థలు, వైషమ్యాలు లేకుండటమేగాక వారి ఆరోగ్యరక్షణకూడా ప్రధానంగా చూడబడింది. ఆరోగ్య విషయికంగా ధన్వంతరి యీవిధంగా తెలియజేశాడు. 16 సం॥ లోపు స్త్రీకిని 25సం లోపు పురుషునికిని గర్భాదానం చేసినట్లైతే గర్భాశయ

---

1. స్త్రీ పురుషులలో సంతానానికి ఎవరు అశక్తులు అనే విషయాన్ని వైద్యులద్వారా పరీక్ష జరిపి నిర్ణయించటం జరిగేది.
2. త్రీణివర్షాణ్యు దక్షేత, కుమార్యృతు మతీసతీ,
ఊర్ధ్వాతు కాలాదే తస్మాద్విందతే సదృశమ్ పతిమ్.
"కామ మామరణాత్తిష్ఠేన్ గృహేకన్యర్తు మత్యపి,
నచైవానాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హి చిత్.
మనుస్మృతి 9, 90, 89.

పిండినను ఆపత్తి పొందును. ఒకవేళ శిశువు వుత్పన్నమయి నప్పటికీ దుర్బలేంద్రియుడుగా వుంటాడు. అంటే 16 సం॥లోపు స్త్రీకిని, 25 సం॥ లోపు పురుషునికి వివాహము చేయకూడదని నిషేధిస్తూవుంది. యిందుకు విరుద్ధ ప్రవర్తనులు దుఃఖ భాజనులౌతారని తెలియజేస్తూవుంది. (1) యీనిర్ణయాన్ని, ఆనాటి సామాజిక జీవితాన్ని ఆరోగ్యసూత్రాలను దృష్టిలో వుంచుకొని చేయబడిన అభ్యుదయకర విధానం అనటంలో సందేహం లేదు. మనం ఋగ్వేదంలో చూచిన వివాహ సాంప్రదాయాన్ని అంటే స్త్రీ పురుషులు ఏపద్ధతిలో నైనప్పటికీ సంబంధం కలుగజేసుకొన్నప్పుడు ఆకుటుంబం తిరిగి తిరిగి విచ్ఛిన్నం గాకుండా భార్యాభర్తలిద్దరూ పరస్పర మైత్రితో సహచరులుగా మెలగవలెనని, అలా కానప్పుడు ఆకుటుంబం విచ్ఛిన్నమయి పోవటమేగాక సమాజంలో అరాచకానికి దారితీస్తుందని, కుటుంబ నిర్వహణను గురించి యీవిధంగా చెప్పాడు. "ఏకులంలో, ఏయింటిలో భార్యయెడల భర్త, భర్తయెడల భార్య పరస్పర సహాయోగ్యులై ప్రసన్న చిత్తులైవుంటారో ఆగృహంలో ఆనందం, లక్ష్మి (సంపత్తి) కీర్తులు విలసిల్లుతాయి. స్త్రీ పురుషులు ఋతుకాలాభిగాములై స్త్రీ యెడల పురుషుడు, పురుషుని యెడల స్త్రీ ఏగృహంలో ఎవరైతేవుంటున్నారో వారుగృహస్థులైకూడా

1. ఊనషోడశ వర్షాయామ ప్రాప్తః పంచవింశతిమ్,
యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః స విపద్యతే.
"జాతో వా న చిరంజీవేత్ జీవేద్వా దుర్బలేంద్రియః
తస్మాదత్యన్త బాలాయాం గర్భాధానం న కారయేత్.
సుశ్రుత శరీరస్థానం అ 10 శ్లో 47, 48

బ్రహ్మచారు లౌతారు. యిదే విషయాన్ని మహాభారతంకూడ ధృవపరుస్తూవుంది. (1) దాంపత్య జీవితంలో యిలాంటి ప్రవర్తనలవల్ల ఏదశలో కాని సుఖమయంగా వుంటుందనేది నిర్వివాదాంశం. అయితే పై వేటు కుటుంబమూ, పై వేటు ఆస్తి స్థిరపడి పితృప్రాబల్యమూ, పుత్రవారసత్వమూ అనే పితృస్వామిక వ్యవస్థ, మాతృస్వామిక వ్యవస్థను ఏనాడైతే అణచివేసిందో ఆనాడే స్త్రీమీద పురుషుడి అధికారము భార్యా భర్తలమధ్య, తల్లి కొడుకులమధ్య నిరంతర ఘర్షణ బయలు దేరింది. యీపరిస్థితులలో ఆనందమయ కుటుంబం అనేది నశించిపోయింది.

వివాహ సందర్భాలలో సగోత్ర, బంధుత్వ వివాహాలు నిషేధింపబడినట్లు (ఋగ్వేద కాలంలో) చూశాము. మనువుకూడా ఆదేవిషయాన్ని ధృవపరచాడు. తండ్రిగోత్రాన్నుంచి సంపూర్ణంగా ఎలాంటి పరిస్థితులలో నైనప్పటికీ, తల్లివైపు గోత్రాన్నుంచి 6 తరముల సంబంధాలను నిషేధిస్తూ, వేరొక గోత్రంలో (తైగ) ని స్త్రీలతో వివాహాన్ని చేసుకొనుట

1. "సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవచ,
యస్మిన్నేవ కులే నిత్యం, కల్యాణం తత్ర వై ధ్రువమ్."
"ఋతుకాలాభిగామీ స్యాత్ స్వదారనిరతః సదా,
బ్రహ్మచర్యే భవతి, యత్ర తత్రాశ్రమే వసన్."

మను|| 3, 60, 50.

"ఋతుకాలమున నాత్మసతియందు రతిసల్పు భవ్యశీలుడు సదా బ్రహ్మచారి."

మహాభారతం, శాంతిపర్వం. 199 పేజీ.

శ్రేయస్కరమని సూచించాడు. (1) అందుకు కారణాలను శతపథ బ్రాహ్మణంలో యీవిధంగా చెప్పబడింది. "పరోక్షా నూతనవధువు, దూరప్రదేశమునుంచి తీసుక రాబడినవధువు ప్రియంగానూ, ప్రత్యక్ష: నితరం చూస్తూ వుండబడిన వధువు విషప్రాయంగానూ వుంటుంది. (2) ప్రధానంగా ఒకేగోత్రంలో, రక్తసంబంధంలో వివాహాలు జరుగటంద్వారా భవిష్యత్ సంతానాభివృద్ధికి అనుకూల పరిస్థితులు సన్నగిల్లుతాయి. బాల్యంనుంచి ఆటపాటలయందు పరస్పరంకలహించుకొంటూ, ప్రేమించుకొంటూ నగ్నావస్థనుంచి కలసి మెలసి వుండటం వగైరా కారణాలవల్ల వివాహానంతరం వారికి స్థిరమైన ప్రేమ జనించదనే అభిప్రాయమేగాక, వధువు జన్మస్థలము దగ్గరలో వుండటంవల్ల మరికొన్ని కారణాలనుకూడా దృష్టిలో వుంచుకొనటం జరిగింది. సాధారణంగా వధువు తలిదండ్రులు దరిద్రులుగా వుండవచ్చు. అలాంటపుడు కూతురు రాకపోకలు ఎక్కువగా వుంటే, తలిదండ్రుల యింటికి వచ్చినపుడు కూతురుకు ఏరూపకంగానైనా కొంత ముట్టచెప్పాల్సి వుంటుంది. అంతేకాకుండా వధూవరుల జన్మస్థలాలు దగ్గరగా వుంటే తలిదండ్రుల సహాయం వుంటుందనే గర్వం యిద్దరిలోనూ వుంటుంది. ఫలితంగా యిద్దరిమధ్య వైమనస్యాలు పెరిగి ఒకరినొకరు నిందించుకొనటం, వధువు వెంటనే తండ్రి

---

1. అసపిండాచ యా మాతుర సగోత్రాచయా పితుః సాప్రశ,
స్తా ద్విజాతీ నాందార కర్మణి మైథునే. మను 3, 5.
2. పరోక్షప్రియా ఇవాహి దేవాః ప్రత్యక్షద్విషః శతపథ బ్రాహ్మణం
దుహితా దుర్హితా దూరేహి భవతీతి. నిరుక్త 3, 4.

యిల్లు చేరుకొనటం రెండు కుటుంబాలమధ్య నిరంతర కల
హాలు తప్పనిసరి అవుతాయనేది సహజంగా వుంటుంది.
వగైరా కారణాలవల్ల వధువును దూరస్థలంనుంచి తెచ్చు
కొనుట శ్రేయస్కరమని తలంచటం జరిగింది.



# ఆధ్యాత్మిక వాదం - స్త్రీలు

మానవుడు ఋగ్వేద కాలంలో నుంచీ ప్రకృతిని పరి శోధించటం మొదలు పెట్టాడు. ఆనాటి మానవుని పరిశోధన అంతా ప్రకృతిని గురించి, ప్రకృతిలో జరిగే మార్పుల గురించీ. మేఘాలు ఎక్కడనుండి వస్తాయి? వర్షము ఎలాకురు స్తుంది? సూర్యుడు రాత్రిపూట ఎక్కడుంటాడు? అంతరిక్షా న్నుంచి క్రిందికి జారకుండా సూర్యునికి ఆధార మేది? నక్ష త్రాలు అంతరిక్షంలో ఎలా నిలబడి వున్నాయి? వగైరా వగైరా శతకోటి ప్రశ్నలు వేసుకొని, వాటికి సమాధానాల కొరకు పాకులాడేవాడు. దీర్ఘ కాల అన్వేషణపైన కొన్ని విజయాలు సాధించ గల్గాడు. యీదశలోనే ప్రకృతి పరిశో ధనలో వ్యవసాయము, లోహము కరిగించుట, బట్టల అల్లిక (ఋగ్వేదంచివరిలో లోహకారులు, తంతువాయులు(నేతపని వారు) వున్నట్లు చెప్పబడింది.) వగైరాలను సాధించాడు. యీవిజయాలద్వారా మానవునికి వుపనిషత్ కాలంనాటికి అంటే ఋగ్వేద కాలంనాటికి రెండుమూడు వేలవేండ్లు గడచిన తర్వాత విశ్రాంతి, విజ్ఞానాభివృద్ధి లభించాయి. ఫలితంగా రహస్యాన్వేషణ సాగించటం మొదలుపెట్టాడు. ప్రాణం అనేది ఎలా వుద్భవిస్తూవుంది? పశు పక్ష్యాదులకంటే మాన వునికి తెలివి తేటలు ఎందుకు ఎక్కువగా వుంటున్నాయి?

నిద్రపోయేటప్పుడు తెలివి (చైతన్యం) ఎక్కడకుపోతూవుంది? వగైరా ప్రశ్నలకు ప్రథమంగా శరీరానికి, చైతన్యానికీ (జ్ఞానం) సంబంధంలేదు. శరీరము లేకున్నప్పటికీ, చైతన్యం అనే వస్తువు అంతరిక్షంగా వేరొక స్థలంలో వుంటుంది. అది నశించదు అని కనిపెట్టారు. ఎందుకంటే నిద్రలోను, మూర్ఛలోను శరీరాన్ని విడచి చైతన్యం వేరొకచోటికెళ్లి తిరిగి శరీరంలో ప్రవేశించి శరీరాన్ని నడిపిస్తూవుంది కాబట్టి. అయితే యీ చైతన్యం ఎలా పుట్టుతూవుంది? అనేప్రశ్నకు చాలా తికమకపడి ఆఖరుకు యీ చైతన్యాన్ని వేరొకశక్తి ఉత్పత్తి చేస్తూవుంది. ఆశక్తిని ఆత్మఅని పేర్కొన్నారు. వీరి పరిశోధనలో యీఆత్మ, ఆత్మద్వారా ఉత్పన్నమయే చైతన్యం (యెరుక) సర్వప్రాణులయందు అంటే మానవుల యందేగాక పశు, పక్షి, క్రిమి, కీటక జంగమాదుల (వృక్షాలు, గడ్డి వగైరా) యందు సర్వత్రాలకే ఆత్మఅనే శక్తిద్వారా చైతన్యం (యెరుక) అనేది వుత్పన్నమవుతూ వుందని నిర్వచించాడు. యీపరిశోధన ప్రథమంగా కపిలుడు, వుద్ధాలకుడు వీరిఅనుచర వర్గంద్వారా జరిగింది. వీరిసిద్ధాంతం (మకూత్మా సర్వభూతాత్మా) సర్వప్రాణులయందు వుండబడిన ఆత్మ, నాయందువుండబడిన ఆత్మస్వరూపం ఒకటే ననేకాడికి మాత్రం శ్రేష్టమైనదిగానే అగుపిస్తుంది. కానీ సామాజిక ఆచరణలోకి వచ్చేటప్పటికి వర్ణవ్యవస్థ, (కులాలు) వర్గవ్యవస్థల విషయాలలో (ధనిక, బీద) గందరగోళంలోపడి అవి అనాది శాశ్వతములు అలాగే వుండిపోవాలిసిందే ననటంద్వారా సమాజానికి మేలుచేయలేకపోవటమేగాక, దోపిడివర్గాలకు

ఒక ఆయుధాన్ని తయారుచేసి చేతికందించారు. స్త్రీలయెడల వీరి దృక్పథం కేవలం అమానుషంగా వుంటుంది. మానవుని ఆత్మోన్నతికి, ముక్తిమార్గానికి స్త్రీలు చీడపురుగులంటుంది. స్త్రీలనుగురించి జ్ఞానవాశిష్టంలో యీవిధంగా చెప్పబడింది. "దీపశిఖరమిడు తలనాకర్షించి వాటిని ఏవిధంగా భస్మం చేస్తావుందో అదేవిధంగా అమాయకుడైన పురుషుని స్త్రీ సౌందర్యం (దీపశిఖ) ఆకర్షించి సర్వనాశనం చేస్తుంది." కాబట్టి స్త్రీని మాయావినిగా, టక్కరిగా, సర్వనాశినిగా భావించి ఆఖరుకు కుటుంబ పరిత్యాగము జేసి పారిపొమ్మంటుంది. అయితే కపిలుని, సమకాలికుడైన యాజ్ఞవల్క్య యీవిధానాన్ని వ్యతిరేకించటంతో ఆధ్యాత్మిక వాదులలో రెండు తెగలు ఏర్పడి, ఆ తెగల వేర్వేరు సాంప్రదాయాలు నేటి వరకు విడివిడిగానే చెలామణీ అవుతూ వస్తున్నాయి. యాజ్ఞవల్క్య సిద్ధాంతం సూక్ష్మంలో మోక్షాన్ని చూపించింది. మోహిగానీ, క్రోధిగానీ, లోభిగానీ ఏప్రవృత్తి గలవాడైనప్పటికీ నిష్కామకర్మద్వారా ఆత్మోన్నతి ముక్తిని (1) సాధించవచ్చునంటూ పదునైన ఆయుధాన్ని తయారు చేశాడు. బానిస విధానము, ప్రైవేటుఆస్థి, వర్గరాజ్యాంగమూ అమలులోకివచ్చి స్త్రీని బానిసగా, దాసీగా నికృష్ట స్థితిలోకి యీడ్వబడే దశలో యీపదునైన ఆయుధాన్ని

---

నిష్కామకర్మ: నీవుచేసేపని మంచిదా, చెడ్డదా అందులో లాభమా, నష్టమా అనేవిచక్షణ సుఖదుఃఖాలు లేకుండా, నీవుచేసేపనికి నీవుకర్తవు గావు అనేభావం కల్గివుండటంద్వారా అందులోని మంచిచెడ్డలు నీకు అంటక, జన్మరాహిత్యం పొందగలవు.

ప్రభువులు, రాజులు ధరించి సమాజంపైన, ప్రధానంగా స్త్రీ జాతిపైన సులభంగా అధికారాన్ని చెలాయించ గల్గారు. కాబట్టే యితని శిష్యులుకూడా ప్రభువులు, రాజులు వారి సర్వసౌఖ్యాలు అనుభవిస్తూ, ఆత్మోన్నతిపొంది ముక్తిని సంపాదించగల్గారు. అయితేవీరిఆత్మోన్నతిలోకామప్రవృత్తికి స్థానం లేదనుకొనటం పొరపాటవుతుంది. స్వయంగా యాజ్ఞవల్క్య కామవాంఛకు ఒకస్త్రీచాలక యెక్కువమంది భార్యలు కావాల్సి రావటంలోనే యీరహస్య మిమిడివుంది. యితని ప్రధాన శిష్యుడు జనకచక్రవర్తి అంటే కొంతమంది కానిస ప్రభువులకు ప్రభువన్నమాట. యుగప్రవర్తకుడు, ఆత్మవాది త్యాగి, అప్రమాది, బ్రహ్మవాది, యింద్రియనిగ్రహుడు అయిన యితనిగురువు యాజ్ఞవల్క్యకే కామతృష్ణకు ఎక్కువ మందిస్త్రీలు బలిఅయినప్పటికీ, ధర్మ సమ్మతమైనప్పుడు జనకుని విషయంలో ఎంతమంది కల్గివుండి అఘోరిస్తేమాత్రం అధర్మం ఎలాకాగల్గుతుంది?

ఆధ్యాత్మికవాద దృక్పథంలో స్త్రీని సామాజికంగా చిత్రించటంలో 16 వ శతాబ్దపునాటి ఆధ్యాత్మికవాదీ ఆత్మారాముల ఇష్టదైవంగా భావించినవాడు అయిన గోసాయీ తులసీదాసు నిస్పష్టంగా శెలవిచ్చాడు. "స్త్రీయొక్క హృదయాన్ని తెలిసికొనుట సాధ్యంకాదు. కపటోపాయాలకు పుట్టినిల్లు. పాపి దుర్గుణాలకు భాండారం, సాహసి అపద్దాల మారి, చపలచిత్త, మాయావిని, భయంకరమైనది, అవివేకి,

జాతిభ్రష్ట. (1) యీవిధంగా స్త్రీ వ్యక్తిత్వాన్నే కించపరుస్తూ అనేక చోట్ల చెప్పబడింది. కానీ పురుషుని శ్రేష్టత్వాన్ని నిరూపించేందుకుగాను వృద్ధ, రోగి మూర్ఖుడు ధనహీను డైనప్పటికీ, అంధం, చెవిటి, క్రోధి శక్తిహీను డైనప్పటికీ, భార్యపతిని అవమానించినప్పటికీ, పతి సుఖసౌఖ్యాల కొరకు పాటుపడక పోయినప్పటికీ స్త్రీ యమపట్టణంలోకి వెళ్లదు. కొన్ని అనుభవించాల్సి వుంటుంది. (2) ఒకవైపు స్త్రీని అతిహేయంగా, అతినీచంగా చిత్రిస్తూ, మరొకవైపు అదే నీచము, హేయము అయిన స్త్రీకి పురుషుని నిరంకుశత్వాన్ని, క్రూర దౌర్జన్య హింసాప్రవృత్తిని స్త్రీ పాలిట పరమోత్కృష్ట మైనదిగా, పరమపావనమైనదిగా అంటగట్టాలనటంద్వారా సామాజికంగా స్త్రీలవిషయంలో ఆధ్యాత్మిక వాదం పరాకాష్ట చెందుతుంది.

---

1. "విధిహరామ్ న నారి హృదయగతి జానీ,
సకల కపట అఘు అవగుణ ఖానీ. రామచరితమానస అయోధ్యాకాండ
"సాహస అనృత చపలతా మాయా,
భయ అవివేక అసౌచ అదాయా. లంకాకాండ.

2. వృద్ధరోగ వస జడధనహీనా,
అంధ బధిర క్రోధి అతిదీనా,
ఇసేహు పతి కర కిపిం అపమానా,
నారి పావ జమ పురి దుఖ నానా.

అరణ్యకాండ.

# మధ్య యుగం - స్త్రీలు (1)

మహాభారతం తర్వాత మనుస్మృతిలో రాజ్యాంగ యంత్రాన్ని గురించి సమగ్రంగా చర్చించబడింది. అంటే వర్గ రాజ్యాంగానికి గట్టిపునాదులు వేయటంజరిగింది. స్త్రీలగురించి నాటి సమాజంలోఆచరణలోవున్న విధివిధానాలను వుల్లేఖించి నప్పటికీ, వర్గ రాజ్యాంగయంత్రం ప్రాచీన ఆచరణకు సంబంధించిన అవశేషాలను సమూలంగా పూడ్చిపెట్టుతూ, ఏక పత్నీ విధానం, సతీసాంప్రదాయాన్ని అమలులోకి తెచ్చింది.(2) యీసతీ సాంప్రదాయం (సహగమనం) యొక్క ఉద్దేశ్యాలను కొన్నింటిని మనం యిదివరకే చూశాము. యీకాలంనాటికి యిందుకు ప్రధానోద్దేశ్యం యింకొకటికలిగింది. సామూహిక సంపత్తి విధానం నశించి ప్రైవేటుఆస్థివిధానంలో ఆస్థి సంగ్రమణకు ప్రాధాన్యం ఏర్పడింది. పురుషుడు చనిపోయినపుడు

---

1. మహాభారత కాలం తర్వాత బుద్ధయుగంవరకు మధ్యయుగమని చెపబడుతుంది

2. సతీ సాంప్రదాయం రామాయణం కాలంలోనే ఉన్నట్లుచెప్పబడింది కానీ రామాయణకాలంకంటే తర్వాతదైన మహాభారతం యీ సతీసాంప్రదాయాన్ని గురించి పేర్కొనటం జరుగలేదు కాబట్టి రామాయణ గచయిత యీకాలంనాటి సతీ సాంప్రదాయాన్ని రామాయణ కాలంలోనే ఉన్నట్లు చిత్రించాడనేది నిర్వివాదాంశంగా వుంటుంది.

యిదివరలో అతని ఆస్తితోపాటు, అతని భార్యనుకూడా మరొకరు సంక్రమించుకొనేవారు. కానీ స్త్రీకి జీవితంలో ఒకే పురుషుడనే నూతనవిధానం అములులోకి రావటంతో పురుషుడు గతించిన స్త్రీ విధవగా మారింది. పురుషుని సంపత్తికి సంతానం, సంతానం లేకపోతే దాయాదులు అంతేకానీ పురుషుని అర్ధభాగస్వామినియై, అర్ధనారి అని బిరుదు వహించిన స్త్రీకి ఎలాంటి హక్కు లేకుండా చేయ బడింది. పురుషునితోపాటు స్త్రీనికూడా కాల్చివేయటం (సహగమనం) ద్వారా ఆమె పోషణభారాన్ని కూడా వదిలించుకొన్నారు. యీకాలంలో యీవిధానం అతి క్రూరంగా, ఘోరంగా తయారైంది. యీఘోరాన్ని విజ్ఞానేశ్వరుడు, జీమూతవాహనుడు ఎదుర్కొని మితాక్షర, దాయభాగ (1) పద్ధతులను అమలు పరచారు. ఫలితంగా స్త్రీకి కొంత ఆర్థిక అధికారం ప్రాప్తించింది. (తర్వాతకాలంలో యీపద్ధతులకు శంకరాచార్యులు ప్రోత్సాహమిచ్చి తనజన్మస్థలమైన కేరళలో అములులోకి తెచ్చాడు. అదివరకే ఆర్థికాధికారాలు కల్గివుండిన కేరళ స్త్రీకి యీపద్ధతుల ద్వారా మరింత బలంచేకూరింది.) కానీ అదివరకే దాయాదుల ఉదరం యీసంక్రమణ ఆస్తులద్వారా పెరిగిపెద్దదైపోయింది. కాబట్టి విజ్ఞానేశ్వరుల నూతన సంస్కరణ ఎక్కువ కాలం

1. మితాక్షర: స్త్రీకి తలిదండ్రుల వైపునుంచి సంక్రమించే ఆస్థిపైన స్త్రీకే హక్కు ఉండటం.

దాయభాగ: భర్తచనిపోయినపుడు భర్తసోదరులు వగైరా దాయాదులతో పాటు భర్తఆస్థిపైన కొంతహక్కును భార్యకు కలిగిస్తుంది.

నిలద్రొక్కు లేకపోయింది. దాయాదులఆశ విధవకు ఆర్ధిక హక్కులను కల్గించటంలో అడ్డుతగిలింది. వెంటనే వారు సతీ వ్యవస్థను తిరిగి పునరుద్ధరించారు. యీవిధంగా తిరిగి సమాజంలో విధవాసమస్య పరిష్కారమైపోయింది. (బెంగాల్‌లో భీషణ హత్యాకాండ తిరిగి దీర్ఘకాలంవరకు ప్రజ్వరిల్లుతూ వుండినది.) యీవిధానానికి "స్వర్గంలో సుఖసౌఖ్యాలు అనేనినాదం (1) కొంతవరకు పనిచేసింది.

ఆర్యులు జ్ఞాపక చిహ్నంగా ప్రాచీన సాంప్రదాయాలను యజ్ఞ యాగాదులలో మాంసాహారాన్ని, సామూహిక

---

1. మహాభారత కాలంనాటి యజ్ఞయాగాలు కేవలం పరలోకవాంఛలతో కూడుకొన్నవిగాగాక, ఆనాటి ప్రభువులబలదర్పాలను ప్రదర్శించి వారి పెత్తనాధికారాలను స్థిరపరచుకొనేందుకు గాను చేయబడేవి. ధర్మరాజు యుద్ధానికి పూర్వంచేసిన రాజసూయయాగం, యుద్ధం తర్వాత చేసిన అశ్వమేధయాగం యీపుస్తకాన్ని తెలియ జేస్తాయి. మహాభారత కాలంతర్వాతప్రాచీనసాంప్రదాయాలను కాపాడుకొనేందుకు, ఆర్యసంస్కృతిని నాశనంచేసేందుకు ఆర్యేతరులైన నాగులు, నిషాదులు, యక్షులు వగైరా తెగలవారు ప్రయత్నం చేశారు. కానీ క్రమంగానే ఆర్యసంస్కృతీ విధానం (వైదికఆర్థిక) యీతెగలపైన కూడా కొంత ప్రసరించింది. ఆర్యేతరజాతులు ప్రాచీన సాంప్రదాయాలను (సామూహిక) కాపాడుకొంటూ వస్తూవుండే ఆర్యులు, గిరిసంస్కృతికి లోనైన వారూ ప్రాచీన సాంప్రదాయాలను మతసంబంధమైన కర్మకాండగా మార్చివేశారు. అంటే యజ్ఞయాగాలద్వారా అప్పుడప్పుడు ప్రాచీన సాంప్రదాయాలను జ్ఞాపకచిహ్నంగా అమలుజరిపేవారు. యీవిధమైన యజ్ఞయాగాలు చేయటంద్వారా స్వర్గంలో వారికి స్థానమేర్పడుతుందనే భావాలను కల్పించుకొన్నారు. క్రీ॥ పూ॥ 1500 ఏండ్లనాటినుంచీ ఆర్యసమాజం యీకర్మకాండను స్వీకరించింది. యీవిధంగా కల్పించబడిన స్వర్గం స్త్రీజాతిని కొంతవరకు మోసగించగల్గింది.

సంభోగాన్నీ వగైరాలను అమలుజరపటం మొదలుపెట్టారు. ఆర్యసంస్కృతీ ప్రభావితులైన ఆర్యేతలు యజ్ఞ యాగాలకు బదులు యానసాంప్రదాయాన్ని అమలులోకి తెచ్చారు.

ఆర్యులు ఆర్యేతరులను అణచిపెట్టటం, దోపిడీచేయడం, వారి యజ్ఞ యాగాదులలో ఆర్యేతరులకు స్థానాన్ని లేకుండా చేయడం వగైరా కారణాలు ఆర్యసంస్కృతికి ప్రతి సంస్కృతిని నిర్మించుకొంటూ, ఆర్యులతో నిరంతర ఘర్షణకు ప్రారంభించారు. యీ యాన సాంప్రదాయానికి మూలకర్త శక్తి. (1) కాబట్టి యీ సాంప్రదాయకులను

---

1. ఆర్యసంస్కృతి తెచ్చిన పైరివేటుఆస్తి, వర్ణవ్యవస్థ సమాజంలో సామాన్య ప్రజలను పీడించటం, బహిష్కరించటం, అంటరాని వారినిగా భావించటం వగైరా అమానుష చర్యలకు నలిగిపోతున్న ప్రజలు, ఒక కాలంనుంచీ క్రింది వర్ణస్థులు, అంత్యజులు వగైరా పై వర్ణస్థులతో నిరంతరం ద్వేషభావంతో దేశవ్యాపిత ఆందోళన లేవదీశారు. యీదశలో వజ్రయానులు, బౌద్ధులు, శాక్తేయులు, తాంత్రికులు, హీనయానులు, సర్వ స్వతంత్రంగా జీవిస్తూవుండిన బ్రాహ్మణ (ఆర్య) విద్యార్థులు, మంత్రయానం వైపుకు ఆకర్షించబడి మంత్రయానం ప్రజ్వరిల్లింది. మంత్రయానం సక్రియ రూపకంగా సగుణాత్మకమైన (రాగ) కామపోషక రూపాన్ని ధరించింది. యిందునుంచీ ఉత్పన్నమయిన వజ్రయానం అన్ని విధాలా (యాన) (చార్వాక) కర్మకాండను స్వీకరించింది. వజ్రయానం చండాల, రజక, రజస్వల, కన్య వీరితో సంభోగం-నిర్బంధ, మధ్యపాన, మాంసాహారం యిష్టసిద్ధగా భావిస్తుంది. వీరి సిద్ధాంతం ఎవడైతే లోకలజ్జా, శాస్త్రిలజ్జా, కులలజ్జా, దేశలజ్జా మొదలైన వ్యామోహములలో చిక్కుకున్నాడో వాడు(జీవుడు) మోక్షానికి అనర్హుడు. వీటికి అతీతంగా ఎవడైతే వ్యవహరిస్తున్నాడో వాడు ఎల్లప్పుడూ శివుడుగానే వుంటున్నాడు. అంటే నిరంతర మద్యపాన సేవనం, యిష్టమొచ్చిన స్త్రీలతో సంభోగం.

శాక్తేయులు అని పిలవటం జరుగుతూవుంది. యీ విధంగా సమాజంలో ప్రాచీన సామూహిక వ్యవస్థ రద్దయి దాని స్థానంలో మతకర్మకాండలు ప్రవేశించి తిరిగి అసభ్యప్రవర్తనకు దారితీశాయి.



# బౌద్ధ యుగం నాటి - స్త్రీలు

బుద్ధుని కాలంనాటికి అంటే నేటికి 2500 ఏండ్లనాటికి సమాజంలో నిమ్నవర్గాలను దోపిడీ చేయడం, పీడించడం ఉగ్రరూపం దాల్చింది. గ్రామాలకు బదులుగా పట్టణాలు వెలిశాయి. పట్టణాలలో ఉత్పత్తిని కేంద్రీకరించటంద్వారా బానిసవ్యవస్థ బలహీనపడి, అర్ధబానిసవ్యవస్థ అమలులోకి వచ్చింది. నిరంకుశ రాచరిక విధానం అమలుల్లోకివచ్చి ప్రాబల్యాన్ని పొందింది. సమాజంలో ప్రైవేటుఆస్తి, వ్యక్తి ప్రాబల్యంస్థిరపడిపోయింది. (1) యీదశలో స్త్రీకి బాల్యంలో

---

1. మహాభారతకాలం తర్వాత బానిస విధానం అధికోత్పత్తికి కారణమయింది. ఉత్పత్తి అధికం కావటంవల్ల, ఉత్పత్తి మారకం ప్రారంభమయింది. మారకానికి కేంద్రాలుగా పట్టణాలు నిర్మాణమయ్యాయి. యీదశలోనే బానిసల తిరుగుబాట్లుకూడా విజృంభించాయి. చెదురుచెదురుగా పారిపోయి తాత్కాలిక స్వేచ్ఛను పొందిన బానిసలకూ, యజమానుల క్రిందవున్న బానిసలకూ, తమ క్రిందవున్న బానిసలకూ, భూస్వాములుగా నేర్పుంటూ వర్తకంచేసే యువకులు బానిసలకు సహాయపడ్డారు. ఫలితంగా బానిసలను కొనేందుకు, అమ్మేటందుకే గాక యజమానులకు బానిసలను చంపేటందుకు, కొట్టేందుకు, హింసించేందుకు వున్న అధికారాలనురద్దుచేసి, బానిసలను అమ్మేందుకు, కొనేందుకు మాత్రమే అధికారాలు మిగిల్చబడ్డాయి. అర్ధబానిస యుగంలో బానిస విధానం పూర్తిగా నశించకపోయినప్పటికీ, బానిసలకుకొంతస్వేచ్ఛను కల్పించి పరోక్ష రూపకంగా దోపిడీ సాగించారు. పల్లెలలో కూలివాళ్లుగాను, పట్టణాలలో చేతివృత్తుల వారుగాను బానిసలు యజమానుల దోపిడీకి గురిఅయ్యారు. దీన్ని, యీదశను అర్ధబానిసయుగంఅని పిలువబడింది.

తండ్రి, యౌవనంలో భర్త, వృద్ధాప్యంలో పుత్రుడు వీరి అదుపాజ్ఞలలో వుండటంతప్ప స్వతంత్రం అనేది పూర్తిగా నిర్మూలించబడింది. పట్టణాలలో వేశ్యావృత్తి విస్తృతరూపం దాల్చింది. స్త్రీల ఆక్రందనను వినేనాథుడే లేకపోయాడు. యీపరిస్థితులలో స్త్రీకి అయిదురాస్తాలు వుండినవి. 1. ఆత్మహత్య, 2. యింటిలో విధవగా దానిసచాకిరీకి అంగీకరించటం, 3. సతీ (సహగమనం) కావడం, 4. వేశ్యావృత్తి అవలంభించటం. 5. బౌద్ధసంఘాలలో భిక్షుకిగాదీక్షపొందటం. అయితే ప్రథమంలో స్త్రీలను (శ్రమణికలుగా) బౌద్ధసంఘాలలోకి తీసుకొనేందుకు బుద్ధుడు అంకీకరించలేదు. ఎందుకంటే స్త్రీల సాపర్క్యం ద్వారా బౌద్ధసంఘము పతనమైపోతుందని భావించాడు. స్త్రీయెడల సమాజంచూపే నిర్దాక్షిణ్య భావాన్ని ప్రథమంలో యీయనకూడా కనబరచాడు. కానీ అనాథ స్త్రీల పోత్తిడివల్ల ఆఖరుకు సంకోచంతోనే వారికి ప్రవేశమిస్తూ యీవిధంగా భవిష్యవాణిని వెలిబుచ్చాడు. "వేయిసంవత్సరాలు మనగలిగే సంఘం స్త్రీ సంపర్క్యంవల్ల అయిదు వందల సంవత్సరాలే మనగల్గుతుంది." యీయన స్త్రీలకు బౌద్ధసంఘంలో ప్రవేశమీయటంలో యింకొక వుద్దేశ్యాన్ని కూడా (ప్రయోజనాన్ని) గ్రహించాడు. స్త్రీలలో స్త్రీ శ్రమణికద్వారా బాగా ప్రచారం చేయించవచ్చుననే భావము. అయితే బౌద్ధసంఘములోచేరే స్త్రీ పురుషులకు కఠినమైన ఏర్పాట్లు ఏర్పరచినాడు. వారు ఎంతవరకు బ్రహ్మచర్యాన్ని నియమబద్ధంగా ఆచరించ గలరో అంతవరకు మాత్రమే వారికి బౌద్ధసంఘంలో స్థానంవుంటుంది. బ్రహ్మచర్యాన్ని నియమ

బద్ధంగా పాలించలేక పోయినప్పుడు వారిని వివాహమాడి కుటుంబ జీవనానికి వెళ్లిపొమ్మని తెలవిస్తుంది.

సామాజికంగా బుద్ధుడు కొన్ని ధార్మిక సూత్రాలను అమలు పరచాడు. కానీ ఆనాడు అతిదీనావస్థలోవున్న స్త్రీల సమస్య యీయన బుద్ధికే తట్టకపోయింది. యీయన సిద్ధాంతాల ప్రభావానికి లోనై అశోకుడు ధర్మకార్యాలు అనేకం చేశాడు. అశోకునికికూడా స్త్రీజాతిని వుద్ధరించాలనే సమస్యే అగుపించలేదు. అయితే ప్రజాసామాన్యంలోకూడా బౌద్ధమతం విశేష వ్యాప్తి పొందింది. ఫలితంగా స్త్రీలస్థితి కొంత మెరుగగానే వుండేదని చెప్పవచ్చు. సామాజిక వ్యవస్థ మాత్రం అర్ధబానిస విధానం నిరంకుశ రాచరికం. క్రీ॥ పూ॥ 300 నుండి క్రీ॥ శ॥ 100 ఏండ్లవరకు శాతవాహనుల కాలం. శాతవాహన రాజులందరూ తమతల్లిపేరుతో ప్రారంభించి, తమపేర్లు చెప్పుకొన్నారు. వీరితర్వాత పరిపాలించిన యిక్ష్వాకులుకూడా ఇదేపద్ధతిఅవలంభించారు. దీన్నిబట్టియీకాలంలో స్త్రీకి కొంతప్రాముఖ్యత యివ్వబడినట్లు తెలుస్తుంది. కానీ యీప్రభావం సమాజంపైన ఎంతవరకు పడిందిఅనే విషయాన్ని స్పష్టంగా తెలియజేసే ఆధారాలు దొరకవు.



# సామంత యుగపు - స్త్రీ

సామంత యుగంలో (1) స్త్రీలస్థితి అత్యంత దయనీయంగా తయారైంది. సామంతుల కామతృష్ణకు దేశంలోని సౌందర్యవతులను మందలు మందలుగా తెచ్చి రాజమహల్‌లలో పడేశేవారు. అర్జునుడు, శ్రీకృష్ణునితో ప్రారంభమయిన అసుర(వివాహ)పద్ధతి యీదశలో తిరిగి ప్రజ్వరిల్లింది. సౌందర్యవతులైన స్త్రీలకొరకుగానే చాలాసార్లు యుద్ధాలు జరిగాయి. పృథ్వీరాజు స్త్రీలకొరకే చాలాసార్లు యుద్ధాలు చేశాడు. యీదశలో భూమి, పశువుల సంబంధంలో ఏవిధమైన తకరార్లు, కొట్లాటలు జరిగేవో స్త్రీల విషయంలోకూడా అదేవిధంగా జరిగేవి. సామంత ప్రభుల దానకీర్తికికూడా స్త్రీజాతి యెరగావాల్సి వచ్చింది. స్త్రీని ఆవు, గొర్రె, మేక, భూమికివలెనే దానంచేయటం ప్రారంభించారు. యిందులో దానవస్తువుయొక్క యిష్టానిష్టాలతో నిమిత్తంలేదు. దానమిచ్చే దాత యిష్టానిష్టాలపైన ఆధారపడి వుంటుంది.

---

1. సామంతయుగం క్రీ॥ పూ॥ ప్రారంభమయి 10 శతాబ్ద మహమ్మదీయుల దండయాత్రల వరకు, సామంతయుగం అని పిలువబడుతుంది. యీదశలో బుద్ధజైనులు మొదలుకొని అనేకమంది మతప్రచారకులు, ప్రవక్తలు ఉత్పన్నమయ్యారు. కానీ సామంత ప్రభువుల నిరంకుశత్వాన్ని నిర్మూలించేటువంటి మతప్రవక్తలు, మతాలూ కూడా సామంతుల దయాదాక్షిణ్యాలకు లోను కావటం, వారికి అండగా నిలబడటం జరిగింది.

విద్యాపతి కామతృష్ణను జయదేవుడు స్త్రీలను మందలు మందలుగా తెచ్చి అర్పించేవాడు.

విజయనగరం రాజా రామరాజు చరిత్ర యీవిషయంలో ప్రసిద్ధికెక్కింది. యీయన అంతఃపుర కాంతల నుంచటంలో శ్రీకృష్ణ నేతల దన్నాడు. యీయన వృద్ధాప్యంలో కూడా నవయువ సౌందర్యవతులు రాజమహల్ అలంకరిస్తూనే వుండినారు. వృద్ధాప్యంలో యీయన యీనవయువ సౌందర్యవతులను నిరంతరం వారి నగ్న సౌందర్యాలను, నగ్న నృత్యాలను తిలకించటంద్వారా సంతృప్తి పడేవాడు. యిటువంటి చరిత్రలు అనేకం దొరుకుతాయి.

యీదశలో మతకలహాలు జోరుగా సాగాయి. కానీ యీమతకలహాలు సమాజంలోని పీడితప్రజల ఉద్ధరణకుగా గాక, కేవలం తాత్విక సిద్ధాంతాల ప్రాబల్యం కొరకు మాత్రమే జరిగాయి. మతివాదులలో శంకరుడు మాత్రం ప్రాచీన వేదసంస్కృతికి, అనుగుణమైన సంస్కృతిని నిర్మించేందుకు ప్రయత్నించినప్పటికీ యీయనకూడా మతప్రాబల్యం కొరకు ప్రాకులాడటంతోను, విశిష్టాద్వైత (1) ప్రచారాన్ని సాగించటం వల్లనూ యీయన తాత్విక దృక్పథం అంతా సామంతుల ప్రాబల్యంలోకి పోయింది.

ఒకవైపు మతప్రచారాలు, మతకలహాలు, తాత్విక చర్చలు జోరుగా సాగుతూంటే, మరొకవైపు సామంతులు, ధనవంతులు యీ మత విషయాలను తమకనుకూలంగా

---

1. అద్వైతం సకలమతాలను పాటించదు. విశిష్టాద్వైతం సకలమతాలను నిలుపుకొంటూ, ఆధ్యాత్మిక వాదాన్ని స్వీకరిస్తుంది.

మార్చుకొంటూ, సామాజిక పెత్తనాన్ని సంపూర్ణంగా తమ చేతుల్లో వుంచుకొని ఆర్థిక, నైతిక ధార్మిక రాజకీయ సాహిత్యరంగాలను తమగుప్పెట్లో పెట్టుకొని తమ భోగలాలసతకు సాధనాలుగా వుపయోగించుకొన్నారు. యీకాలంలోని సాహిత్యకారులు సామాజిక విషయాలను పూర్తిగావిసర్జించి కేవలం కామప్రేరేపక, శృంగార కావ్యాలను, కామశాస్త్రాలను తయారు చేయటంద్వారా తమపోషణకర్తల సహాయ సానుభూతులను సంపాదించుకొనేందుకు ప్రయత్నించారు. స్త్రీని కామిణీ, కామనా, ఉద్దేశ్య, రమణీ, రమించే సాధనము యీపాత్రిపదికపైన సాహిత్యం తయారు చేయబడింది. ప్రసిద్ధ నాటక కారులూ, శృగార కవితాశేఖరులు అయిన కాలిదాసు, విశాఖ, దత్తుడు వగైరాలు స్త్రీ స్థానాన్ని పశువులు, ఆశ్రిత, దాసి, కామిణి స్థానంలోవుంచి పురుషుని కామప్రవృత్తిని రేకెత్తించే సాధనాలుగా తమకావ్యాలలో స్త్రీ అవయవ వర్ణన గావించారు. భవభూతి, భర్తృహరి, వాణీదండి వగైరా ప్రసిద్ధ సాహిత్యకారులు స్త్రీని నఖశిఖ పర్యంతం నగ్నస్థితి వర్ణన చేశారు. భర్తృహరి స్త్రీ మాయా వశుడై ఏడుసార్లు సన్యసించి, ఏడుసార్లు గృహస్థు అవుతాడు. దండి దశకుమార చరితంలో స్త్రీని విలాసినిగా చిత్రించి, అవయువ వర్ణన నగ్నరూపంలో చిత్రించాడు.

కడుపు కక్కుర్తికి పనిజేసిన యీ కవితా శేఖరుల ప్రతిభా విశేషాలు స్త్రీజాతి ఒకేజాతి అనే భాగాన్ని విస్మరించి స్త్రీజాతిని కొన్ని తెగలుగా విభాగించి మొత్తం స్త్రీ జాతినే అవమాన పరచారు. బంగారు చాయకల్గి, అందమైన

శరీర అవయవ లక్షణాలన్నియు కలిగివుంటే పద్మిణి స్త్రీ అని, ఆమె చాలా పవిత్రంగా వుంటుందనీ, యీలక్షణాలు తగ్గిన కొలదీ మిగతా జాతులక్రిందకు అంటే హస్తిని, చిత్తినీ, శంకినీ వగైరా వస్తారని నిర్వచించారు. మొత్తం మీద భావమేమిటంటే ఎర్రిగాను, అందంగాను వుండే వాళ్ళంతా పతివ్రతలు, మంచిస్త్రీలు, గుణసంపన్ను లనిన్ని, నల్లగావుండి అందం అంతగా లేనివాళ్ళంతా వ్యభిచారిణులు, గుణం, నీతిలేనివారని తేల్చారు. అయితే వీరు ఏరూపవతుల నైతే పతివ్రత, గుణవతి అని చెప్పారో ఆరూపవతులే వీరి కథానాయికలుగా రంగభూమిలో మోహపరవశత్వంలో విహరించారు. అంతేకాకుండా వీరి పతివ్రత అయిన పద్మినీ స్త్రీని వశపర్చు కొనేందుకు, ఆమెతో సంభోగించేందుకు అనేక విధాలా కుతంత్రాలు, వుచ్చాటనలు, తాయత్తులు వగైరా సృష్టించారు. అంటే స్త్రీపాత్రను నిర్ణయించటంలో మానవత్వాన్నే కోల్పోయి కేవలం నీచత్వాన్ని, పైశాచి కత్వాన్ని పెంచి పోషించారన్నమాట. రూపాన్ని బట్టి గుణగణాలను నిర్ణయించటంలో వున్న వుద్దేశ్యం కామ ప్రవృత్తిని ప్రోత్సహించటం మాత్రమే కాగలదు. స్త్రీ పురుష సంబంధాలను నిరంతర అనుమాన వాతావరణంలో వుంచి ఆసంబంధాలను విచ్ఛిన్నం చేసేందుకు సమాజంలో వ్యభిచారాన్ని, అనైతికను ప్రోత్సహించేందుకుతప్ప యీ కామకళ పవిత్రోద్దేశ్యాలతో తయారు చేయబడిందికాదు. వాస్తవంలో పవిత్రమైన దాంపత్య కుటుంబ ప్రేమకూ, కామానికీమధ్య చాలా తేడావుంది. చాలామంది సౌందర్య

వతులను చూచినపుడు వుత్పన్నమయే కామాన్నే ప్రేమ అనుకొంటూ వుంటారు. కానీ స్త్రీ పురుషుల విషయంలో ముందుగా కలిగేది కామం. యిందులో తాత్కాలిక ప్రేరకం, తాత్కాలిక ప్రయోజనంతప్ప యింకొకటేమిగులదు. కుటుంబ ప్రేమ అనేది ఒకరి కష్టసుఖాలు ఒకరు అర్థం చేసుకొనటం, జీవితంలోవచ్చే ఆటుపోటులను పరస్పర సహాయ సానుభూతులతో అర్థం చేసుకొనటం ద్వారా ఒకరి కష్టసుఖాలను మరొకరు భాగస్వాములై పంచుకొనటంద్వారా స్థిరమైన ప్రేమ వుత్పన్న మవుతుంది. వాస్తవమైన ప్రేమ ఎప్పుడు కూడా చాలా ఆలస్యంగానే పుట్టుతుంది. యిటువంటి పవిత్ర ప్రేమ ఆదిమ కమ్యూనిస్టు గణసంఘాల్లోతప్ప మరేదశలో కూడా కానరాదు. అందుకు కారణాలు ముందుముందు చూస్తాము. యీసామంత దశలో ఒకపుడు భారత దేశపు రాజులు, శ్రీమంతులు భారత దేశపు సౌందర్యవతులతో తనివితీరక యూనానీ దేశపు సౌందర్యవతులను ఎక్కువగా కొనటం సాగించారు. యీస్త్రీలను కౌటిల్యుడు, ప్రాతః కాలదార్శనికలుగా నిర్ణయించేడు. అంటే ఉదయం ప్రభువుల మేల్కొలిపే వారుగా. యీఅవసరాన్ని పురస్కరించుకొని యూనానీస్త్రీలు అంతఃపుర స్త్రీల శ్రేణినిఆక్రమించారు.



# మహమ్మదీయుల దండయాత్రల తర్వాత

మహమ్మదీయుల దండయాత్రలు చేయు కాలంనాటికి (11 శతాబ్దం) దేశంలో స్త్రీలకొరకు, రాజ్య విస్తరణ కొరకు (ఎక్కువగా స్త్రీలకొరకే యుద్ధాలు జరిగేవి.) సామంత రాజులమధ్య జరిగే యుద్ధాలవల్ల సామాన్యప్రజల దైనందిన జీవనం అత్యంత క్షీణదశకు చేరుకుంది. స్త్రీలస్థితి, పైవేటు కుటుంబం తెచ్చిన బానిసత్వం, సహగమనం వగైరాలవల్ల అత్యంత దయనీయంగా తయారైంది. అంతే కాకుండా సమాజంలో పెంచిపోషించిన కామకళ ఫలితంగా స్త్రీల శీలరక్షనే దుర్లభమైపోయింది. యీపరిస్థితులలో మహమ్మదీయుల దండయాత్రల ఫలితం మరీఘోరపస్థితులను కల్పించాయి. అంతఃకలహాలవల్ల నీరశించిపోయిన భారత దేశం మహమ్మదీయుల దండయాత్రల నరికట్టడంలో విఫల మౌతూ వచ్చింది. మహమ్మదీయ సామాన్యసైనికునికి కూడా భారతస్త్రీ తనశీలాన్ని అప్పగించాల్సి వచ్చింది. మహమ్మదీయ ప్రభువుల (రాజుల) వ్యవహారం అమానుషం, అతి ఘోరం, యీరాజులు హిందూరాజుల భార్యలుగాని, కూతుర్లు చెల్లెండ్లుగానీ సౌందర్యవతులుగా వుండినుంటే ఆస్త్రీలకొరకు గానే యుద్ధాలుచేయుటం, ఆస్త్రీల తమకిమ్మని రాజీ రాయభారాలు నడపడం మొదలు పెట్టాయి. నీరసించి పోయిన కొందరు హిందూరాజులు తమభార్యలను,

కూతుర్లను, తోబుట్టువులను మహమ్మదీయ రాజులకు అప్ప గించి తమనామమాత్ర అధికారాలను నిలబెట్టుకోగల్గారు. కొందరు తెగించియుద్ధంచేసి ఓడింపబడి తమస్త్రీలను పోగొట్టు కొన్నారు. యీవిధంగా భారతదేశపు స్త్రీలకు రక్షణఅనేదే మృగ్యమయి పోయింది. మహమ్మదీయులు భారతదేశపు సౌందర్యవతులను మధ్యఆసియాలో క్రయవిక్రయ వస్తువు లనుగా కూడా చెలామణిచేశారు. భారతస్త్రీ యీవిధంగా నిస్సహాయురాలై పోయింది.

మహమ్మదీయ ప్రభువులలో తుగలక్, యితనిమంత్రి మకబూబఖాం వశములో అనేకమంది. స్త్రీలు నిత్యాయమ యాతనలకు గురిఅయ్యారు. జైహూనీ కామపిశాచికి ఇటలీ మొదలుకొని టిబెట్, చీనా వరకూగల సౌందర్యవతులు బలికావాల్సివచ్చింది అక్బర్ రాజుకు మహల్ లోక్షత్రియాంగ నలు మొదలుకొని హరిజన కన్యలవరకు ప్రాధాన్యత పహిం చారు. వీరినిగురించి అబుల్ ఫజల్ యీవిధం చెప్పాడు. "అనేక తెగలకుచెంది వివిధ మనఃప్రవృత్తులుగల యీస్త్రీ లను, వీరి పరస్పర సంఘర్షణలను సఫలతతో పరిష్కరించ గల్గినవాడు, సులభంగా సామ్రాజ్యాన్ని పాలించ గలడు." కానీ అక్బర్ భారతదేశపు స్త్రీలనికృష్ట జీవింతంపైన సాను భూతి చూపించాడు. యితని పరిపాలనలో సతీప్రథను (సహ గమనాన్ని) నివారించేందుకు కృషిచేశాడు. కానీ విజయాన్ని సాధించలేక పోయాడు.

భారతదేశ స్త్రీ పేరుప్రతిష్టలను నిలబెట్టేందుకు అప్పు డప్పుడు శౌర్య సాహసాలను ప్రదర్శించిన స్త్రీమూర్తులు

కూడా లేకపోలేదు. 1262 నుంచి 1296 వరకు పాలించిన రుద్రమదేవి భారతదేశ స్త్రీజాతి ఔన్నత్యాన్ని కాపాడ గల్గింది. యీమె అసమాన ధైర్య సాహసాలతో ఆంధ్రదేశ స్వాతంత్ర్యాన్ని పరరాజుల దండయాత్రలనుంచి కాపాడింది. రుద్రమదేవి దేవగిరి యాదవుల నోడించింది. సామంత ప్రభువులతిరుగుబాట్లనణచింది.ఒక స్త్రీ అసమాన ధైర్యసాహసాలతో రాజ్యాన్ని పరిపాలించిన ఘట్టమియిది. మనచరిత్రలోనే ప్రత్యేకస్థానం వహించింది.

1377 కంపరాజు భార్య గంగాదేవి సంస్కృత కావ్యంలో మహమ్మదీయులపాలనలో ప్రజలుపడ్డ అగచాట్లను సవివరంగా వర్ణించింది. అయితే హిందూ రాజులుకూడా వీలుదొరికినపుడల్లా మహమ్మదీయుల స్త్రీలను మానభంగం చేయడం, చెరపట్టడంలో మహమ్మదీయులకు తీసిపోలేదు. 1550 తర్వాత కృష్ణదేవరాయల అల్లుడు అర్వీటి రామరాయలు పరిపాలనలో మహమ్మదీయుల రాజ్యాలపైన దండయాత్రలు చేయటం, మహమ్మదీయుల అవమాన పరచటం, వారి స్త్రీలను చెరపట్టటం వగైరా ఘోరకృత్యాలు ఎన్నో చేశాడు.

ఘోషాపద్ధతి అదివరకే క్షత్రియాంగనలు (రాజ స్త్రీలు) కొంచంగా రుచిచూశారు. యీఅంధకారయుగంలో స్త్రీ సౌందర్యంకొరకు కటుంబాలు, రాజ్యాలుకూడా సర్వ నాశనం కావలసి రావటంతో యీఘోషాపద్ధతిని సాధారణ స్త్రీలుకూడా జీవిత సమాధులలోకి వెళ్లాల్సి వచ్చింది. స్త్రీలు తమ భర్తలనుకూడా ప్రత్యక్షంగా చూచేభాగ్యాన్ని

కోల్పోయారు. అంధకారంలో తనవద్దకు వచ్చిన పురుషుడు తనభర్తో మరొకడో. అతని ఆజ్ఞప్రకారం మసలడంమినహా వ్యక్తి చైతన్యాన్నే కోల్పోయింది. యీవిధంగా స్త్రీజాతిని అంధకార కూపంలోకి నెట్టడం జరిగింది.

స్త్రీల యెడల మహమ్మదీయుల దృక్పథం "రజస్వలా స్త్రీతో ఓస్త్రీ నీవు అపవిత్రురాలవు మనుష్యసంబంధాలను వదులుకొని కడగావుండుము. ఋతుసమయంలో ఆమెను స్పర్శించటంగానీ కూడదు. నీభార్య నీకు భూమివంటిది. నీకు ఏవిధంగా యిచ్ఛవుంటుందో ఆవిధంగా ఆమెను వుపయోగించుకో.

(ఖురాన్ 4 మ, 16 సి, 18 సు, 205ఆ.)

అంటే స్త్రీపైన పురుషునికి సర్వాధికారాలను మహమ్మదీయ సాంప్రదాయంకూడా కలిగిస్తూవుంది. అయితే మహమ్మదీయులు వివాహ సందర్భంలో మాల్, అంటే వరుని స్థితినిబట్టి కొంత మొత్తాన్ని వధువు పేరుతో, కరారు రూపకంగా వ్రాయబడుతుంది. పురుషుడు స్త్రీని విడిచినప్పుడు ఆ మొత్తాన్ని భార్యకు యివ్వాలిసి వుంటుంది. యీవిషయం కొంత, స్త్రీల విషయంలోకొంత సానుభూతి చూపబడింది.

యీవిధంగా పురుషుని కామాగ్నికి, సహగమనఅగ్ని కాండకు, అన్నింటికి మించిన అంధకారకూపం (ఘోషా) లోకి స్త్రీజాతికి సంపూర్ణంగా బలిదానం చేయాల్సిన పరిస్థితులు కల్పించ బడినాయి. యీపరిస్థితులలో మెల్లగా యీస్టిండియా కంపెనీవాళ్లు అధికారాలను హస్తగతం (17 వ శతాబ్దంలో) చేసుకో నారంభించారు. యీస్టిండియా

సైనికులు, ఆఫీసర్లు బెంగాల్‌లో స్త్రీలయెడల ప్రవర్తించిన విధానం అత్యంతనీచంగా పరిణమించింది. కేవలంపాశవికంగా పశుత్వంతో ప్రవర్తించారు. అయితే తర్వాతయీస్టిండియా పరిపాలనలో స్త్రీజాతికి చేసిన ఒక ఉపకారాన్ని మాత్రం మరువలేము. రాజా రామమోహనరాయి కృషి ఫలితంగా విలియం, బేంటింక్ పరిపాలనలో సతీదాహాన్ని సమూలంగా నాశనం చేయబడింది. (1832 సం॥ లో సహగమన పద్ధతిని నిషేధింపబడింది.) యింతవరకు స్త్రీజాతి అనుభవించిన యీ ఘోర హత్యా కాండనుంచి స్త్రీజాతినిఉద్ధరించటం జరిగింది. అయితే యీస్టిండియావారి ప్రధానోద్దేశ్యం భారత దేశాన్నుంచి లాభాన్ని పొందటం, లాభదాహానికి భారతప్రజలను నిర్దాక్షిణ్యంగా అణచిపెట్టడంలో జరిపిన క్రూరహింసలు వర్ణనాతీతం. యీహింసా ప్రవృత్తిని ఎదుర్కొనేందుకు పురుషులతో భుజంభుజంకలిపి, ధైర్యసాహసాలతో యీస్టిండియా వాళ్లను గడగడలాడించినకీర్తి స్త్రీజాతికే దక్కింది. యీ కీర్తిని ఝాన్సీరాణీ, లక్ష్మీబాయి యీమె ఆదిపత్యంక్రింద వుండినస్త్రీలు భారతదేశపు స్త్రీజాతికి సంపాదించి పెట్టారు.



# కొనుగోలు వివాహాలు లేక కన్యాశుల్కాలు

ఈసాంప్రదాయం ప్రాచీన కాలంనుంచి అనుశ్రుతంగా రూపాన్ని మార్చుకొంటూ వచ్చింది. వధువుకుగాను చెల్లించే ఖరీదును కన్యాసుల్కం అని పిలువబడుతుంది) ప్రాచీన కాలంలో యీవిధంగా చెల్లించినఖరీదు (వస్తువులు. సాధారణంగా వధువు తలిదండ్రులు అపహరించక, తిరిగి వధువుకు అప్పగించబడేవి. యీఆచారాన్ని గురించి మను స్మృతిలో యీవిధంగా చెప్పబడింది. "వధువు బంధువులు శుల్కాన్ని తమకుగా వుపయోగించుకోనట్లయితే ఆవివాహం కొనుగోలు పద్ధతిమీద జరిగిందని చెప్పలేము. వరుడు వధువు పైన చూపే గౌరవం, దయ, సానుభూతుల్ని ఆబహుమతి నిరూపిస్తుంది. దీన్నే మనువు ఆర్షవివాహంగా నిర్ణయించాడు. ఆచారం, సగోత్ర వివాహాలను నిషేధించటంతో రెండు గోత్రాలవారు (రెండు తెగలు) పరస్పరం కన్యలను బదిలీ చేసుకొనే ఆచారంఅమలులోకి వచ్చింది. ఆవిధంగామార్పిడి ద్వారా వచ్చినస్త్రీలు సామూహిక కుటుంబాలలో ఆకుటుంబానికి (తెగకు) అంతటికీ చెందినవారుగా వుండేవారు. కాలాంతరంలో వ్యక్తిగత కుటుంబాలు ఏర్పడిన తర్వాత ఒకకుటుంబంలోని కన్యలు మారకం జరిగినపుడు, బదిలీగా వచ్చిన కన్యలకు యువకులు లేకపోవటంజరిగేది. ఆసందర్భాలలో ఆయింటి పురుషుడు అంటే మారకానికి కూతుర్లను

యిచ్చిన తండ్రి బదిలీగా వచ్చిన స్త్రీలను భార్యలుగా స్వీకరించటం ఆచారంగావుండేది. ఆడపిల్లలులేక, మగపిల్లలు మాత్రమేవుండే కుటుంబాలు వస్తువులను వగైరాలనుయిచ్చి ఆడపిల్లలను తెచ్చుకొనటం జరిగేది. అంటే మారకానికి బదులు కొనటంజరిగేది. కొన్ని సందర్భాలలో యిది వ్యాపారంగాకూడా జరిగేది. అంటే ఒకకుటుంబంలో యిద్దరుయువకులు, యిద్దరుకన్యలువున్నపుడు ఆడపిల్లలుసౌందర్యవతులు, గుణవంతులుగా వుండెడివారికి గిరాకీ ఎక్కువగావుంటే, వారిని ఎక్కువవెలకుఅమ్మి, తమకుఅవుసరమైన యిద్దరు ఆడపిల్లలను సాధారణమైనవారిని, సాధారణమైన వెలకు తెచ్చుకొనటంద్వారా కొంతధనాన్ని మిగుల్చుకొనటం జరిగేది. ఆర్థికంగా వెనుకబడినవారుమాత్రం యీవిధంగా చేసేవారు. కాలాంతరంలో ప్రైవేటుఆస్తిసమాజంలోవిస్తరించటంద్వారా కొన్ని కుటుంబాలు ఆర్థికంగా చితికిపోవటం జరిగింది. అటువంటి కుటుంబాలు కుటుంబపోషణకుగాను ఆడపిల్లలను బాల్యంలోనే అమ్మేసేవారు. దీనివల్ల ఆడపిల్లలభారం వదిల్చుకొనటమేగాక, సగందరిద్రం తీరేటట్టుగా ఆమెనుంచి కొంత ధనాన్ని రాబట్టుకొనేందుకు ప్రయత్నించేవారు. యీవిధమైన అమ్మకాలు నైజాంలోనూ, పాలఘాట్ (కాశీ) వగైరా ప్రదేశాలలో నేటివరకు యీవ్యాపారం విరివిగా జరుగుతుండేది. స్త్రీని ఒక ఆస్థిభాగంగా, వస్తువుగా పరిగణించటమే యీపద్ధతికి ముఖ్యకారణంగా ఏర్పడింది. యీపద్ధతిలో స్త్రీ కూడా ఒకమనిషేననే భావం పూర్తిగా హరించిపోయింది. అయినప్పటికీ, స్త్రీ ఎల్లపుడూ సమాజానికి అత్యంతావశ్యక

మాతూవుంది. ప్రతిఫలంగా సమాజం ఆమెకు ఏమిచ్చింది? సమాజంలో ఆమెకు అధికారం లేకుండా చేసింది.. ఎప్పుడు సమాజంలో అధికారం లేకపోయెనో, సమాజంఆమెది కాదు. కానీ ఆమె సమాజానికి కావాలి ఒక అత్యంత ముఖ్యమైన వస్తువు హోదాలోమాత్రం.

ఆర్థిక పరిస్థితులు మరీ తారుమారు కావటం, నిత్య దరిద్రంతో అల్లాడిపొయ్యే కుటుంబాలకు వరుని ఆవశ్యకత కన్నా, ధన ఆవశ్యకత ప్రాముఖ్యంగా పరిణమించింది. యీ అవకాశాన్ని పురస్కరించుకొని మధ్యదలారీలు యీవ్యాపారాన్ని విరివిగా సాగించటం మొదలుపెట్టారు. దళారీకికన్యను యెవరికి అమ్మాలనే విచక్షణ వుండాల్సిన అవుసరంలేదు. అతనికి కావలసినదల్లా తనుపెట్టిన మొత్తంపోను, ఎంతమిగులు బడి అనేదే అతనికిముఖ్యం కాబట్టి వధువును కొనేవాడు 60 లేక 80 ఏండ్ల వృద్ధయువకుడా, అవయవ హీనుడా, లేక 20 ఏండ్ల నవవయస్కుడా అనేఆలోచన అతనికి అప్రస్తుతం. యీ సుఅవసరాన్ని చూచి శతవృద్ధులకుకూడా తెగులు పుట్టుకొచ్చింది. యీ హేయమైన ప్రవర్తనను రాజయోగి అయిన వేమన యీవిధంగా అపహసించాడు. "కాంతను జూచిన, కనకంబు జూచిన బ్రహ్మకైనబుట్టు రిమ్మ తెగులు." డబ్బువుండి, ఒక నవయువ సౌందర్యవతిని కొనగల శక్తిసామర్థ్యాలు వున్నపుడు మరణశయ్యపైన వుంటేమాత్రం ఏనికృష్ట జీవి యీసదవకాశాన్ని జారవిడుస్తాడు. కానీ యీనవసుందర లావణ్యవతులైన వస్తువులనుకాపాడేందుకు ఎంతఅవస్థ పడినారో అది వారికే తెలియాలి. యీఅవుసరాన్ని వుపయో

గించుకొని శతవృద్ధులుకూడా పావు శేరు బియ్యమో, లేక ఒక చెప్పులజతతోనో సమానంగా కన్యలనుకొని వివాహాలు చేసుకొనటం, అయితే సాధ్యమయింది. కానీ తానుకొనే వస్తువుకు చైతన్యం, బుద్ధి వగైరాలు వున్నాయనీ, ఆవస్తువుకుకూడా కొన్ని అవుసరాలు వున్నాయనీ, ఆఅవుసరాలను తీర్చాల్సి వుంటుందనే విషయాలను విస్మరించటంతో యీ మహానుభావులు ఘోర విపత్తును ఎదుర్కొనాల్సి వచ్చింది. కావలసినంత డబ్బుపోసి ఒకవస్తువును కొన్నపుడు యజమానియొక్క అవుసరాలను తీర్చేందుకుకాక, నాకూకొన్ని అవసరాలు వున్నాయి, అవి తీరాలనుకోవటం అవివేకం. కాదూమరి. అయితే యీవృద్ధవరుల అవుసరాలేమిటి? అన్నంవండటం, కాళ్ళుపట్టటం, వళ్ళుతోమటం, వక్కలుకొట్టి తాంబూలం యివ్వటం వగైరాలు. అంతేకాకుండా సమాజం నుంచి ఫలానా వృద్ధపతి యిల్లాలు సౌందర్యరాసి, పరమ పతివ్రత, పరమసాధ్వి, గుణవతి, వగైరాటైటిల్సు సంపాధించి వృద్ధపతిమెడ నలంకరించటం, అంతకంటే వేరొక అవుసరమేముంటుంది? దాంపత్యసుఖమా? అబ్బే. ఆఅవుసరంఏనాడో తీరిపోయిందిగా! ఒకవేల మళ్లీ కావాలనుకొనటం దుర్బుద్ధీ విషయవాంఛ కాదూ? ఒకవేలతిరిగికావాలనుకొంటేమాత్రం అదిఎలా సాధ్యమౌతుంది? డబ్బుతో కొనేందుకా వీలులేనిదాయె. అందుకనే నగలు, చీరెలుయిచ్చి సంతృప్తి చెందమన్నారు. పతివ్రతను, సాధ్విని అనుకొని గర్వించమన్నారు. స్వర్గాన్ని చూపించి ఆనందించమన్నారు. యింకా ఎన్నో కావలసినన్ని సమకూర్చారు. కానీ యీసజీవ చైతన్య

మానవప్రకృతిగల వస్తువు దాంపత్యసుఖాన్ని త్యాగంచేయ లేకపోయింది కాబట్టే అనుభవంగడించిన ఏవృద్ధఋషి పుంగవుడో, "స్త్రీ బుద్ధి ప్రళయాంతకః" అంటూ ఒక సర్టిఫికేట్ వ్రాసి ఆమెముఖాన పారేశాడు. సమాజంకూడా నిజంనిజం అంటూ బలకొట్టింది.

యీఘోరాన్ని కప్పిపుచ్చేందుకు సమర్థించేందుకు శాస్త్రాలు కూడా తయారయాయి. స్వర్గ, నరక పట్టణాలు వీటికి బలాన్ని చేకూర్చాయి "తొమ్మిదోసం॥ ప్రారంభంలో కన్యకు వివాహంచేసేకన్య గౌరిగావుంటుందనీ, పదోసం॥ ప్రారంభంలో వివాహంచేస్తే రోహిణిగా వుంటుందనీ, కాబట్టి, 10 సం॥ లోపుగానే స్త్రీకివివాహము చేయాలనీ, 10 సం॥ దాటినకన్య రజస్వలకుయోగ్యంగా వుంటుంది. కాబట్టి వివాహానికి అయోగ్యురాలౌతుంది.ఆవిధంగా వివాహం కాక మునుపే కన్యరజస్వల అయితే (ప్రమాదవశాత్తు కన్య 10 సం॥లకు రజస్వల కావచ్చు) ఆకన్యమొగము, తల్లి,తండ్రి, సోదరుడు యీముగ్గురు చూసినట్లైతే వారురవరవాది నరకంలో పడిపోతారు(1)యింతేకాకుండా వారికి సమాజందృష్టిలో పరువు మర్యాదలుపోయి ఆకుటుంబాన్ని హేయంగాచూస్తూ వెలివేయబడుతుంది. యీవిధంగా బాల్యవివాహాలకు బలంచేకూర్చబడింది. కన్యరజస్వల కావటం, కుటుంబం మొత్తంగా నరకానికి వెళ్లేందుకుకారణం అయింది. కానీమొత్తం కుటుంబాన్ని నరకంలో పడద్రోసేందుకుకారణభూతమయిన కన్యను

(1) అష్టవర్షాభవేద్గౌరి నవవర్షారోహిణీ, దశవర్షా భవేత్కన్యా తతఊర్ధ్వంరజస్వలా.

ఏవరకానికి రవాణా చేయాలనే ఆలోచనే వారికితట్టలేదు. దానితో వారికి అవుసరం కూడా లేకపోయింది. ఎందుకంటే స్త్రీని బాల్యంలోతండ్రి, యౌవనంలోభర్త, వృద్ధాప్యంలో కుమారుడు వీరి అదుపు ఆజ్ఞలలో వుండవలసిందేకానీ, స్వతంత్రించితిరగకూడదు అనేపవిత్రశాసనంఅదివరకే ఉత్పన్నమయిందిగా! అంటే స్త్రీకి యీజన్మలో పుట్టిందిమొదలు మరణపర్యంతం ఏపరిస్థితుల్లో కానీ, ఏసమయమందుకానీ, స్వతంత్రంకావాలను కోవటంకానీ, సుఖసౌఖ్యాలు కావాలను కోవటంకానీ, అందుకుప్రయత్నించే టందుకుగానీ అధికారం లేదన్నమాట అలాంటికోర్కెలు ఏమున్నావుంటే, యింకొక లోకంలో, యింకొకజన్మానికి అట్టేపెట్టుకొని వీలైతే అంటే అక్కడ పురుష వాసనలేని లోకమైతే, అక్కడ అనుభవించాలిసిందే. కానీభారతదేశశాస్త్రజ్ఞులు అంత తెలివితక్కువ వారు కారుగా? అక్కడమాత్రం స్త్రీస్వాతంత్ర్యాన్ని అంగీకరించేందుకు అందుకనే సప్తలోకాల్లోకి కూడా పురుషులకు భోగార్థమైన అనుమతి పత్రాలు యిక్కడేయిచ్చిస్త్రీలపైన పెత్తనంచెలాయించేందుకు పంపటంమొదలు పెట్టారు.

స్త్రీకి రజస్వలతో యౌవన ప్రారంభమవుతుంది. రజస్వలఅనంతరం రెండుమూడు సం॥ రాలకుగానీ పూర్ణయౌవనం ప్రాప్తించదు. పూర్ణయౌవనంలోనే స్త్రీవివాహయోగ్య అవుతుందని ప్రాచీన వైద్యపండితులైన ధన్వంతరి వగైరా యీసామాజిక శాస్త్రకారులైన మనువు వగైరాలు నిర్ణ

---

మాతాచైవ, పితాతస్యా భ్రాతాతథైవచ త్రియస్తే, నరకం, యాంతి దృష్ట్వా కన్యాంరజస్వలాం, పరాశర, శీఘ్రబోధ

యించారు. కానీ కాలాంతరంలో సమాజంలో భోగ లాలసత యెక్కువ కావడం, ఆర్థికవ్యవస్థ తారుమారు కావడంతో, ప్రకృతి సిద్ధమయిన రజస్వలకు పాపపుణ్యాలు అంటగట్టి, బాల్యవివాహాలను బాలవితంతువులను, సృష్టించిసమాజంలో మొత్తం స్త్రీజాతికే తీరని అవమానాన్ని కలుగజేశారు.



# వేశ్య

ప్రాచీనకాలంలో అతిథి సాంప్రదాయం అసభ్య ప్రవర్తనకు దారితీయటం వలన శ్వేతకేతుడు యీఅతిథి సాంప్రదాయాన్ని రద్దుచేసినట్టుల యిదివరకే మనం చూశాము. తర్వాతకాలంలో యోగులు, నగ్గరాల యిష్టాపూర్తి కొరకు గ్రామానికి ఒకరిద్దరిని యీవృత్తికిగాను ప్రత్యేకించటం జరిగింది. వీరిని ఉత్తరదేశంలో యోగిని, దక్షిణాన దేవదాసి అనిపిలువబడేవారు. వీరు సామూహిక గ్రామ వ్యవస్థలో కూడా వుండినట్లు ఆధారాలు నిరూపిస్తున్నాయి. ప్రాచీన గ్రామ పంచాయతీలలో సాధారణంగా 15 వృత్తులవారూ ప్రత్యేకపరిస్థితులలో 21 మంది వృత్తులవారు ఉండేవారు. వీరిలో యీ దేవదాసీని కూడా పేర్కొనబడింది. అప్పటి దేవదాసీలు, డబ్బుకొరకుగాక, సనాతన సాంప్రదాయకమైన పారమార్థిక బుద్ధితో అతిథులనుసంతృప్తిపరచేవారు. అందుకుఫలితంగా గ్రామసంపాదనలో వీరికి కూడా భాగం ముట్టేది. తర్వాతకాలంలో ప్రైవేటుఆస్థి వ్యక్తిగత కుటుంబాలు ఏర్పడినపుడు, దేవదాసీలకు కూడా భూమియివ్వటం జరిగింది. కానీ దేవదాసీలు భూములవల్ల జీవించలేకపోయారు. ఎందుకంటే, భూములు చేసిపెట్టేవారు వారికి లేకపోవటమే యిందుకు కారణం. పూజార్లు (పౌరోహితులు) వారికికూడా యిదే

గతి పట్టింది. కానీ వాసుకర్మ వగైరాలను సృష్టించి వాటిపరి హారార్థమనిముడుపులు కానుకలు వగైరాలద్వారా తమపొట్ట బూడ్చుకొన్నారు. దేవదాసీలకు యోగులు,సన్యాసులు,అయిన అతిథుల ద్వారా పొట్టగడువదు కాబట్టి, దేవస్థాన ఆవరణల లోనే ఉంటూ యితరులద్వారా, తమపోషణకు వస్తువులు వగైరాలను పొందాల్సివచ్చింది. వీరిలో కొందరు కేవలం వ్యభిచారం వల్లనేగాక కళాసముపార్జనద్వారా తమనుపో షించుకొనేవారు (కళఅంటే గానం నృత్యం వగైరాలు) కాబట్టి వీరిని కళావంతులుఅని కూడా పిలువడం జరిగింది. 2500 క్రితం బుద్ధునికంటే ముందునుంచి కూడా లుచ్ఛవి, మగథ,కోసల వగైరా గణతంత్రి రాజధానులలో కళను ఎక్కువగాపోషించబడింది, బౌద్ధయుగంలో, వేశ్యావృత్తి మరీ విస్తృత రూపందాల్చింది. యీవృత్తిని ఆనాటి పాలక వర్గా లుకూడా ప్రోత్సహించాయి, కౌటిల్యుడు వేశ్యవృత్తికిగాను ఒక్కరాత్రికి అయిదువందల ముద్రలవరకు సుంకము విధించి నాడు. యీవృత్తిని నిరంతరం అంటేసామూహిక వ్యవస్థ విచ్ఛిన్నం అవుతూ వచ్చినప్పటినుంచీ కొనసాగుతూనే వస్తూవుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చి వర్ణవ్యవస్థనే రద్దుచే యటంతో అంటే మాదిగలు చెప్పులుకుట్టటం కుమ్మరికుండ లుచేయ్యటం, సాలె నేతనెయ్యటం వగైరాలు, పెట్టుబడిదారీ వ్యవస్థలో యీకట్టుబాట్లులేకుండా ఎక్కువఆదాయం కొరకు, ఏవర్గస్థుడైనా ఏపనినైనా చేయటంచేసింది. (బ్రాహ్మణులు చెప్పులుకుట్టటం క్షత్రియులు నేత నెయ్యటం, వైశ్యులు కుండ లుచెయ్యటం) యీవిధంగా వర్ణాలకు అంటిపెట్టుకొని ఉండబ

డిన వృత్తులు ఛిన్నాభిన్నమై పోయాయి. యీవ్యవస్థకు అను గుణంగా వేశ్యలుకూడా బ్రాహ్మణస్త్రీనుంచి అంత్య స్త్రీవరకూ యీవృత్తిలో ప్రవేశించారు. ప్రధానంగా దుర్భర దారిద్య్ర, కుటుంబాలనుంచీ జీవించేందుకు ఎలాంటి మార్గం యితరత్రా లేని పరిస్థితులనుంచీ పురుషుడు విడిచిపెట్టబడిన స్త్రీలు ఆధారంలేని వితంతువులు, ఎటుచూచినా ఆత్మహత్యతప్ప, వేరొకమార్గం గోచరించని స్త్రీలు యీవృత్తిని తమ పోషణ కొరకు, వ్యాపారంగా స్వీకరించాల్సి వచ్చింది. వేశ్యావృత్తికి కారణాలను పారిస్‌లోని పేరంట్-డ్యూచాటిలా అనే ఆయన బ్రసెల్సులో లాన్సే అనే ఆయన పరిశీలించి ఎక్కువమంది కూలిపనివల్ల లాభములేకా దారిద్ర్యంవల్ల భర్తలవల్ల వదలి వేయబడిన వారూ ఎక్కువమంది ఉన్నారనీ వేయికి ఒకరిద్దరు మాత్రమే సెక్సుకు సంబంధించిన వాంఛలే కారణమని తెలియజేశారని, తేల్చారు.

అయితే యీవృత్తివల్ల యీఅభాగ్యజీవులు అనుభవించే దేమిటి? సమాజంలో వేశ్యను హేయవస్తువుగా భావించేవారు చాలామంది వున్నారు. కాని ఆమెను ఆహేయస్థితిలోకి నెట్టేందుకు, ఆమెను అట్టే ఉంచేందుకు స్వయంగా వారేబాధ్యులనే సత్యాన్ని వారు విస్మరిస్తున్నారు. పవిత్రమైన హృదయం కలిగుండి మానవన్నైతికోన్నతిని వాంఛించే ఆత్మాభిమానండుండికూడా జీవించేందుకు యితరత్రా సమస్త మార్గాలు మూయబడటంద్వారా విధిలేక జీవితాన్ని ఎలాగైనా యీడ్చాలనే జీవితాశ ఆమెను ఆదినుంచి అంత్యంవరకు సౌందర్యాన్ని రంగులతో నిర్మించుకొంటూ యీహే

యమైనపనిని సాగిస్తుంది. ఎందుకు? సౌఖ్యంకొరకా? కాదు ఆమెను వెన్నంటితరిమే నిర్భాగ్యమే ఆమెను యీపశు ప్రవృత్తికి ప్రోత్సహిస్తూవుంది. ఆమెలోవున్న ఆత్మగౌరవాన్ని, చంపుకొని సమస్త మానవవాంఛలకు తిలాంజలియిచ్చి తన రూపాన్ని విక్రయించుకోవాలిసి వస్తూంది. ఫలితంగా ఆమె అనుభవించేది జుగుప్స, నిరాశా ఏకాకిజీవనం ఏకాకిగాఅంతం.

జీవితంలో ఒకదశవరకు ఆమెను ప్రపంచం మోహిస్తూంది, లాలిస్తుంది. తియ్యని కబుర్లద్వారా హృదయాన్ని పులకింప జేస్తుంది. ముఖస్తోత్రాలతో ఉన్మత్తురాలినిగా చేస్తుంది. ఆమె సౌందర్యప్రకాశంకొరకు దీపశిఖచుట్టు పురుతలవలె ప్రదక్షిణాలు చేస్తుంది. కానీ ఆయవ్వనమాధుర్యం తొలగిపోగానే ఆమెవైపు సానుభూతి దృక్కులుకూడా ప్రసరింపదు. యీసమయంలో యీమె తిరస్కృత స్త్రీత్వం-ప్రకాశింపబడిన రూప యౌవన వైభవ భగ్నావశేషం ఆమె హృదయాన్ని ఏవిధంగానైనా సంతృప్తిపరచ గల్గుతుందా? ఏపరిస్థితులైతే ఆమెను గృహజీవితానికి అనర్హురాలినిగా చేశాయో, ఏవ్యక్తులైతే ఆమెభవిష్యత్‌ను నాశనంచేశారో, ఏపురుషులైతే ఆమె సౌందర్య రసాస్వాదన కొరకు ఆమెహృదయాన్ని పులకరింపజేశారో, ఏసమాజమైతే ఆమెను యీపశుప్రవృత్తికి వివశనుచేసిందో, ఉత్సాహపరిచిందో యీమె హృదయావేదనను తొలగించేందుకు జీవితభారాన్ని తగ్గించేందుకు ప్రయత్నిస్తుందా? కనీసం రెండు కన్నీటిచుక్కలైనా యీమెకొరకు విడుస్తుందా? యీసమాజానికి అటువంటిభావాలుఎన్నడూ కలుగలేదు. పైగా యీమెను గర్హిత సమా

జం పతిత అంటూ పిలుస్తుంది. కానీ యీామెకుకూడా మానవ సహజప్రేమ జీవితాపేక్ష ఉంటుందనే యథార్థవిషయాన్ని విస్మరిస్తుంది. యీామెకూడా ప్రేమించేందుకు ద్వేషించేందుకు హృదయంవుంది. సమాజశ్రేయస్సుకు వినియోగించాల్సిన బుద్ధికూడావుంది. తనవ్యక్తిత్వపుహోదాను జీవితవికాసాన్ని వాంఛించే ఆత్మకూడావుంది. యిటువంటి సజీవవ్యక్తి హేయపరివృత్తికి పాల్పడటం ఆదినుంచీ అంత్యంవరకు ప్రవహించే కన్నీటి ధారలతో శుష్కించి ఎండిపోయే పెదవులను అరువుతెచ్చుకొన్న చిరునవ్వులతో శృంగారించటం ప్రాణాలను కంఠంలో మాత్రమే నిల్పుకొని కడుపుకొరకు (దుడ్డుకు) తమను తాము అమ్ముకొనుచున్నారంటే ఆత్మహత్యకంటే మరేమీా కాదు.

యీాసమస్యపైన విచారించే సమస్త ఆధునిక సమాజశాస్త్రజ్ఞులు. వేశ్యావృత్తికికారణం ఆస్త్రీయొక్క దుర్బలత కారణంకాదు. సామాజిక పరిస్థితులు లోనుగావటంవల్లనే అంటూ నిర్ణయించారు. ఎక్కడైతే స్త్రీజాతిఆర్థికంగా పరాధీనత అవుతుందో అక్కడ వేశ్యావృత్తికూడా అధికంగా వుంటుంది. ఎక్కడైతే సంపూర్ణ సామాజంతోపాటు స్త్రీకూడా సంపూర్ణ ఆర్థిక స్వతంత్రం కలిగివుంటుందో అక్కడవేశ్యావృత్తికూడా వుండదు. అటువంటి సంపూర్ణస్వతంత్రం రష్యాదేశంలో మాత్రమేవుంది. కాబట్టి అక్కడ వేశ్యఅనే పేరు కూడా లేకుండాపోయింది. ఒకప్పుడు అక్కడ వేశ్యావృత్తి ద్వారా జీవించేవారు నేడు సంపూర్ణసామాజిక అధికారాలతోపాటు తమ సమాజంలో (దేశంలో) గౌరవనీయమైన

పనిని చేస్తూ ఆత్మగౌరవాన్ని సంపాదించుకోగల్గుతున్నారు. వేశ్యసమస్యను కేవలం దయ, న్యాయం, సానుభూతి దృష్టితో మాత్రమే విచారించటంవల్ల లాభంలేదు అలా విచారించటం అంటే ఆఖరుకు అశిక్షిత మూఢభావాలు గలవారితో పాటు తిరిగి యీవిషయాలను స్వీకరించాల్సి వస్తుంది. వీరు విశేషించి కాముకులుగా వుంటారు. కాబట్టి వారిని మరమ్మతుచేయడంసాధ్యంకాదు. అటువంటి స్త్రీలు ఎల్లప్పుడూ ఉండనేఉంటారు. వారిసంభోగేచ్ఛ ప్రబలంకావటంవల్ల ఒకేపతితో సంతృప్తి చెంది ఉండజాలరు. అనేనిస్పృహవాతావరణంలో పడిపోవాల్సివస్తుంది. కాబట్టి కపటోపాయాలతో నిర్మితమైన ప్రస్తుత సాంఘికవిధివిధానాలనుసమర్థించినవారమూ తాము-యీ సమస్యను సామాజిక చారిత్రిక దృక్పథంతో విచారించటం ద్వారానే సరైన పరిష్కారమార్గాన్ని కనుగొనగలం-మనుష్యజాతియొక్క సామాన్య గుణగణాలు అందరిలోను అధికం లేక కొద్దిగా వుంటాయి. కేవలం వికాసాన్ననుసరించి అనుకూల ప్రతికూల పరిస్థితుల ప్రభావం వాటిపైన ప్రసరించటం ద్వారా గుణాలలో పరివర్తన కలుగుతూవుంటుంది.-వేశ్యావృత్తి హేయమైనది. కానీ వేశ్యావృత్తిని చేసేవారు మాత్రంకాజాలరు. ఎందుకంటే పరిస్థితులకులోనై అంతకంటే గత్యంతరం లేనిదశలోవారు యీవృత్తికి పాల్పడాల్సివస్తోంది. కాబట్టి దోషంఅంతాపరిస్థితులను స్వయంగా సృష్టించేవారిది కాబట్టి యీపరిస్థితులకు లోనైనవారు మనకు దయాపాత్రులు మాత్రమే కాగలరు. వారినిగురించి మనం అభ్యుదయదృక్పథంతో విచారించటం అంటే వారిని (వేశ్యలను) తిరిగి మన

సమాజంలో గౌరవనీయ సభ్యులు కాగలేందుకు తగినపరిసితు లను సృష్టించాల్సిన అవుసరంఉంటుంది. వేశ్యావృత్తివల్ల జీవించేవారు సమాజంలో గౌరవమైన జీవితంగడపాలంటే కేవలం చట్టాలుచేసినంత మాత్రాన వారినిఉద్ధరించలేము. అందువల్లవారికష్టాలను యింకా యెక్కువచేయటమే అవుతుంది. వీరికి జీవితోపాధికొరకు సమాజంలో గౌరవప్రదమైన వృత్తులు కల్పించి వారిఆర్థిక యిబ్బందులను తొలగించాల్సి వుంటుంది. అయితే నిరుద్యోగ సమస్యను అధికంచేసే పెట్టుబడిదారీ ప్రభుత్వాలలో యిది సాధ్యంకాదు. జమీందార్లను పెద్ద పెద్ద పెట్టుబడిదార్లను నిర్దాక్షిణ్యంగాఎలాంటినష్టపరిహారంలేకుండా రద్దుచేసి ప్రతిఒకరికీ పనినీ, పనినిబట్టి ఫలితాన్ని కలుగజేసే సోషలిష్టుసమాజంలోనే యిది సాధ్యమవుతుంది. వేశ్యనుగురించి యుగపురుషుడు గురజాడ యీవిధంగా చెప్పాడు. సానిపిల్లలోవుండే మానవత్వాన్ని నువ్వుమరిచిపోవద్దు. ఆమెవిచారం, కన్నీళ్లూ,సంతోషం,ఆనందబాష్పాలూ నీ. నా. సుఖదుఃఖాలకు మల్లే అనీ గంభీరమైనవే ఉదాత్తమైనవే అని నీతిపరురాలైన వొకభార్యలేకవ్యభిచారి అయినభర్తా,కాదా వీరిద్దరితోనూ నిండిన సమాజము ఏరీత్యా సానిపిల్లకంటే మిన్న? వ్యభిచారమే తనవృత్తిగా "లేబిల్" వేయబడ్డ సానిపిల్లకంటే యెద్భుష్టావీరునయం?

వాస్తవంలో ప్రపంచంలోని ఏదేశంగానీ సంపూర్ణ వేశ్యత్వాన్నుంచి విడివడని దేశమున్నత సుసంస్కృత దేశం కాజాలదు. అంటే వేశ్యఅనేపదం కేవలం కడుపుకొరకు సౌందర్యాన్ని అమ్ముకొనేవారికే వర్తించదు. సమస్తపైసావాది

సమాజం సంపూర్ణ వేశ్యత్వంతో సమ్మిశ్రితమై వుంది. మిగతా వ్యవహారాలను అటుంచి కేవలం స్త్రీలవిషయంగా ఆలోచించినపుడు సమాజం శాస్త్రీయంగా రూపయౌవన విద్యాధనాదుల జూచి కన్యను కన్యతోపాటు కట్నకానుకలు సమర్పిస్తుంది. దీన్ని వేశ్యత్వం అనటం మూర్ఖత్వం అవివేకం అంటుంది సమాజం. వాస్తవమే. వర్తమానసమాజ ఆచారవ్యవహారాలను యథార్థంగా గ్రహించక దానిలోని న్యాయాన్యాయాలను ఉన్నదున్నట్లు నిశితంగా విమర్శించటం ఆసమాజానికి అవివేకమే అవుతుంది. కానీ వాస్తవంలో ఎవరైనా కన్యను యిచ్చేసందర్భంలో అన్నింటికంటే వరుని సంపత్తికి ఎక్కువప్రాధాన్యత యిస్తారు. ఆయురారోగ్య సౌందర్య నిర్ధనయువకునికి ధనవంతుని కన్యను యివ్వగా మనము యింతవరకు చూడలేదు. యిందుకు విరుద్ధంగా స్వస్థయువసుందరకన్యను వృద్ధధనపతులు వివాహమాడటం మనం చూస్తున్నాము. కట్నకానుకల గురించి సమాజం గొప్పగా చెప్పకొంటుంది. యీకట్నకానుకల దాహానికి ఎంతమంది అభాగ్యసోదరీమణులు వారితలిదండ్రులు ఆహుతి అయ్యారో అవుతున్నారో సమాజంగుర్తిస్తుందా? యిది పైసావాది సమాజమనిముందుగానే చెప్పాము. సమాజంయొక్క సమస్తవ్యవహారాలను ధనమేనిర్ణయిస్తుంది. నడిపిస్తుంది. ధనంజడవస్తువు కాబట్టి దానికి హృదయంశూన్యం. ఉండాలని ఆశించటం కూడా అవివేకమే కాగలదు. కట్నకానుకలకు సరైన అర్థం కన్యనువిక్రయించటం తప్ప వేరొకటికాదు. దీన్నే సమాజంవిపరీతార్థంలో వరకట్నం (వరునికొనటం) అంటుంది. కానీ యిక్కడ వరునికి కన్యకు

ఎలాంటి ప్రాధాన్యత లేకుండా పోతూవుంది. ఎందుకంటే అక్కడి సమస్త ఆచార వ్యవహారాలను ధనంపైననే ఆధారపడి జరుగుతాయి. వరపక్షంలో ఎంతఅధికధనం వుంటే కట్నకానుకల మోతాదుకూడా అంతఎక్కువగా వుంటుంది. కన్యపక్షంవారు వరపక్షధనంతో తమకన్యకు సంబంధం కలిగించేందుకు మాత్రమే కట్నకానుక పారితోషకాలను ఉపయోగిస్తారు. దీన్ని ఎన్నివిధాలా సమర్థించినప్పటికీ వరునిపక్షం ధనంతో కన్యయొక్క తన్కు మనః సంబంధాలుగాక వేరొకటికాదు. ఎందుకంటే కన్యపక్షంవారు ఎంతధనమిచ్చినప్పటికీ కట్నధనము వరపక్షధనంతో సమ్మిశ్రితమైపోతూవుంది. యికఅక్కడ మిగిలేది సంపత్తికి అధికారం వహించిన పురుషుడూ పురుషుని అత్యాచారాలను మాత్రమే న్యాయంగా కట్నకానుకలు స్త్రీపక్షంనుంచి వచ్చినపుడు వాటిపైన స్త్రీకే అధికారముండాలి కానీ అలా జరుగటంలేదు. ఎందుకంటే స్త్రీని సంపత్తికి దూరంగా ఉంచేందుకు తయారుచేయబడిన సామాజిక విధివిధానాలఫలితం.



# సుశిక్షిత మహిళ

యీపరిస్థితులలో సుశిక్షితమహిళల గురించి యింకొక విధంగా ఆలోచించాల్సి వుంటుంది. ఎందుకంటే వీరు పైగా సర్వస్వతంత్రులుగా వున్నట్లు అగుపిస్తుంటారు. అంతేకాకుండా సుశిక్షితమహిళలు ఆర్థికంగా స్వయంపోషకత్వానికి యోగ్యులుగావుంటారు కాబట్టి వారివిషయంలో ఒకరికిబానిసగా ఎందుకు తయారుకాగలుగుతారు. అనేసంశయంకూడా ఉంటుంది. కానీయీ రెండూ పొరపాటుఅభిప్రాయాలే-ఏసమాజంలో గౌరవమర్యాదలు భద్రిత సుఖసౌఖ్యాలు కేవలండబ్బుపైన మాత్రమేఆధారపడివుంటాయో ఆసమాజంలో శిక్షితమహిళలు మాత్రం ఆసంస్కారాన్నుంచి వేరుగావుండలేరు. వాస్తవంలో శిక్షితమహిళలే ఎక్కువధనార్జనవైపు మొగ్గుతారు. వర్తమానసమాజంలో యీసుశిక్షిత సుసంస్కృతమహిళలు వేశ్యకన్నా మెరుగనిచెప్పలేము. సాదృశ్యంకావాలంటే సొసయిటీలు క్లబ్బులు చూడవచ్చు. యిక వీరివివాహ విషయంలోకూడా సామాన్య స్త్రీలకన్నా అధికఅంతస్తుకు తగిన ఉద్యోగస్థుడో లేక అధిక ధనవంతుడో అవుసరమవుతూవుంది. ఆఖరుకు వీరుకూడా పురుషుని మనోరంజన ఆటవస్తువుగా ఉత్పత్తియంత్రంగా మాత్రమే తయారుకావాల్సివస్తూంది.

యీపైసావాది సమాజంలో ఘరానా పెద్దమనుష్యుల మనుకొనే పురుషశేఖరులు మాత్రం తమను కూటికోరకు

అమ్ముకోనటం లేదా? బూర్జువా పండితులు కళాకారులు, నటులు వగైరా బుద్ధిజీవులు తమ కడుపుకకు,— ర్తికొరకు సమాజంలో ఎంత కుల్లును పోషిస్తున్నారో మనకు తెలియనిది కాదు. డబ్బుకొరకు న్యాయాన్ని కాపాడే న్యాయాధిపతులూ లాయర్లు, మేజిస్ట్రేట్లు, జడ్జీలు వగైరా పెద్దమనుష్యులు అన్యాయాన్ని న్యాయంగాను న్యాయాన్ని అన్యాయంగాను మార్చివేసే విషయం ఎవరికి తెలియదు? యిక ఉద్యోగస్థుల విషయంలో క్రిందినుంచీ పైవరకు అంటే జమాన్లనుంచి మినిష్టర్ల వరకు, డబ్బుతోకాని పనంటూ లేదనే విషయాన్ని ఎవరు కాదనగలరు? కాబట్టి వ్యక్తులకు ప్రాధాన్యత లేకుండా డబ్బుకు మాత్రమే ప్రాధాన్యత ఉన్న ఏ సమాజంలో కూడా యిలాంటి అనైతికత అసభ్యత తప్పనిసరిగా ఉంటుందనేది యదార్థ విషయం.



 

# వర్ణాంతర వివాహాలు

వేరు వేరు తెగలు లేక కులాలలోని స్త్రీ పురుషులు పరస్పరం ప్రేమించుకొనినపుడు వారు వివాహమాడి దాంపత్యజీవనానికి కట్టుబడివుండటంలో ఎలాంటిదోషమూ లేదు. అయితే నేటిసమాజంలో యీవివాహాలకు సిద్ధమయ్యే స్త్రీ పురుషులు ఒకనూతన సమ్మిశ్రిత సంస్కృతిని నిర్మించాల్సివుంటుందనేది మరువకూడదు. వారిఎక్కువకులం అనేభావాలను స్త్రీ పురుషులిద్దరూ విస్మరించాల్సి వుంటుంది. అటువంటుభావాలకు ఏమాత్రం తావుయిచ్చినప్పటికీ వారిజీవితాలను నాశనం చేసుకోనటతప్ప వారికి వేరొకటి మిగులదు. యిద్దరూ కలిసి మనః పూర్వకరాజీవిధానంలో ఒకేమతాన్ని స్వీకరించటం శ్రేయస్కరం. లేకపోతే యిద్దరి మతాలూ శ్రేష్టమైనవే ననుకోనటంద్వారా పరస్పరం ఒకరిమతాన్ని లేక కులాన్ని ఒకరుగౌరవించటం జరగాలి.

అయితేయీవివాహాలను సమాజంఎంతవరకు సమ్మతిస్తుంది? సమ్మతించటం ఎన్నటికీజరుగదు పైగా సమాజం కుటుంబమూ వీరిని బహిస్కరిస్తాయి గర్జిస్తాయి. కులవంశగౌరవాలు యీయెధవల మూలంగా నాశనం అయిపోతున్నాయని విలపిస్తాయి. అంతే కాకుండాసమాజమూ కుటుంబమూ కక్షకట్టి నిరంతరం కల్పించే ఆటంకాలను ఎదుర్కోనాల్సి

వుంటుంది. అయితే వీటన్నింటిని ఎదుర్కొని వర్ణాంతరవివాహాలు చేసుకొనటం ప్రోత్సహించటం బలపరచటం చేయూతనివ్వటం వగైరా కార్యక్రమాల ద్వారా భవిష్యత్ సమాజానికి పునాదిరాళ్లువేయుటనే కాగలదు. నేటి పైసావాది సమాజంలో వాస్తవంగా కుల మత ప్రాబల్యాలు ఉన్నాయా? అంటే అవిఏనాడో అదృశ్యమయి పోయ్యాయని చెప్పాల్సిఉంటుంది. కులమనేది గౌరవమర్యాదలకు కారణమనుకుంటే నేడు ఎవరైనా నాకులం లేక మతంగొప్పది అనిడబ్బా వాయించుకుంటే మజ్జిగనీల్లు కూడా దొరకవు. కులమతప్రమేయం లేకుండా నేడు ఎవరైతే ధనవంతులుగా వుంటున్నారో గౌరవమర్యాదలు వాని ఆశ్రయించుకొని సువాసన వెదజల్లుతూ వుంటాయి. మరి ఎందుకు యీఆటంకాలు, అఘాయింపులు? అంటే కులమతాల ముసుగున తమ తెలివితేటలను (1) ధనప్రభావాని ఉపయోగించి సమాజంపైన పెత్తనంచేస్తూవచ్చినముఠా తమ చేతుల్లోని పెత్తనం ఎక్కడ జారిపోతుందోననే భయంతప్ప మరొకటేమి లేదు. మతంపేరుతో సమాజంపైన పెత్తనంచెలాయిస్తూ తమదోపిడీని సురక్షితంచేసుకొనాలనే కొద్దిమంది రక్తపిపాసుల తొలగించి తిరిగి సమతా సమాజాన్ని నిర్మించేటందుకు యీకులమతాలు అడ్డురాకుండా చేయాల్సిన అవుసరం ఎంతైనావుంది. అంటే మొత్తం కులమతాలనే రద్దు చేసిపారెయ్యాలని కాదు. ఎవరికులం లేక మతం వాటిపైన విశ్వాస ముంచుకొనేందుకూ వాటిని రక్షించుకొనేందుకు

---

(1) న విశేషోస్తివర్ణానామ్ సర్వంబ్రహ్మ మిదం జగత్ బ్రాహ్మణాః
పూర్వసృష్టాహికర్మ భిర్వర్ణతాంగతా. శాంతిపర్వం.

ప్రతిఒకరికి స్వతంత్రం ఉండాలసిందే కానీ ఒకరికులం లేక మతం గొప్పది కాబట్టి యితరకులాలవారు వారికి అణగి మణగి వుండాలనటం అస్పృశ్యతా నీచ భావాలను ప్రోత్స హించటం, రెకెత్తించటం వగైరాలు సమాజవికాసానికి మానవ శ్రేయస్సుకు ఆటంకాలు కాబట్టి ఘోరమైన అపరాధాలుగా వుంటాయి. అన్నికులమతాల వారికే ప్రభుత్వ ఆర్థిక సాంస్కృతిక రంగాలలో జాతి నిమిత్తం లేకుండా దేశంలోని ప్రతిపౌరుడూ పాల్గొనేందుకు అవకాశాలు కల్పించాల్సి వుంటుంది. అంటే ఆర్థిక అసమానతలను నిర్మూలించటం ద్వారా ఎవరెవరి శ్రమఫలితాన్ని సంపూర్ణంగా వారే అనుభవించేందుకు తగిన పరిస్థితులను కల్పించటం ద్వారా యీ విషయంలో సోవియట్ దేశ ప్రభుత్వ చట్టం యీవిధంగా తెలియజేస్తూవుంది. "పౌరుల జాతి తెగలనుబట్టి వారిహక్కులను ప్రత్యక్షంగా గానీ పరోక్షంగాగానీ నిర్బంధించటమూ లేదా వారికి ప్రత్యక్ష పరోక్షంగాగానీ సౌకర్యాలు కలిగించడమూ జాతి లేక తెగ ప్రత్యేకతనూ విద్వేషాన్నీ తృనీకారభావాన్నీ బలపర్చటమూ చట్టరీత్యా శిక్షార్హమైన నేరాలు" అంటూ సోవియట్ (రష్యా) రాజ్యాంగము తెలియజేస్తోంది. యిలాంటి చట్టాలను బూర్జువా రాజ్యాంగాలు కూడా చేస్తాయి. అయితే ఆర్థిక అసమానత్వాలను పోషించే రాజ్యాంగాల ద్వారా జాతి కులం లేక వ్యక్తులమధ్య అసమానత్వాన్ని రద్దుచేయటం అసంభవం. ఎందుకంటే? నేటిసమాజంలోజాతి తెగలతో నిమిత్తం లేకుండా ధనవంతుడు వ్యక్తిగతంగా

ఎక్కువ గౌరవమర్యాదలు పొందగల్గటం మనము నిత్యమూ చూసే బహిరంగసత్యమే. అదేవిధంగా ధనవంతుని పరిసరాలలో జీవించే అసంఖ్యాక నిర్భాగ్యులు అన్నివిధాలా ధనవంతునికి దోసోహం అనటం తప్పనిసరి అవుతూవుంది. నేడు జాతులు లేక తెగలమధ్య అసమానత్వాలకు ఆర్థిక సంబంధాలే కారణమనేది సుస్పష్టం కాబట్టి ప్రైవేటు ఆస్థిని రద్దుచేసే ఒకరి శ్రమద్వారా మరొకరి లాభాలు పెరగటం అనే విధానాన్ని రద్దుచేసే రాజ్యాంగంలోనే జాతుల అసమానత్వం కూడా రద్దుచేయటం సంభవమౌతుంది. అలాచేసినపుడు వైవాహిక సంబంధాలలో తగ్గుహెచ్చు నీచం ఉచ్చం అనేభావాలుపోయి కేవలం వ్యక్తులుమాత్రమే నిలుస్తారు. అంటే వ్యక్తి గౌరవ మర్యాదలు కులం దుడ్డు వగైరాలపైన గాకుండా ఆచరణ ద్వారా నిర్ణయించబడుతాయి. ఆవిధంగా ప్రతిఒకరు ఆచరణ ద్వారా వ్యక్తిత్వగౌరవమర్యాదలు సంపాదించుకోగల్గినపుడు జాతికులాలతో నిమిత్తం లేకుండా యువతీయువకులు పరస్పర ఆచరణపరిచయులై ప్రేమించుకోనటం వివాహం చేసుకోనటం సర్వసాధారణంగా వుంటుంది.

యీజాతులు కులాలు ఎలా ఎవరివల్ల ఉత్పన్నమయాయి? అందుకు కారణాలు ఏమిటి? అనేప్రశ్నలకు చాలామంది యివి దైవనిర్మితములు అనాది సిద్ధములు అవి యికముందు కూడా శాశ్వతాలుగా వుంటాయి అని జవాబుచెప్తుంటారు. కానీ కులమతాలు మానవుని కల్పితాలేనని అనాదిసిద్ధములు ఏమాత్రంకావని వేదాలూ ఉపనిషత్‌లు భారతం గీతా వగైరా భారతీయ స్మృతిశృతులు ఎలాంటి డొంక

తిరుగుల్లు లేకుండా వేయినోళ్లతో ఉద్ఘోసిస్తున్నాయి.

భారతం శాంతిపర్వం-భరద్వాజుడు భృగుమహర్షిని కులమతాలు ఏవిధంగా ఉత్పన్నమయాయి అని అడుగుతాడు. భృగుమహర్షి యీవిధంగా చెపుతాడు. ప్రథమంలో సమస్త ప్రజలు బ్రహ్మగానే వుండినారు. (అంటే ఏకధర్మం ఏక సంస్కృతి ఏకమతం ఏకకులంగా ప్రవర్తిల్లిన గణ సంఘాలను వేదాలు బ్రహ్మఅని పేర్కొన్నాయి) తర్వాత ఆబ్రహ్మనుంచి గుణకర్మ స్వభావాలును బట్టి వర్ణాలు ఉత్పన్నమయాయి. (1) గీతాకారుడు-నాలుగువర్ణాలను నేనే సృష్టించి వారివారి గుణకర్మ స్వభావాలను బట్టి ఆయామనుష్యులను గుణకర్మ స్వభావాలకు అనుగుణమైన వర్ణములుగా విభాగించాను అని చెప్పాడు. (2) మనుశాస్త్రం-ఎవరైతే శూద్రకులములో పుట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య సమానమైనగుణకర్మస్వభావాలు కలిగి ఉంటున్నారో ఆశూద్రులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యలగుచున్నారు. అదేవిధంగా బ్రాహ్మణ క్షత్రియవైశ్యకుల మందు జన్మించినప్పటికీ వారి గుణకర్మ స్వభావాలు శూద్ర సమానమైనచో వారు శూద్రులగుచున్నారు. (3) ఆపస్తంభ

---

(1) న విశేషోస్తి వర్ణానామ్ సర్వంబ్రహ్మ మిదం జగత్ బ్రాహ్మణాః పూర్వసృష్టాహి కర్మ భిర్వర్ణతాంగతా. శాంతిపర్వం.

(2) చాతుర్వర్ణ్య మయా సృష్టా గుణకర్మ విభాగశః గీత అ 4.13

(3) శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్ క్షత్రియాజ్జాతిమేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ. మను_10_65

"ధర్మచర్యయా జఘన్యోవర్ణః పూర్వంవర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ. ఆపస్తంభధర్మసూత్రాలు.1

ధర్మసూత్రాలు కూడా దీన్నే బలపరుస్తున్నాయి. ఒకప్పుడు సమాజ విధివిధానాలను శాసనాలను అమలుపరచిన వారంతా యీమతాలను మానవకల్పితాలే ననీ మానవుని ప్రయత్నం ద్వారా ఏవర్ణస్థుడైనా కావచ్చుననీ ప్రధానం గుణకర్మ స్వభావాలేగానీ కులాలు కాదంటూ తెలియజేస్తున్నారు. అంతే కాకుండా మానవుడు పుట్టుకనూ (అంటే యీప్రపంచంలో జన్మించేవారందరూ) శూద్రుడనీన్నీ కర్మను బట్టి ద్విజుడనీన్నీ విద్యాభ్యాసం వేద పాఠ అభ్యసనంవల్ల విప్రుడనీన్నీ బ్రహ్మజ్ఞానం (దైవచింతన పాపభీతి వగైరాలు) ద్వారా బ్రాహ్మణుడూ కాగల్గుచున్నాడనీ ఉపనిషత్ లు హెచ్చరికచేస్తూ వున్నాయి. (1)

యివన్నీమనకు తెలియజేసే దేమంటే సమాజంలో ఉత్తముడుగా పరిగణింపబడాలంటే మానవునికి సద్వర్తనే ప్రాముఖ్యమని తెలియజేస్తున్నాయి. ఉ॥ఒకవ్యక్తి పతనానికి సంఘం కారణమెలా కాగల్గుతుంది? అనేప్రశ్న వచ్చినపుడు సంఘం అంటే ప్రజాసమూహం. మనుష్యులు సంఘాన్ని సృష్టించుకొన్నారు. సంఘం మనుష్యుల్ని సృష్టించలేదు. సంఘంలోని ప్రతీమనిషీ మనోదుర్బలతవల్లచేసే ప్రతిఅవకతవక పనులకు ప్రతీ ఎదుటిమనిషీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో బాధపడుతాడు. ఒక్కొక్కసంధర్భంలో కొందరిజీవితాలే సర్వనాశనం కావచ్చు. అంటే సంఘ ఆశయాలైన ధర్మము, నీతి, న్యాయం వగైరాలను మానవుడే సృష్టిస్తున్నాడు. తిరిగి

(1) జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజ.
వేదపాఠంతు విప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణాః.

అదే మానవుడే వాటికి ఎదురు తిరిగి ప్రవర్తించటం ద్వారా సమాజంలో అధర్మం, అనైతికత, అన్యాయాలను సృష్టిస్తున్నాడు. అదేవిధంగానే సంఘంలో మానవుడు సృష్టించిన కుల మతాలు సంఘ శ్రేయస్సుకుగాక వినాశానికి దారి తీసినపుడు యీకులమతాలను మన్నించాల్సిన అవసరంకానీ ఖాతరు చేయాల్సిన బాధ్యతగానీ ఎంతమాత్రం లేదు.

250 ఏండ్లకిత్రం సంఘ సంస్కారాన్ని వాంఛించిన వేమన ధనప్రభావం సమాజంలో తెచ్చిన మార్పును తెలియజేశాడు. "ఆ॥ కులముగల్గువారు గోత్రంబుగలవారు విద్యచేత విర్రవీగువారు పసిడిగల్గువాని బానిసకొడుకులు" పసిడి కల్గువాని బానిసకొడుకులు అనేపదంతో సమాజంలోని సాధారణ ప్రజల నికృష్టజీవనాన్ని సమాజ విధివిధానాలను సృష్టించి నడిపించే బ్రాహ్మణ శాస్త్రకారులు సగైరా పెద్దమనుషులు ధనవంతుని చేతి కీలుబొమ్మలుగా ధనవంతుల అత్యాచారాలను, హింసాకాండను ప్రోత్సహించిబలపర చేవారుగా ధనవంతునికి బానిసలుగా మాత్రమే ఉంటున్నారు. అంటూ ధనికవాదాన్ని నిశితంగా విమర్శించాడు.



# విధవ

విధవ అనేపదం వేదాలలోగానీ ఉపనిషత్‌లు మహా భారతంమనుస్మృతివగైరాలలోగానీఎక్కడా అగుపించదు. అంటే ఆకాలంలో స్త్రీచనిపోయిన పురుషుని ఎంతో పురుషుడు చనిపోయిన స్త్రీనికూడా అదేవిధంగానే భావించటం జరిగింది. బానిస విధానం అంతరించే దశలో బానిసను డబ్బుయిచ్చి కొనాల్సిన అవసరం లేకుండా యీవిధంగా విధవా రూపంలో శాశ్వతమైన బానిసను సృష్టించారు. విధవకు సధవకు గల తేడా ఏమిటి? అంటే భర్తచనిపోయిన స్త్రీవిధవ అవుతూవుంది. భర్తచనిపోవటంలో ఆమెదోషమేమి? భర్తను చచ్చిపోమని చెప్పిందా? ప్రోత్సహించిందా? లేక స్వయంగా చంపిందా? లేదు పైగా భర్తచావకుండా ఉండాలని వేయిదేవుల్లను ప్రార్థిస్తుంది. భర్తను బ్రతికించుకొనేందుకు తాపత్రయ పడుతుంది. అందుకు సర్వవిధాలా ప్రయత్నిస్తుంది. అంటే ఏస్త్రీ కూడా—అఖరుకు కులటగానీ-భర్తజీవించాలని మనః పూర్వకంగా వాంఛిస్తుంది. మరి దోషిఎలా కాగల్గింది? మానవత్వం కలిగిన ఏవ్యక్తికూడా యీమెకు దోషాన్ని అంటగట్టలేదు. కానీ సభ్యతను సంస్కృతి పవిత్రతల ముసుగునున జరిగే అత్యాచారాలకు యీనిర్దోషులు ఎంతమంది. అనాథలై వేశ్యా వాటిక లలంకరిస్తున్నారు? ఎంతమంది గర్భస్రావ యమయాతనలకు గురవుచున్నారు? ఎంతమంది

శిశుహత్యా పాపాన్ని చేజేతుల సృష్టించుకొంటున్నారు? ఎంత మంది మాతృ హృదయాన్ని దగ్ధంచేసి సజీవ సంతానాన్ని వంకవాగుర్లల్లో చెట్లూ చేమల్లో మృగపక్షులకు ఆహారంగా విని యోగిస్తున్నారు? యీఘోరమైన అసహ్యమైన అత్యాచారాలు ఎందువల్ల ఎవరివల్ల జరుపబడుతున్నాయి? సంతృప్తి ఎరుగని పురుషుని కామవాంఛ కాదా వీటికిబాధ్యత? దీన్ని సమాజం ఎందుకు గుర్తించదు? గుర్తించి యీఅభాగ్యజీవుల కొరకు సమాజంయొక్క హృదయం చలిస్తుందా? సానుభూతిచూపుతుందా? కనీసం రెండుకన్నీటిచుక్కలు విడుస్తుందా? అది యీసమాజానికి దుర్లభమూ, దుర్ఘటమూ, అతీతమూ అయిన విషయం. అయితేయీనిర్భాగ్యజీవుల సుఖమయ పునర్వివాహానకు ఎందుకు అడ్డుతగులుతుంది? ఏమిటిదాని ఉద్దేశ్యం? అంటే యిందులో స్వార్థం తప్ప వేరొక పవిత్రాశయమేమీ లేదు. స్త్రీని తనస్వంత వస్తుసంపదలో జమకట్టుకొన్న పురుషుడు తనసంపత్తితోపాటు తనదనుకొనే స్త్రీని కూడా యిహమందేవదల వెళ్లాలిసి వస్తూవుంది. (1) అతనివారసుల ధనతృష్ణ అతనిసంపత్తితోపాటు అతని స్త్రీయొక్క శ్రమఫలితాన్ని కూడా బలిగొంటుంది. అర్ధాంగి గృహలక్ష్మి సహచరి గృహమంత్రి వగైరా కుటిల పదప్రయోగాలతో స్త్రీ స్వాతంత్ర్యను హరించిన యీసమాజం అదేగృహలక్ష్మి

(1) ఒకప్పుడు పురుషుని సంపత్తితోపాటు అతని స్త్రీలను కూడా భూస్థాపితంగానీ కాష్టమయంగానీ (సజీవభార్యలను) భారతదేశంలో చేసేఅలవాటు ఉండినది. దీనినే సతీప్రథఅని చరిత్రలో పిలువటం జరిగిందనియిదివరకే మనంచూశాము.

అర్ధాంగి-పతివిహీన అయినంత మాత్రాన సుఖసౌఖ్యాల కొరకు అటుంచి కనీసం రెండు మెతుకుల కొరకు కూడా యితర్ల దయాదాక్షిణ్యాలపైన ఆధారపడాల్సిన పరిస్థితులను కల్పించి జీవచ్ఛవాలనుగా చేస్తుంది. కాబట్టి ఏసమాజంలో నైనప్పటికీ ఎంతవరకు పురుషునికంటే స్త్రీ నీచంగా పరిగణింపబడుతుందో అంతవరకు అడపా దడపా బూర్జువా సిద్ధాంత్వాలు చేసేచట్టా లు సంస్కరణలు అమలులోకి రావటం కూడా జరుగదు ఎందుకంటే ఛాందస సంస్కారాలతో కూరుకుపోయిన సమా జంలో ఎవరైనా వితంతువివాహానికి గానీ సిద్ధమయ్యే పక్షంలో సమాజంవారిని వెయ్యికండ్లతో ఉరిమిచూస్తుంది. కన్యాసు ల్కాలు జోరుగా సాగినదశలో యీవిధవలస్థితి మరీఘోరంగా పరిణమించింది. ఎక్కడచూచినా బాల్యవివాహాలూ, బాల వితంతువులు లేచిపోవడాలూ,గర్భస్రావాలువగైరా అనైతిక వ్యవహారాలు భారతీయ సామాజిక పునాదుల్నే పెల్లగించి వేచింది. అయినప్పటికీభారతీయ సామాజికనిర్నేతలు, శాస్త్ర కారులు, ధార్మనికులూ ఏమాత్రమైనా చలించారా? అంటే ఏమాత్రం చెలించకపోవటమే గాక యీవిధానాన్ని కాపా డేందుకు నడుములు బిగించారు. అందుకు అనుగుణమైన సూ త్రాలూ, శాస్త్రాలూ, ధార్మికనీతులు, కథలూ వగైరా అల్లి సమాజంపైన వెదజల్లారు ఉ॥ఒకవృద్ధదంపతులుడూ యువభా ర్యా ఆశీర్వాదార్థము ఏబ్రాహ్మణుని వద్దకో లేక ఏమునిపుం గవునివద్దకో వెల్లితే వారు పురుషుని "దీర్ఘాయు రారోగ్య మస్తు" లేక "చిరంజీవిరస్తు" అనిదీవిస్తారు. స్త్రీని "సౌభాగ్య రస్తు" అంటూ దీవిస్తారు. అంటే పురుషుని చిరంజీవిని కమ్మం

టారు. స్త్రీని సౌభాగ్యవతిని కమ్మంటారు. స్త్రీకి సౌభాగ్యము ఎలాకలుగుతుంది? పురుషుడు జీవించియుండటం వల్ల పురుషుడు గతిస్తే నీసౌభాగ్యము నీజీవితము మంటలో కలిసిపోతుంది. కాబట్టి నీకు నీభర్త అనంతరం దుర్గతి తప్పనిసరిగావుంటుంది. అయితే భర్తమరణాన్ని యీమె కోరదు. కానీ భర్త చనిపోతాడు. యీమె నిర్భాగ్యురాలౌతుంది. యీవైపరీత్యానికి సావిత్రి, సుమతి, వగైరా పతీవ్రతలను చూపించి నీలో పతివ్రతా లక్షణాలు లేవు కాబట్టి నీభర్త నీనుంచి దూరమయ్యాడు కాబట్టి నీకర్మ నీవుఅనుభవించు పొమ్మంటారు. అంటే వృద్ధాప్యం లో ఉన్నభర్తను కూడా స్త్రీ తనపాతివ్రత్యం వల్ల బ్రతికించుకోని సౌభాగ్యవతిని కమ్మంటారు. కానీ యీఆశీర్వాద మిచ్చే మహానుభావులు ఆవృద్ధపతిని బ్రతికించేవిషయంలో ఏకొద్దిగానైనా బాధ్యతను స్వీకరిస్తారా అంటే? అదిమాకు సంబంధించిన విషయం కాదంటారు. ఒకవేల కాదనకపోయినప్పటికీ వీరు ఏమిచేయలేరు. గనుక యీవిధంగా భారతస్త్రీ నిర్భాగ్యాన్ని ధృవ రచటం జరిగింది. భారతీయ విధివిధానాలే యీవిధంగా తయారయాయి.



# బూర్జువా సమాజం - స్త్రీలు

సామాజిక శాసనాలు స్త్రీల అధికారాలను రక్షించేందుకు బదులు వీరి జీవితావశ్యక జన్మసిద్ధ అధికారాలను సంకుచిత పరుస్తాయి. స్త్రీనిసంపత్తి నుంచి అధికారాన్నుంచి వంచించి కీటానువులకంటే తుచ్ఛమైన జీవితాన్ని నిర్ణయిస్తాయి. ధనవంతుని భార్యలుగా వున్నప్పటికీ పైతృకసంపత్తి కల్గివున్నప్పటికీ విధవలు దరిద్రపు జీవితం గడపాల్సి వుంటుంది. స్త్రీ పురుషుని వైభవ ప్రదర్శిని మాత్రమే సంతానం లేకపోతే పిల్లల ఆటవస్తువువలె ఆమె నిర్దిష్టస్థానం నుంచి విసరి పారవేయబడుతుంది. ఆదేవిధంగా విధవకు సమాజంలో, గృహంలో కూడా ఆమెకు నిశ్చితస్థానం లేదు. ఒకప్పుడు ఆమెయిష్టానిష్టాలతో ప్రమేయం లేకుండా కాల్చివేయబడేది. కానీ యిప్పుడు మృత పతిస్మారక చిహ్నంగా జీవించాల్సి వస్తావుంది. ఆమెను గౌరవించటం అటుంచి మలినం చేసేందుకు కూడా వెనుకాడరు. ఫలితంగా నేటివిధవస్థితిని పైవిధంగా మనకండ్లతో చూడాల్సి వస్తావుంది.

స్త్రీపితృగృహంలో ప్రేమమయ శైశవావస్థను గడపినప్పటికీ దుకాణంలో వున్న అమ్మేదు వస్తువుకు సమానం ఆమెకు జన్మస్థలం జీవించేందుకు తప్ప ఎలాంటి అధికారమూ ఇవ్వదు. పతిగృహంలో అధికారం పితృగృహం కంటే కొంచెం ఎక్కువవున్నప్పటికీ సానుభూతిలో మాత్రం చాలా

తప్పక అనటంలో సందేహం లేదు. యిక్కడ యీమెస్థితి నిరంతరం ఆపత్తితో కూడుకొని ఉంటుంది. ఆమె విద్యావంతుడైన పతికి అనుకూల విద్యావతి కానపుడూ సౌందర్యోపాసకుడైన పతికి కాల్పనిక అప్సరస కానపుడు ఆమెతన స్థానాన్నుంచి తొలగి పోవాల్సి వస్తుంది. ఒకవేల పతి యిష్టానుసారం పుత్రుల దండును యివ్వలేక పోతే (అందుకు ఆమెదోషి అయినప్పటికీ కానప్పటికీ) పతి అప్రసన్నతకు గురికావటమే గాక ఆమెస్థానంలోకి మరొకరు రావటం జరుగుతుంది అయినప్పటికీ యింటిలో దాసత్వాన్ని మాత్రం స్వీకరించాల్సి వస్తుంది.

భారతదేశ సుశిక్షిత సుసంస్కృత సభ్యతా సమాజం స్త్రీని యింటా బయటా సంఘంలో యిహ పరములలో తన ఆత్మ గౌరవాన్ని కాపాడు కొనేందుకు స్వాతంత్ర్యేచ్ఛను ప్రకటించేందుకు వ్యక్తిత్వాన్ని పొందేటందుకు ప్రయత్నం చేయకుండా స్వతహాగా వీటిని త్యాగం చేసేందుకు పతివ్రత, సాధ్వి, సతి వగైరా ముఖస్తుతి పదాలను సృష్టించి పతి నిత్య పరస్త్రీలోలుడు గానీ నిత్యమూ హింసించినప్పటికీ రోగిష్టికానీ మరేమైనాగానీ పతిద్వారా ఆమెపొందే సౌఖ్యము ఎలాంటిది కూడా లేకపోయినప్పటికీ భార్య అనేవస్తువు ఒకటుందనే చైతన్యమే పురుషునికి లేకపోయినప్పటికీ ఆమెమాత్రం జీవిత పర్యంతం పతి నామస్మరణ తప్ప వేరొకటి చేయకూడదు. అది సాధ్యాసాధ్యాలతో సంఘానికి నిమిత్తం లేదు. యీఅగ్నిపరీక్ష నుంచి ఆమె ఏమాత్రం చలించినిప్పటికీపతిత, హేయపవ్రర్తిని, ప్రళయాంతకి, భ్రష్ట,మాయావినియింకెన్నో.

సమాజం వ్యక్తుల లేక పరివారాల సమూహం. సమాజంలో కలిగే మార్పులు వ్యక్తులు పరివారాలపైన వాటిప్రభావాన్ని కలిగించకుండా వుండవు. సమాజానికి కేంద్రం పరివారాలలోని స్త్రీ పురుష సంబంధాలు ఆర్థిక వ్యవస్థను అనుసరించి పరివారం యొక్క ఆచార వ్యవహారాలు నిర్మింపబడుతాయి. కొన్ని దేశాలలో పరివారాలు (కుటుంబాలు) చాలా పెద్దవిగా వుంటాయి. ఒక్కొక్క దేశంలో చిన్నవిగా వుంటాయి. ప్రపంచంలోని అన్ని దేశాలలో ఒకప్పుడు పరివారాలు తల్లి పేరిట వుండేవని చరిత్ర మనకు తెలియజేస్తూ వుంది. భారతదేశంలో నేను కూడా దక్షిణదేశంలోను, ఉత్తర పర్వతాలపైన తల్లిపేరుతోనే చలామణీ అయ్యే పరివారాలు ఉన్నాయి.

మానవజాతి యీనాటి సమాజానికి చేరుకొనేందుకు కొన్నిదశలను నిర్మించుకొంటూ వచ్చింది. అంటే పాతవ్యవస్థలోనుంచి నూతనవ్యవస్థ ఆవిర్భవిస్తూ వచ్చింది. యీపరివర్తన దశలలో స్త్రీ పురుష సంబంధాలు కూడా ఎలా మార్పు చెందుతూ వచ్చాయో మనం చూశాము. ఆదిమ కమ్యూనిస్టుగణసమాజంలో సమాజంపైనా, పురుషునిపైనా పెత్తనంవహించినసర్వాధికారాలుకలిగిఉండినస్త్రీ నేడుసమాజంలోవ్యక్తిత్వమేకోల్పోయిభూమిందుకుసంపత్తిని కూర్చిపెట్టే యంత్రసామగ్రి లిష్టులో చేర్చబడింది. జీవితావసర వస్తూత్పత్తి సాధనాలు వస్తువులను తయారు చేయటంలో పొందే విలువనే స్త్రీ కూడా సంతానోత్పత్తి క్రమంలో పొందుతూ వుంది. అంటే చైతన్యం అనేవస్తువు కల్గిఉన్నప్పటికీ యితరుల ఆజ్ఞలేనిదే కది

లేందుకు కూడా స్వశక్తి లేని నికృష్ట చైతన్యాన్ని యంత్ర చైతన్యాల కంటే భిన్నమయినదని ఎలా చెప్పగలం?

ప్రతిదశలోనూ సమస్త సామాజిక నియమాలు ఆకాలన్ననుసరించి మానవుని నైతిక, ఉన్నతి, జీవిత వికాసం కొరకు ఉద్దేశింపబడి నిర్ణయింప బడుతూ ఉంటవి.(వీటిని సంస్కారం అంటాము) ఎప్పుడైతే యీనియమాలు మానవుని వికాసానికి, నైతికోన్నతికి అడ్డుతగులుతాయో అప్పుడు వాటి ఉపయోగమే రద్దవుతూ వుంది. యిందుకు అనుగుణంగానే చరిత్రలో అనేక దశలలో అనేకవిధానాలకు బదులు అనేక నూతన విధానాలు ఆవిర్భవిస్తూ వచ్చాయనే విషయాన్ని మనం చూశాము. ఉ॥ వివాహసాప్రదాయం అతి పవిత్రమైనది. కానీ అది వ్యక్తులయొక్క నైతిక పతనానికి కారణమయినప్పుడు దాన్ని కాలానుగుణంగా భవిష్యత్ సమాజ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని సంస్కరించాల్సిన అవుసరంఎంతైనా ఉంది. (1)

---

(1) మనం ఋగ్వేద కాలంనాటి పవిత్రవివాహాలను చూశాము. కానీ విశేషమేమంటే నేడుకూడా వివాహ ముహూర్త కాలమందు పౌరోహితుడు అదే పవిత్రాశయాలను సూచించే శ్లోకాలను అనర్గళంగా బాజా బజంత్రీలకు వప్పచెప్పటం జరుగుతూవుంది. అంటే పురోహితుడు శ్లోకాలు వల్లించేటపుడు అదేపనిగా బాజా బజంత్రీలను వాయించమని హుకుం జారీచేయబడుతుంది_శ్రోతలకు బాజా బజంత్రీల గణగణశబ్దం తప్ప పౌరోహితుడు చెప్పేదేమిటో కూడా అర్థంకాదు. వధూవరులతో చెప్పించాల్సిన ప్రతిజ్ఞలు వగైరా పవిత్రాశయాలను సూచించే శ్లోకాలను వధూవరులకు బదులు పౌరోహితుడే వల్లించేస్తాడు. అంటే ఆనాటి పవిత్రవివాహలక్ష్యం నేడు తంతురూపంలో జరుపబడుతూవుంది.

"వివాహసంస్థ మానవజాతి పురోగతికి దోహదం చేసినదనేమాట నిజమే నేను కాదనడంలేదు. అయితే వివాహసంబంధాన్ని తెగ్గించుకోరాదనే నియమమే యీ చెప్పనలవికానికన్నీటి గాథలకు హేతువు. యీసత్యాన్ని మనమెవరమూ విస్మరించలేము". గురజాడ"

సమాజంలో నిర్మించబడిన యీనియమాలను పురస్కరించుకొని మాసంస్కారం గొప్పది అనటం జరుగుతుంది. సంస్కారం అంటే ఏమిటి? ఎవరు ఏవాతావరణంలో పుట్టి పెరుగుతారో ఆఆచారవ్యవహారాలను, ఆసాంఘిక నియమాలనూ అవే శాశ్వతాలు, పవిత్రములనినమ్ముతారు. ఉ॥ ఉత్తరభారత దేశంలో మంసూరీకి కొద్దిమైల్ల దూరంలో జౌనసార బాబర యిలాకాలోని ప్రజలు బహుపతిత్వ సాంప్రదాయాన్ని అనుసరిస్తున్నారు. ఒకవేళ మనము మనసంస్కార వశులమై వారిబహుపతిత్వ విధానాన్ని వారిఎదుట నిందిస్తే వారు మన ఏకపతీత్వ సాంప్రదాయాన్ని నిందిస్తారు. వారు సగారవంగా మేము పాండవుల వంశస్థులమని చెప్పుతారు. తమ బహుపతిత్వ సాంప్రదాయాన్ని పాండవులరాజమహిషిఅయిన ద్రౌపదిని ఆదర్శంగా చూపిస్తారు. టిబెట్, నేపాల్ దేశాలకు దిగువన డార్జిలింగుకు వుత్తరాన వుండే చిన్న దేశం సిక్కిమ్ ప్రదేశంలో వుండేవారిని లేప్చాలు అంటారు. యీలేప్చాలలో నేరాలు చేసినవారికి మనప్రాంతం ఎరుకల వారిలో వున్న అగ్నిపరీక్షలు, కాలే చముురు పరీక్షలు వుపయోగిస్తారు. వీరిలో స్త్రీలను భంగపరచినందుకు జుల్మానాలు కష్టపడిన వ్యక్తి గౌరవాన్ని బట్టి వుంటాయి. కానీ ప్రయాణం

చేసేటపుడు మార్గమధ్యంలో ఆపని జరిగితే తప్పుక్రిందికి రాదు. అంటే మనం యిదివరకు చూసిన అతిథిధర్మాన్ని పోలి వుంటుంది. వీరిలో ఒకరినొకరు దూషించటం, తిట్టడం వగైరాలు వుండవు. వీరిలో వివాహాలు జరిగినా, జరగకపోయినా ఒకటే. వీరిలో ఇల్లరికం సర్వసామాన్యంగా వుంటుంది. వివాహానికి మూడు సంవత్సరాలు ముందు మామగారికి అడ్డమైన చాకిరీ చేయాల్సి వుంటుంది. వీరిలో తమ్ముళ్లకు ఎందరు అన్నలుంటే వారందరి భార్యలతోను వాళ్ల చెల్లెండ్లతోను సంఘనియమాల ప్రకారం సంభోగించే అధికారం కలదు. అదేవిధంగా ఎందరు చిన్నాయనలుంటే వారిభార్యలు భార్యల చెల్లెండ్లతోను అప్పుడప్పుడు సంబంధాలు పెట్టుకోవచ్చు. వారిని నిర్బంధించినప్పటికీ నేరం కాదు. వితంతువులతో మరదులు విధిగా సంసారం చేయాల్సి వుంటుంది. వీరిలో కూడా బహుభర్తృకత్వం వుంది. వీరేకాకుండా జౌనసార్ బాబర్ ప్రాంతాల రాజపుత్రకోట్లాప్రజలు మొదలుకొని హిమాలయాపర్వతాల దిగువన నివసించే కిన్నరులు, ఘోటియాలు, సంతాలులు సుమారు 20 లక్షలమంది ఆటవికులలో యిదేఆచార వ్యవహారాలను యించుమించు చూస్తాము. వీరిలో చాటుమరుగ్గా పుట్టిన బిడ్డలు గానీ అలాపుట్టటం వలన వారిని వెలివేయటం కానీ జరుగదు. అంటే మహాభారత కాలంనాటి ద్రౌపతులు, పంచపాండవులు నేడు కూడా మనకు కొల్లలుగా అగుపిస్తారు. దీన్నిబట్టి తేలేదేమంటే ప్రాచీన ధార్మిక సాంప్రదాయంనుంచి నూతన సభ్యతా ప్రపంచంతో సంబంధాలు లేక పోవటంవల్ల వారు ఆప్రాచీన సంబంధాలనే ధార్మికమైనవి గానూ, మన సభ్య సమాజ

ధర్మాలు అధర్మాలుగాను భావించటం జరుగుతూ వుంది. అదేవిధంగా కేరళలో ప్రాచీన సామూహిక ఉద్దేశ్యమైన సామూహిక ఉత్పత్తి సామూహిక వినిమయం చాలాకాలం క్రిందటే రద్దయి పోయింది. కానీ స్త్రీ పురుష సంబంధాలలో కొన్ని అవశేషాలను వారు నేడు కూడా అనుసరిస్తున్నారు. (2) హైద్రాబాద్ చెంచుల్లో కూడా స్త్రీ తన యిష్టం వచ్చిన పురుషుని వరించవచ్చు. ఇందులో తల్లిదండ్రుల

---

(2) కేరళలో బ్రాహ్మణ కుమారుడు సమస్తజాతి కన్యలతో సంబంధం పెట్టుకోవచ్చు. క్షత్రియులు మూడు వర్ణాల కన్యలతో, వైశ్యులు రెండువర్ణాల కన్యలతో శూద్రులు తమలో తామే అయితే యీసంబంధాలకొరకు పురుషుడే స్త్రీ వద్దకు పోవాల్సి వుంటుంది. స్త్రీ యిష్టమైనపుడు ప్రథమ సంబంధాన్ని రద్దుచేసి రెండవసంబంధాన్ని నిర్ణయించుకోవచ్చు అదేవిధంగా పురుషుడు కూడా యీసంబంధాల ద్వారా కలిగేసంతానం స్త్రీకే చెందుతుంది. యీసంతానపరంపర మాతృ క్రమ ధరిస్తుంది. త్రావన్కూరు, కొచ్చిన్ రాజకన్యలు కూడా వివాహము లేకుండానే సంబంధాలు కల్పించుకొంటారు. వీరికొరకు రాజమహల్ లలో నంబూదరి బ్రాహ్మణ యువకుల సౌందర్యము గలవారిని పోషిస్తారు. యీఅవివాహిత సంబంధాల ద్వారా కలిగే సంతానం రాజసింహాసనానికి ఉత్తరాధికారి కాగల్గుతాడు. (రాజు) అంటే పురుషుని ద్వారా కలిగే సంతానానికి బదులు అతనిబావ సింహాసనాన్ని అలంకరిస్తాడు.

"యిలాంటి కొద్ది గొప్ప తేడాలతో ప్రపంచంలో అనేక దేశాలలో అనేక స్థలాలలో యీఅవశేషాలు నిలచివున్నాయి. యీఆధారాల పైననే సామాజిక శాస్త్రకారులు ప్రపంచంలో సమస్త సమాజాలు ఆదిమకాలంలో మాతృ సత్తాకమేనని నిర్ణయించారు. కాలక్రమంలో సమాజం మాతృ సత్తాకంనుంచి పితృసత్తాకం, సామంత పూంజీ సత్తాకయుగాలుగా పరివర్తన చెందింది. పితృసత్తాకయుగం స్థిరపడటంతో స్త్రీని బానిసత్వంలోకి నెట్టడం జరిగింది.

యిష్టానిష్టాలు నిర్బంధం ఎంతమాత్రం కూడా కన్పించదు. వీరిలో వివాహం చేసుకొనబోయే వారు వివాహానికి పూర్వమే సంపర్కాన్ని తప్పుగా భావించరు. కాబట్టి ఎవరిసంస్కారం (వారిఆచార వ్యవహారాలు) వారికి గొప్పవి. ఎవరి సంస్కారం తక్కువ అని నిర్ణయించేముందు యీపవిత్రములనుకొనే ఆచార వ్యవహారాలు గతిశీలం అని తెలుసుకోవాల్సి వుంటుంది. అంటే ఒకనాటి (దశ) పవిత్ర ఆచార వ్యవహారాలు సామాజిక క్రమంలో మరొకదశలో నీచంగా ఆచరణ అయోగ్యాలుగా మార్పుచెందుతూ వస్తున్నాయి. అనేవిషయాలను చరిత్ర మనకు యిస్తున్న అమూల్య ఆధారాల ద్వారా తెలుసుకొన్నపుడు నేటి సంస్కారాలే శాశ్వతాలు అవే పవిత్రమైనవనే భావాలనుపోగొట్టగలం. కాబట్టి ప్రాచీనచరిత్రను తెలుసుకొనటం ఆదరించటం చెడ్డకాదు. అయితే ప్రకృతీ మానవసమాజం సమస్తం గతిశీలం అని తెలుసు కొన్నపుడు మానవుడు వికాసోన్ముఖ మైపుకు పురోగమిస్తూ వస్తున్నాడని తెలుసుకొన్నపుడు ప్రాచీన వ్యవస్థ యొక్క పునాదులపైన నూతన ప్రాకారాలను నిర్మించటం శ్రేయస్కరం కానీ ప్రాచీన వ్యవస్థే మంచిదని గుడ్డిగా సర్వకాలాలయందు శ్రేయస్కరమనుకొని జీవిత వికాసాన్ని నిరోధించి జీవిత ఆశా విశ్వాసాలను ప్రతిఘటించటం అంటే జీవించిఉన్న వ్యక్తిపైన సజీవ సమాధి నిర్మించటం కాక మరేమౌతుంది? జీవిత సఫలత నూతన సమస్యలను పరిష్కరించు కొనటం (అంటే నూతన సమస్యలను జీవితాను కూలముగా మార్చుకొనుట)ద్వారా కల్గుతుంటే గానీ గుడ్డిగా

ప్రాచీనతను అనుసరించటం ద్వారా వినాశం తప్ప వేరొకటి లభించదు. కాబట్టి నేటి స్త్రీ సమస్యను నూతనదృక్పథంతో పరిశీలించి పునర్నిర్మాణం చేయాల్సిన అవుసరం తప్పని సరి అవుతూవుంది.

దేశంలో ప్రాచీన సాంప్రదాయిక అవశేషాలు అక్కడక్కడ యింకా నిలచి వున్నాయనే సంగతి చూశాము. అంటే సభ్యతా సమాజాన్ని నేటివరకు వారు అందుకోలేక పోతున్నారు. నేటివరకు పాలక వర్గాలు కూడా వారి విషయంలో అంతగా పట్టించుకొనక పోవటమే అందుకు కారణం. కానీ వాటిని యీభద్రసమాజం పశుప్రవృత్తి ఆటవికం అంటుంది. వాస్తవమే నేటి సభ్యతా సమాజంలో అలాంటి ఆచారవ్యవహారాలు పశుప్రాయమే ననే సత్యాన్ని ఎవరూ కాదనలేరు. కానీ తమను పశుత్వంనుంచి సుసంస్కృతిలో ప్రవేశించామనే మనసభ్య సమాజీకుల సభ్యత అనే పరదాచాటున యీపశుప్రవృత్తిని నిర్మూలించేందుకు బదులు మరీ ఉగ్రరూపం దాలుస్తూ వుంది. స్వాభావిక వాతావరణంలో అనాచారం కూడా స్వాభావికంగానే ఉంటుంది. దాన్నే వారు పవిత్రంగా భావిస్తారు. కానీ కృత్రిమంగా కల్పించబడిన ఆడంబర సభ్యతా పర్దా ముసుగులో అనే అనాచారం నీచంగా, ఘోరంగా పరిణమిస్తుంది. కాబట్టి ఆచరణలో నేటి ధర్మం, నీతి, న్యాయం మానవజాతి పురోభివృద్ధికీ సుఖసౌఖ్యాలకు ఆటంకంగా పరిణమించాయనే విషయాన్ని కాదనలేము. భారత ప్రజల పురోభివృద్ధి నైతికోన్నతినీ పొందాలంటే శిథిలమైపోతున్న పాతవ్యవస్థకు బదులు

నూతన ధర్మం, న్యాయం, నీతి, (వ్యవస్థ) వగైరాలను నిర్మిం చాల్సి ఉంటుంది; మనం నిర్మించాల్సిన నూతన ధర్మం, న్యా యం, నీతి వగైరాలను ముందు ముందు చూస్తాము.



 

# స్త్రీస్వాతంత్ర్యం

స్త్రీస్వాతంత్ర్యం అంటూనే చాలామంది స్త్రీలకు స్వాతంత్ర్యం యిస్తే వారు వివాహాలే చేసుకోరు, స్వేచ్ఛా విహారిణులౌతారు. దానివల్ల ధర్మంలో కూడా అరాజకం వ్యాపిస్తుంది అంటూ ఆలోచిస్తారు. స్వాభావికంగా వివాహము చేసుకొనేందుకు స్త్రీ ఒకవ్యక్తి, సహచరి మాత్రమే గానీ దాసీ కాదనే సత్యాన్ని వీరు విస్మరిస్తారు. ఆర్థిక పరిస్థితులకు తలవొంచి పురుషునికి దాసీగా, బందీగా ఉండటం అంటే వివాహము యొక్క పవిత్రాశయమనే రద్దవుతుంది. స్త్రీజీవనములో అనేక విషమపరిస్థితులకు మూలకారణం ఆర్థిక సంబంధాలలో ఉంటుంది. ఎందుకంటే అవి సామాజిక జీవితానికి అత్యంతా వశ్యకము కాబట్టి.

కాబట్టి వివాహముయొక్క పవిత్రాశయాలు నెరవేరాలంటే స్త్రీకి ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో పురుషునితో సమానమైన హక్కులు కల్పించాల్సి వుంటుంది. పురుషుని దుష్ప్రవర్తననునిలదీసి అడిగే హక్కు ఉండాలి. వ్యభిచారం అనేది స్త్రీ పురుషులకు యిద్దరికీ అపవిత్రమైనదేగానీ ఒకరికి మాత్రమే అపవిత్రం కాజాలదు. అయినపుడు వ్యభిచరించేందుకు స్త్రీకి లేని హక్కు పురుషుని కెక్కడినుంచి వచ్చింది? స్త్రీని నైతికంగా పతనం కాకూడదని శాసించే సంఘం పురుషుని ఎందుకు శాసించదు?

సంతృప్తి, ఎరుగని కోర్కెలు పురుషునితోపాటు స్త్రీకికూడా వుంటాయని యందుకు గ్రహించదు? స్త్రీకూడా మనిషే అనుకున్నపుడు యిటువంటి అవాంఛితమైన శాసనాలు ఆచరణలో తప్పని సరిగా విఫల మౌతాయనేది నగ్నసత్యం కాబట్టి వివాహము యొక్క ఆశయాలకు స్త్రీ పురుషు లిద్దరూ కట్టుబడి ఉన్నపుడే వివాహము పవిత్రమైనది కాగల్గుతుంది. అయితే పురుషుడు వివాహ నియమాలను ఉల్లంఘించి నప్పటికీ సమాజంపురుషుని ఎందుకు శాసించదు? అంటే పురుషుడే సమాజం, సమాజమే పురుషుడు కాబట్టి. అంతే కాకుండా పురుషుని సమాజంలో స్త్రీకి ఉన్నపాత్రను తెలుసుకోనటం ద్వారా అందుకు కారణాలను సులభంగా గ్రహించగలం.

నేటిభారతస్త్రీ అధికారహీన, వ్యక్తిత్వహీన అనే సత్యాన్ని ఋజువుచేయాల్సిన అవసరం లేదు. కండ్లుఉన్న ఏవ్యక్తికైనా ప్రత్యక్షంగా అగుపించే నగ్నసత్యంయిది. సర్వత్రా మనకు స్త్రీయొక్క దాసత్వనే గోచరిస్తుంది. భారత నారి కంటే దయనీయమైన ప్రాణి ప్రపంచంలో మరొకటి లేదంటే అతి శయోక్తి కాదు. ఆమెకు పుత్రికగాను, పత్నిగాను, తోబుట్టువుగాను, మాతగాను ఏదశయందు కూడా ఏపరిస్థితులలోను (అధికారం) స్వతంత్రం లేదు. విధవకు మన సమాజంలో వున్నస్థితిఅతిహేయమైనది. సంస్కరణ వాదులు విధవను బలిపశువుగా చిత్రించారు. కానీ భావాలోచనలుగల యీబలి పశువుకు యీసంజ్ఞచాలా తేలికగా అగుపిస్తుంది.

పురుషుడు తనమనోరంజన కొరకు రంగు రంగులపక్షిని

పోషిస్తున్నాడు. ఉపయోగార్థం ఆవు, గుర్రము వగైరా పశు వులను పోషిస్తున్నాడు. అదేవిధంగా స్త్రీని కూడా పోషిస్తు న్నాడు. పశుపక్షుల విధంగానే స్త్రీయొక్క శరీర, మనస్సుల యందు సర్వాధికారాలను చెలాయిస్తున్నాడు. యీపరిస్థితు ల్లో స్త్రీని యీసమాజం కోరేదేమిటి? పతిపైన సతికి భక్తి, నిష్ఠ, శ్రద్ధలు కలిగుండాలని దీన్ని ఎవరూ కాదనలేరు. అయి తే మనము కోరేది ఆశ్రద్ధానిష్టలు ఉభయులకు ఉండాలని అపుడే అది సక్రమమనిపించు కొంటుంది. కేవలం ఒక్క సతిని మాత్రమే పతివ్రతవు కమ్మని శాసించటం అక్రమం, అన్యాయం. ఏసతి అయినప్పటికీ పతివ్యభిచారాన్ని మనఃపూ ర్వకంగా సమ్మతిస్తుందా? పతివ్యభిచరించి బహిరంగమైనప్ప టికీ సతికి పతిచరణములు తప్ప మానసికంగా బాధలనుభవిం చటం తప్ప వేరొక మార్గముందా? వ్యభిచారానికి అధిక వివాహాలు చేసుకొనేందుకు పతికి ఉన్న స్వాతంత్రం సతికి వుందా? ఎప్పుడు యీమాటలకు అవకాశం లేదో పాతివ్రత్య సతీత్వ విధివిధానాలలోనే స్త్రీ పురుషుని దాసీగా, బందీగా, మనోరంజన ఆటవస్తువుగా ఉపయోగించు కొనేందుకు అణ చి వుంచేందుకు వుపయోగపడే కుటిల నీతి తప్ప అందులో వేరొక మహాత్మ్యమేమీ లేదనేది స్పష్టం-స్త్రీ స్వాతంత్ర్యం అంటే వ్యభిచారానికి అవినీతికి సర్టిఫికెట్ యివ్వటము కాదు. కుటుంబ జీవనంలో స్త్రీ పురుషులు పరస్పరం సహయోగులై ఒకరు హెచ్చు ఒకరు తగ్గు అనే వైమనస్యాలు లేకుండా యిద్దరు సరిసమాన హోదాలో వ్యవహరించటం, యిద్దరి జీవి తాలను వారిసంతానాన్ని సుఖవత్తరంగా కాపాడుకొనేం

దుకు కృషి చేయటం అని భావించాల్సి వుంటుంది.

మానవుడు తన నూతన జీవితంకొరకు ఎన్నో సంస్కరణలు చేసుకొంటూ వస్తున్నాడు. అదేవిధంగా స్త్రీ పురుష సంబంధాలలో కూడా నేటి వరకు ఎన్నో పరివర్తనలు సంస్కరణలు చేసుకొంటూవచ్చాడు. కానీ యీపరివర్తనలు, సంస్కారాలూ స్త్రీయొక్క నికృష్ట బానిస విధానాన్ని అట్టెపెట్టేందుకు వుపయోగపడుతూ వచ్చాయి. నేడు కావలసింది అలాంటి సంస్కరణలు కాదు. ఆమూల పరివర్తన అంటే స్త్రీయొక్క ఆర్థిక, నైతిక విలువలు యితరుల చేతుల్లో గాకుండా, స్త్రీని కూడా మానవజన్మననీ తన నైతికోన్నతిని ఆత్మ గౌరవాన్ని స్వయంగా కాపాడుకొనేందుకు కావలసిన వాతావరణాన్ని (పరిస్థితులను) కల్పించాల్సి వుంటుంది. అయితే యీవిధమైన ఆచరణ అయోగ్యమైన (సాధ్యకాని) విధానాలను సృష్టించి పురుషుడు స్త్రీజాతిపైన ఎంతవరకు విజయం సాధించాడు? స్త్రీజాతి స్వాతంత్ర్యేచ్ఛను అరికట్ట గలిగాడా? అంటే సంపూర్ణంగా విఫలుడయ్యాడనే చెప్పొచ్చు. మూడు వేల ఏండ్లచరిత్రలో పురుషుని సర్వాధిపత్యాన్ని స్వీకరించి పతివ్రతలు కాగల్గిన స్త్రీలు ఎక్కడ గాలించినా దొరకటం దుర్లభం. అయితే పురుషుడు నిత్యమూ అపహసించేందుకు సృష్టించిన సిగ్గు,లజ్జ, భయము (1) యీసంస్కారానికిలోనై

(1) భారతీయశాస్త్రాలు స్త్రీకి ఆభూషణాలు సిగ్గు, లజ్జ, భయము. అంటూ నిర్ణయించారు. యివిలేనపుడు స్త్రీ సౌందర్యవతి గానీ విలువైన వస్త్రాభూషణాలు ధరించి నప్పటికీ (ఆభరణాలు) అవికట్టెకు చేసిన శృంగారంతో సమానమే నంటూ స్త్రీజాతిని నిరంతరం హెచ్చరిస్తూ రావటం జరిగింది.

పోవటంవల్ల కొంతవరకు అణగి మణగి వున్నట్లు అగుపించి నప్పటికీ ఏదో ఒకరూపంలో కుటుంబజీవనంలో అస్వాతం త్ర్యత విజృంభిస్తూనే ఉంటుంది. ఆఖరుకు యీ అస్వాతంత్ర్యతను ఉపయోగించుకొని స్త్రీజాతిలోనే అనైక్యతను సృష్టించటం జరిగింది. యీ అనైక్యతను సమాజంలో వివిధరకాలుగా చూస్తాము.

యీవిధంగా కల్పించబడిన అనైక్యతవల్ల మధ్యతరగతి ధనికవర్గ కుటుంబాలలోని స్త్రీలస్థితిగతులు మరీ అధ్వాన్నంగా తయారవుతాయి. యీకుటుంబాలలోకి నూతనంగా వచ్చే స్త్రీలు కుటుంబాలోని ప్రతిఒకరు చేసేదాడికి గురికావాల్సి ఉంటుంది. పురుషులకంటే అత్త ఆడబిడ్డలు పెట్టే యమయాతనలు మరీ ఘోరంగా వుంటాయి. వీరిలో ఎవరి ఆజ్ఞను కాదన్నప్పటికీ మూక వుమ్మడిగా యీనూతన స్త్రీపైన ద్వాడ మెత్తటం జరుగుతుంది. కానీ అత్త కూడా ఒకపుడు కోడలుగా యిదే బాధలు తనఅత్త ద్వారా అనుభవించాననే భావాన్ని విస్మరించి అదిఒక సాంప్రదాయకంగా భావించి తనఅత్త ద్వారా ఏకష్టాలైతే తాను అనుభవించిందో అదేకష్టాలను తిరిగి తనద్వారా తనకోడండ్లు తప్పనిసరిగా అనుభవించాలను కొంటుంది. ఆవిధంగా జరుగుతేగానీ ఆమెకుఆత్మ సంతృప్తి కాజాలదు. ఆడబిడ్డలు తాము వెల్లినచోట యిదేనిరంకుశత్వానికి గురి కావాల్సి వున్నప్పటికీ, పుట్టింటిలో పరాయి స్త్రీపైన తమ పెత్తనంమాత్రంతప్పనిసరిగా చెలామణీ కావాలంటారు. అదివీరి జన్మహక్కుగా భావిస్తారు. ఫలితంగా తగవులు, తంపులు, గృహచ్ఛిద్రాలకు దారితీసేపరిస్థితులు ఏర్పడుతాయి.

సామాన్యంగా పురుషుడు యీవిషయాలలో జోక్యంచేసుకోవటం అంటూవుండదు. ఒకవేళ పురుషుడు భార్యపక్షం వహిస్తే, (యిదిఎక్కడోగానీ జరుగదు.) కుటుంబం అతన్ని ఆడదానికి లొంగిపోయాడంటుంది. సంసారానికి అయోగ్యుడుగా పుట్టాడంటుంది. ఆడదాన్ని అదుపులో పెట్టుకోలేని మొగాడు సంసారం ఏమిఏడుస్తాడంటుంది. కానీ యీకల్లోలాలలో న్యాయా న్యాయాలను విచారించేందుకు అవకాశమీయదు. ఏకారణాలవల్ల కుటుంబం విచ్ఛిన్నమవుతూవుందో, ఆకారణాలను సర్దుబాటు చేసుకోనేబదులు వాటిని మరీ విస్తృతంచేస్తారు. ఫలితంగా కుటుంబవిచ్ఛిత్తి తప్పనిసరి అవుతుంది. యీకుటుంబాల్లో సర్వసాధారణంగా కోడల్లను దాసీలతో సమానంగా భావించటం జరుగుతుంది. కొన్ని ప్రదేశాల్లో కూలీల్లో జమకట్టి పొలంపనికి, వగైరా బైట పనులకు కూడా పంపటం జరుగుతూవుంటుంది. ఆవిధంగా కోడల్లకు ఎక్కువపనిని పురమాయించటం ద్వారా, అత్త ఆడబిడ్డలను ప్రత్యేకించుకొనటం ద్వారా వారిహోదాను నిరూపించుకొంటారు. అయితే యీపరిస్థితులు బీద కార్మిక కుటుంబాల్లో అంతగా అగుపించవు. ఎందుకంటే యీకుటుంబాల్లో ప్రతిఒకరు (అత్త, ఆడబిడ్డ, కోడలు అనేవిచక్షణ లేకుండా) కష్టంచేస్తేగాని కుటుంబ జీవనము దొర్లదు. ఆర్థికంగా కుటుంబ సంపాదనలో అందరూ సమానహోదాలో ఉంటారు. వీరికుటుంబాలు విచ్ఛిన్నంగావటం ద్వారా ఆర్థికంగా అందరూ యిబ్బంది పడాల్సి వుంటుంది. యీకుటుంబ సభ్యులంతా ఒకేతిండీ, ఒకేగుడ్డ, వగైరా సమానపరిస్థితులు

కల్గిఉంటారు. కాబట్టి వీరిలో ఒకరిపైన మరొకరు పెత్తనం చెలాయించే అవకాశంగానీ, అభిలాషగానీ ఉండదు. అలా పెత్తనం చెలాయించటం ద్వారా మరొకరు సుఖపడేదేమీ ఉండదు. కానీ పట్టణకార్మిక కుటుంబాల్లోకంటే గ్రామాల్లోని కూలీకుటుంబాల్లో అక్కడివాతావరణాన్ని బట్టి అక్కడక్కడ పురుషుని దౌర్జన్యాలను చూస్తాం. యీవ్యత్యాసాలకు మూలకారణం ఆర్థిక సంబంధాలపైన ఆధారపడి వుండ నేది స్పష్టంగా అగుపిస్తూవుంది. బీదకుటుంబాల్లో కుటుంబ సభ్యులంతా సంపాదనలోనూ, వినిమయంలోనూ సమాన హోదాలో ఉంటారు. కాబట్టి కుటుంబంలో గౌరవమర్యాదలు కూడా యించుమించు సమానహోదాలోనే ఉంటాయి. ధనికకుటుంబాలో పని విభజన జరగటమే కాకుండా చిల్లర మల్లర ఆర్థిక అవుసరాలపైన అంటే గాజులు, కూరగాయలు, మసాలా దినుసులకు కావలసిన చిల్లర డబ్బుపైన అత్తకు గానీ, లేక అకపెద్దకోడలుగానీ అధికారం సంక్రమిస్తుంది. యీసంక్రమణ హక్కులలో అత్తతన ప్రాణంవున్నంతవరకు ఆహక్కులు తనవేనంటుంది. అందులో కొంతభాగం నాకూ కావాలంటుంది. కోడలు ఫలితంగా అత్త కోడళ్లమధ్య నిరంతరపోరాటం ప్రారంభమవుతుంది.

స్త్రీజాతియొక్క యీఅజ్ఞానానికి అధోగతికి అవినీతికి ప్రధానమైన కారణం యింకొకటుంది. స్త్రీకి విద్యావిజ్ఞానాలు పొందటం కానీ, యింటిపనులలో తప్ప బైటపనులలో పాల్గొనటం కానీ కూడదనే పురుషుని నిరంకుశ శాసనం వాస్తవంలో నేటిభారత సమాజం స్త్రీవిద్యను అంగీకరిస్తూవుందా? అంటే

సామాజాన్నుంచి ఉత్తరువు యింకా లభించలేదనే చెప్పాలి. మరి స్త్రీలు కాలేజీలలో కూడా చదువుతున్నారే? అనే ప్రశ్నరావచ్చు, నేటి యీస్త్రీ విద్యను ఒక ఫేషన్ అనిమాత్రమే చెప్పాల్సి వుంటుంది. ఎందుకంటే సమాజంలో యీవిద్యవల్ల వారికి లభ్యమయ్యే సుఖసౌఖ్యాలు పూజ్యం అయినపుడు ఫేషన్ అని చెప్పక యింకేమని చెప్పగలం? విద్యాధికులైన స్త్రీలను సమాజం యింతవరకు వెలివేస్తూ వచ్చిందనేది బహిరంగసత్యమే అయితే నేడుస్త్రీవిద్యను అదుపాజ్ఞల్లో పెట్టే పరిస్థితులు సమాజం చేతుల్లోనుంచి జారిపోతున్నాయనే చెప్పవచ్చు. యిదిమనం సంతోషించాల్సిన విషయమే. అయితే స్త్రీవిద్య యింటిలో చాకలిపద్దుల వ్రాయటానికి మాత్రమే కాకుండా ఆవిద్యవల్ల ఆమె సమాజంలో గౌరవమర్యాదలను, స్వాతంత్ర్యాన్ని పొందగలిగినపుడే ఆమెవిద్య ఆమెకు ఫలితాన్ని యిచ్చినదౌతుంది. కానీ నేటి కుసంస్కారలనుంచీ కూడా బయటపడనిదే స్త్రీజాతి విద్యవల్ల సంపూర్ణ లాభాన్ని పొందలేదు. కాబట్టి నేటి పవిత్రములనుకొనే కుసంస్కారాలను తొలగించి వాటిస్థానంలో నూతన సంస్కారాలను నేటి సభ్యతకు అనుగుణంగా నిర్మించుకోవాల్సి ఉంటుంది.



# వ్యాహ్ను(?) - స్త్రీలు

ప్రధానంగా ఆర్థిక స్వాతంత్ర్యంతోపాటు స్త్రీకంటే పురుషుడు అధికుడనే అభిప్రాయాలమీద ఆధారపడి నటువంటి భూస్వామ్య విధాహపద్ధతిని, విధివిధానాలను తొలగించాల్సి వుంటుంది. స్త్రీపురుషులు అన్యోన్య వరణంమీద, ఏకపత్ని, ఏకపతీత్వంమీద స్త్రీపురుష సమాన ప్రజాసామ్యాలను నిర్మించాలి. బహుభార్యాత్వం, వ్యభిచారమూ, బాల్యవివాహాలు, వితంతు వివాహాలను ఆటంకపరచటం, వివాహసంబంధ శుల్కాలుగానీ, కట్నాలుగానీ రద్దుచేయాలి. భార్యభర్తలిద్దరూ తమ తమ వృత్తుల్ని స్వేచ్ఛగా ఎన్నుకోటానికి పని పాటల్లోను, సాంఘికోద్యమాల్లోను స్వేచ్ఛగా పాల్గొనేందుకు హక్కులు నిర్మించాలి. యీప్రధాన సూత్రాలపైన ఆధారపడి విడాకులు, బిడ్డల పోషణ వగైరాలను నిర్ణయించుకొనే హక్కులు స్త్రీ పురుషులు పరస్పర యిష్టాలపైన ఆధారపడి జరగాలి. యీనూతన పరివర్తనలో విడాకులు అత్యవసరమైనప్పటికీ, స్త్రీ పురుషుల సమానహోదాలో పరస్పర పరివర్తన పరిచయులై నిశ్చయించుకొన్న సంబంధాలలో విడాకులు ఉపయోగించాల్సిన అవసరం సన్నగిలుతుందే గానీ ఎక్కువ అయ్యే అవకాశాలు ఉండవు.

అయితే యీపరివర్తన జరగాలంటే పెట్టుబడి దారీ ముఠా, అజమాయిషీ క్రింద నడిచే ప్రభుత్వాలు ఉన్నంత

వరకు సాధ్యంకాదు. కానీ, స్త్రీల చైతన్యాన్ని అనుసరించి (ఆందోలన) విడాకులు, ఆస్థిపైన హక్కులు వగైరా సంస్కరణలు చేస్తాయి. కానీ యివికాగితాలపైన ఉండటం తప్ప ఆచరణలోకి రావటం అంటూ వుండదు. యీసంస్కరణల గురించి లెనిన్ యీవిధంగా చెప్పాడు.

"సాధారనంగా పాతపరిపాలక వర్గంయొక్క ప్రధాన పునాదులను కదిలించని మార్పులకొరకు, యీపునాదుల అస్థిత్వానికి భంగం కాని మార్పులకొరకు జరిగే ఆందోళనకే ప్రజలు కట్టుబడి యుండాలనేది, సంస్కరణవాదం." కాబట్టి బూర్జువాప్రభుత్వం ద్వారా తయారు చేయబడే చట్టాలు, (సంస్కరణలు) విడాకులు ఆస్థిపైన హక్కువగైరాలు అనేక డొంకతిరుగుళ్లతో సంకుచితంగా ఆచరణ సాధ్యముకాని పద్ధతిలో తయారు చేయబడుతవి. స్త్రీల యొక్క జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభం కావాలంటే, బూర్జువా ప్రభుత్వానికి బదులు, పీడితప్రజా ప్రభుత్వం నెలకొన్నపుడే సాధ్యమవుతుంది. ఎందుకంటే బూర్జువా ప్రభుత్వం ప్రైవేటు ఆస్థిని, వ్యక్తిగత అధికారాలను స్త్రీపైన పురుషుని పెత్తనాన్ని కాపాడటమే దానిఆశయం కాబట్టి పైకి ఎన్ని:(శ్రీ)రంగనీతులు చెప్పినప్పటికీ, ఆచరణలో మాత్రం స్త్రీస్వాతంత్ర్యాన్ని అరికట్టేందుకే ప్రయత్నం చేస్తుంది.

చాలామంది పూంజీవాదులు, మార్క్సిజం స్త్రీకి స్వతంత్రంయిచ్చి, నిరాశ్రయను చేస్తుంది. స్త్రీపైన ఒక పురుషుని బాధ్యతను తొలగించి సమాజ పరంచేస్తుంది. దీనివల్ల సమాజంలో అనాచారం, వ్యభిచారం, విస్తరిస్తుంది. మనుష్యులు

పశువులవలె ప్రవర్తిస్తారు అంటూ ప్రచారంచేస్తారు. మార్క్సువాదం స్త్రీ పురుష సంబంధాలను పురుష సంపత్తి నుంచి, ధార్మిక భీతినుంచి కట్టుబడి ఉండటం సమ్మతించదు. కాని అది స్త్రీ పురుష సంబంధాలను, స్త్రీ పురుష ప్రకృతిక, సంబంధ ఆవశ్యకతలను గుర్తిస్తుంది. యిందుకొరకు యిద్దరిలో ఒకరిని రెండవవారికి దాసత్వం స్వీకరించాల్సిన ఆవశ్యకతను మాత్రం సమ్మతించదు. స్త్రీ పురుష సంబంధాలలో విశృంఖలతను ఖండిస్తుంది. ఏ స్త్రీ, లేక పురుషుడు యితరుల శరీర సౌఖ్యంకొరకు తనశరీరాన్ని అద్దెకు యివ్వటాన్ని ఘోర అపరాధంగా పరిగణిస్తుంది. సోషలిష్టు సమాజంలో జీవనానికి ఎవరెవరి యోగ్యత అవసలనుబట్టి వారికి జీవితో పార్జనకొరకు మార్గం చూపబడుతుంది. కాబట్టి జీవనానికిగాను వ్యభిచారంద్వారా సంపాదించుకొనవలసిన అవసరం ఉండదు. ఎవరైనా పూంజీవాద సంస్కార వశులై ఆవిధంగా చేస్తే, వారు అపరాధులుగా పరిగణింప బడుతారు. వివాహ సంబంధాలలో మార్క్సువాదం సమాజ శారీరక, మానసిక ఆరోగ్యాలను అనుసరించి పూర్ణస్వతంత్రాన్ని యిస్తుంది. కాని విశృంకలతను, వ్యభిచారాన్ని వృత్తిగా సాగించటం తనకోర్కెలకు లోనై రెండవవ్యక్తియొక్క సామాజిక భద్రతకు (జీవితానికి) భంగం కలిగించే పక్షంలో భయంకర అపరాధంగా పరిగణింప బడుతుంది. స్త్రీ పురుష సంబంధ ఆవశ్యకతను గురించి లెనిన్ యీవిధంగా చెప్పాడు.

"స్త్రీ పురుష సంబంధాలు శారీరక ఆవశ్యకతలు ఆకలి, దప్పి, నిద్రలవలె ఆవశ్యకమైనది. యిందులో

మనుష్యులకు స్వతంత్రం ఉండవలసిందే, కానీ దప్పికి అయినంతమాత్రాన మురికినీరు ప్రవహించే సైడుకాలువలో ముఖమువంచి నీరు త్రాగటం ఉచితంకాదు. శుభ్రమైన గ్లాసుతో స్వచ్ఛమైన నీరు త్రాగటం ఉచితం: స్త్రీ పురుష సంబంధాలు మనుష్యుల శారీరక మానసిక పరిపూర్తి సమాజ రక్షణకు అనుగుణంగా వుండాలి స్త్రీ పురుషులు రోగగ్రస్థులు కావటం కలహాలకు కారణంగా ఉండటం కూడదు."

సోషలిష్టు సమాజవాద సమాజంలో మొత్తం స్త్రీజాతికి విముక్తి కల్గించే వాతావరణం కల్పించబడుతుంది. యీసమాజంలో స్త్రీకూడా ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొంటుంది. ఆమె కేవలం పురుషుని భోగవిలాసవస్తువుగా మాత్రమే భావించబడదు. అయితే మార్క్సువాదం విలాసానికి బదులుగా ఆనందం వినోదాన్ని సమ్మతిస్తుంది. కానీ అందులో పురుషుడు ప్రధానంగాను, స్త్రీని కేవలం విలాస వస్తువుగానూ మాత్రమే తయారు చేసేందుకు సమ్మతించదు. పూంజీవాద వ్యవస్థలో గర్భవతి అయినపుడు స్త్రీ పురుషుని ముందర ఆత్మ సమర్పణ చేయాల్సిన అవుసరం తప్పనిసరిగా కల్గించే పరిస్థితులు ఏర్పడుతాయి. ఎందుకంటే? యీసమయంలో స్త్రీ సంపాదనకు అయోగ్యురాలుగా వుంటుంది. యిలాంటి పరిస్థితుల నుంచి స్త్రీని సమాజవాదం రక్షిస్తుంది. సమాజవాదంలో స్త్రీ గర్భవతిగా వున్నపుడూ, ప్రసవకాలంలోనూ, అటుతర్వాత ఆమెతిరిగి పనిచేసేందుకు యోగ్యురాలయేంతవరకు స్త్రీయొక్క ఆవశ్యకతలను, ఆరోగ్య విషయాలపైన బాధ్యతలను సమాజం, ప్రభుత్వం వహిస్తుంది.

ప్రసవకాలం కంటే ఒకటిన్నర నెల ముందునుంచి ప్రసవానంతరం ఒకమాసం వరకు ఆమెసమాజం యొక్క ఖర్చుపైన పోషించబడుతుంది. ప్రసవానంతరం సమాజం ఆమెకుయిచ్చే పనిలో ఆమెబిడ్డకు సదుపాయాలు చూసేందుకు, పాలిచ్చేందుకు ఆమెకు విశ్రాంతి యివ్వబడుతుంది. బిడ్డను పెంచటం విద్యావిషయమైన బాధ్యత స్త్రీకి భారంలేకుండా సమాజమే బాధ్యత వహిస్తుంది. యీవిధంగా సంతానాన్ని కనటం, భయానికీ, ఆపత్తికి కారణంగాగాకుండాఉత్సాహానికి,ప్రసన్నతకు వీలుగా ఉంటుంది. సోవియట్ రష్యాలో, సంతానాన్ని ప్రభుత్వం గుంజుకొని కుటుంబప్రేమ అనేదే లేకుండా చేయబడుతుంది. అంటూ, పెట్టుబడి దారుల ఏజంట్లు,దుష్ప్రచారం చేస్తారు. కానీ, సోవియట్ ప్రభుత్వం, కుటుంబంయొక్క ప్రేమాను రాగభావాలను, మాతా, పితృత్వ ఆనందానుభూతినీ, పొందనిదే సమాజం పెరిగి పెంపొంద లేదనే ప్రాతిపదికపైన కుటుంబ వ్యవస్థను చట్టరీత్యా బలపరచటమేగాక, తల్లిదండ్రులకు వారి పిల్లల్ని బాగా వయస్సువచ్చే వరకు పెంచి, పోషించడం తలిదండ్రుల ప్రధాన బాధ్యతగా, ఉండేటట్లు చేస్తుంది. భార్యాభర్తలు, విడాకులిచ్చుకొనే సంధర్భంలో పిల్లల పెంపకానికి మంచి అవకాశాలు కల్గిఉన్న భార్యవద్దనో, లేక భర్తవద్దనో పిల్లల్ని అప్పచెపుతూ ఒకబిడ్డ అయితే, వారి ఆదాయంలో నాలుగో వంతున్ను, యిద్దరైతే మూడో వంతు, ముగ్గురుగానీ, అంతకు ఎక్కువగానీ పిల్లలుంటే సగానికి పైగాను డబ్బు వారి పోషణకై మనోవర్తి క్రింద పిల్లల్ని పోషించేవారికి, యిచ్చునట్లు సోవియట్ న్యాయ

శాస్త్రం విధిస్తుంది.

కుటుంబం ప్రేమపూరిత వాతావరణంలో జీవించేందుకు ఆర్థికంగా, స్త్రీ పురుషులు ఒకరిపైన మరొకరు పెత్తనం చలాయించేందుకు అవకాశాలను కల్గించే పద్ధతుల్లో గాకుండా కుటుంబసంపాదనకు, స్త్రీ పురుషులిద్దరూ తమ తమ వృత్తుల్ని ఎంచుకొనటంలో స్వేచ్ఛను కల్గిఉంటారు. పెండ్లికి పూర్వం భార్యా భర్తలకున్న, ఆస్తులు వారి వారి స్వంతఆస్తులుగాను వైవాహిక జీవితంలో సంపాదించిన ఆస్తులు, (సమిష్టి) కుటుంబ ఆస్తులుగానూ, పరిగణింప బడుతుంది. స్త్రీల వారసత్వపు హక్కులలో ఎలాంటి తగ్గింపును కూడా సోవియట్ ప్రభుత్వం అంగీకరించదు.

సంతానం యుక్తవయస్సు వచ్చింతరువాత వారి విద్యాభారాన్ని ప్రభుత్వమే వహిస్తుంది. వారి ఉద్యోగాన్ని కూడా ప్రభుత్వమే చూపించి జీవితసమస్యను పరిష్కరిస్తుంది. అంటే తలిదండ్రులకు తమపిల్లలకు ఆస్తుల్ని సంపాదించి పెట్టాలనే తాపత్రియంగానీ, పిత్రార్జితఆస్తులపైననే ఆధారపడి జీవించాల్సిన దుర్గతి పిల్లలకుగానీఉండదన్నమాట. పెట్టుబడి దారీ ప్రభుత్వాల్లోలాగ పిత్రార్జిత ఆస్తులు లేకపోతే నిరుద్యోగంతోనూ, ఆకలితోనూ, ఆత్మ హత్మ హత్యలకు వడిగట్టాల్సిన దుర్భర పరిస్థితుల్ని సోవియట్ ప్రభుత్వంతొలగించి వేసింది. వివాహాలకు పూర్వమే సంపాదన పరులైన యువతీ యువకులు పరస్పర పరిచయ ప్రేమికులై వివాహాలు చేసుకొనేందుకూ, కుటుంబాన్ని సుఖసౌఖ్యాలతో, ప్రేమానురాగాలతో సాగించేందుకు కావలసిన పరిస్థితులన్నీ సోవియట్ ప్రభుత్వం

కల్పించింది.

అయితే ఛాందస సంస్కారాలలో కూరుకు పోయిన యీసమాజంలో కేవలం చట్టాలద్వారా పాతవ్యవస్థను నిర్మూలించడ మనేది అసంభవం. కొన్నిసందర్భాలలో వ్యతిరేక ఫలితాలను కూడా యీచట్టాలు కలిగించవచ్చు. ఉ॥ "కాంగ్రెస్ ప్రభుత్వం తెచ్చిన జమీందారీ రద్దుచట్టం ద్వారా జమీందారీ ప్రజలు బేదఖలీల ద్వారా" అంటే రైతులను అనుభవ పరిమితి లేదని భూములు స్వాధీనంచేసు కొనటం-వికృత ఫలితాలను అనుభవిస్తున్నారు. మధ్యనిషేద చట్టం ఆచరణలో ఎలావిఫలమయిందీ, దానిదుష్పరిణామాలు మనకు తెలుసు-దీన్నిబట్టి తేలేదేమంటే, ప్రజాభిప్రాయాన్ని నుసరించి చట్టాలయొక్క సఫలత విఫలతలు ఆధారపడి ఉంటాయనేది స్పష్టం. ఉ॥ "నేటి సమాజంలో విధవావివాహ మంటేనూ, విడాకులంటేను, చాలామంది స్త్రీలు కూడా అయిష్టతను ప్రకటిస్తారనేది మనకు తెలుసు ఎవరిశ్రేయస్సు కొరకైతే మనము చట్టాలు కావాలంటామో వారే వాటిని వ్యతిరేకించినపుడు అవి ఆచరణలో విఫలమౌతాయనేది నిస్సంశయం. అదేవిధంగా భారతదేశంలోని నిమ్న జాతుల్లో విధవా వివాహాలు, పునర్వివాహాలు (అవి ఏరూపంలో నైనా కానీ) అనుశ్రితంగా వస్తూవున్నాయి. చట్టాలద్వారా వాటిని అరికట్టాలంటే కూడా అదేవిధంగా చట్టాలు విఫలం కాకతప్పదు. మనము ఏఆశయాలైతే మంచివను కొంటామో వాటిని ప్రజలు తెలుసుకొని, వాటిలో వున్న మంచి చెడ్డలను తెలుసుకొని వున్నపుడు చట్టాలద్వారా ఆపనిని సులభం చేయవచ్చు.

ఉ॥ విధవా వివాహాలు జయప్రదం కావాలంటే విధవా వివాహాలను అరికట్టడం ద్వారా సమాజంలో కలిగే చెడుఫలితాలను అవిఎందుకు ఏవుద్దేశ్యంతో, ఎవరి స్వార్థం కొరకు అరికట్ట బడుతున్నాయో సమాజంలో విభిన్నదశలలో, విభిన్న జాతులలో విధవా వివాహాలకు వున్న ప్రాధాన్య తేమిటో, విధవా వివాహాల ద్వారా సమాజంలో కలిగే మంచి ఫలితాలేమిటో, వగైరా విషయాలను ఎక్కువమంది స్త్రీపురుషులు తెలుసుకొని విధవా వివాహాలను సమర్థించి నపుడే చట్టాలు కూడా ఆచరణలో సఫలమౌతాయి.

సోవియట్ రష్యాలో 1917 సం॥ లో అధికారంలోకి వచ్చిన సోషలిస్టు ప్రభుత్వం అతితొందరలో కావలసినన్ని చట్టాలు స్త్రీలను గురించి చేసింది కానీ, అవి ఆచరణలోకి వచ్చేందుకు చాలా ఆటంకాలను ఎదుర్కొనాల్సి వచ్చింది. చట్టాలను గురించి లెనిన్ యీవిధంగా చెప్పాడు.

"ప్రపంచంలో ఏఒక్క ప్రజాతంత్రి పార్టీగానీ, ఆమాటకొస్తే ఏఒక్కనవీన బూర్జువా ప్రభుత్వం గానీ దశాబ్దాల కాలంలో మనం అధికారానికి వచ్చిన మొదటి సంవత్సరంలో చేసినపనిలో శతాంశంకూడా చేయజాలదు....స్త్రీవిముక్తికి చేసిన చట్టాలన్నియు వున్నప్పటికీ ఆమె యింకా గృహబానిసగానే ఉంటున్నది. ఎందుచేతనంటే ఇంటిచాకిరి ఆమెను సర్వవిధాలా అణచివేసి ఎదుగు, బొదుగు లేకుండాచేసి పతనం చేస్తూంది. ఇంటిచాకిరి ఆమెను వంటయింటికి, శిశుపోషణకు గొలుసులతో బంధించుతుంది. ఆమె శ్రమశక్తిని అనాగరికమైన, నిస్సారమైన ఊపిరి సల్పని విసుగు పుట్టించే పనిలో

దుర్వీని యోగపరుస్తుంది. నిజమైన స్త్రీ స్వాతంత్ర్యం, నిజమైన కమ్యూనిజంతోనే ప్రారంభ మవుతుంది. అంటే కార్మిక వర్గ ప్రభుత్వం క్రింద గృహపారిశ్రామిక విధానానికి వ్యతిరేకంగా పెద్దఎత్తున భారీసోషలిష్టు పరిశ్రమల నిర్మాణానికి ప్రజాపోరాటం ప్రారంభమవుతుందో, అప్పుడే నిజమైన స్త్రీకి విముక్తి ప్రారంభ మవుతుంది-లెనిన్, మార్క్సిజం

పేజీ 482-483

దీన్నిబట్టి మనకు తెలిసేదేమంటే, ఏఒక నూతన సంస్కరణకు గానీ, ప్రజలను అనుకూల పరచడం, ప్రజలు స్వేచ్ఛగా నూతన సంస్కరణలను అమలు పరచేటందుకు కావలసిన అనుకూల పరిస్థితులను కలిగించటం చేయగల్గినపుడు ఆనూతన సంస్కరణల ద్వారా ఉత్పన్నమయే సత్ఫలితాలను ప్రజలు అనుభవించ గల్గుతారు.

సోషలిష్టు సమాజంలో లింగ, తెగ, జాతిపుట్టుక ఆస్థి హోదాలపరిసక్తి లేకుండా, ప్రజలందరూ సమానంగా పరిగణింపబడటం, సామ్య వాద ప్రజాస్వామ్య అనుకూల పరిస్థితులు, నిర్మింపబడిన ఫలితంగా సోవియట్ రష్యాలో లక్షలాది మంది మహిళల ప్రతిభా సామర్థ్యాలు వికసించాయి. సోవియట్ వ్యవస్థ సృజనాత్మక కృషికీ, విజ్ఞానశాస్త్ర సంస్కృతులకూ, మహిళలకు విస్తారంగా అవకాశాలను కలిగించింది. ఫలితంగా నేడు సోవియట్ దేశంలో-సోవియట్ బాడ్జితోనూ, స్టాలిన్ బహుమాన పతాకాలతోనూ, లేదా వక్షస్థలంపైన ఆర్డర్ రిబ్బన్స్ వరుసలతోను స్త్రీలను చూడటం, సోవియట్ జీవితవిధానానికి మామూలైంది, 1954 సం॥ లెక్కలననుసరించి

సోవియట్ దేశంలో స్త్రీలు సాంఘిక రాజకీయ సాంస్కృతిక వైద్య విద్యారంగాలలో ఎంత వున్నతస్థాయిలో పాల్గొంటున్నారో సులభంగా అర్థంచేసుకోవచ్చు.

అయిదు లక్షలకు పైగా స్థానిక సోవియట్లకు ప్రతినిధులు.

280 మంది సోవియట్ దేశసుప్రీమ్ సోవియట్కు ప్రతినిధులు.

2209 మంది యూనియన్ సుప్రీమ్ సోవియట్కుగానీ, స్వపరిపాలక రిపబ్లిక్కుల సుప్రీమ్ సోవియట్లకు ప్రతినిధులు.

100-కి 40 పైగా ప్రజా న్యాయమూర్తులలోను, ప్రజా అసెసర్లలోను స్త్రీలు వున్నారు.

800000 పైగా వివిధ రంగాలలో యోగ్యతా పత్రాలుగానీ, పతకాలుగానీ పొందినవారు.

1000000 పైగా ఉపాధ్యాయులుగా, } అంటేనూటికి 60కి
1000000 పైగా ప్రజారోగ్యరంగంలో } పైగా.

1000000 పైగా ఉన్నత విద్యా సంస్థలకూ, ప్రత్యేక సెకండరీ విద్యాసంస్థలకూ హాజరయ్యే విద్యార్థినులు.

10 మంది బిడ్డలను కని, పెంచిన స్త్రీలకు వీరమాత అన్న గౌరవ బిరుదం యివ్వబడుతుంది· 38 వేలకుపైగా యీ బిరుదును పొందినవారున్నారు.

5 గురు కానీ, అంతకు ఎక్కువగానీ పిల్లలుగల స్త్రీలకు ఆర్డర్లు, పతకాలు యివ్వబడుతున్నాయి. 38 లక్షకు పైగా యీపతకాలు పొందినవారున్నారు.

166 మంది ఒక్క ఉజ్బెక్ రిపబ్లిక్ సుప్రీం సోవియటుకు స్త్రీలు ప్రతినిధులుగా వున్నారు.

యీ అంకెలు మనకు ఆశ్చర్యాన్ని, విస్మయాన్ని

కలిగించటమే కాకుండా పూర్తిగా నమ్మాలన్నప్పటికీ, కొంత కష్టంగానే ఉంటుంది. ఎందుకంటే? భారతదేశాన్ని పాలించే ప్రభుత్వం, స్త్రీల విషయంలో కనీసమార్పులను తేవటం గానీ, తెచ్చేస్థితిలోగానీ లేకపోతూవుంది. ఎందుకంటే? హిందూ కోడ్ బిల్లును కిందినుంచి పైకి, పైనుంచి కిందికి తిరగెయ్యటమే గానీ, దానికి ఒకరూపాన్ని యివ్వలేక పోతూవుంది. ఒకవేల ఏదోఒకటి చేసినప్పటికీ, ఆచరణలో అది ఎన్నివిధాలా విఫలం కావాలో, అన్ని తూట్లుపొడిచి తయారుచేయటం జరుగుతుందేగానీ, మరొకటేమీ జరుగదు. ఏసనాతన ఛాందస ప్రతినిధులకు జంకి, యీవిధంగా యింత కాలం హిందూ కోడ్ బిల్లును ప్రభుత్వం నీల్లు నములుతూ కూర్చుందో, ఆప్రభుత్వం అంతకంటే ఎక్కువ చేయగలదని ఎలా ఆశించగలం? అంతేకాకుండా భారతదేశంలోని అన్ని అసెంబ్లీలలోనూ, పార్లమెంటుల్లోనూఉన్న స్త్రీ సభ్యులను వేల్ల పైన లెక్కించవచ్చు. ప్రధానమైన నిరుద్యోగసమస్యను పరిష్కరించటంలో సంపూర్ణంగా భారతప్రభుత్వం విఫలమైకూర్చుంది. కాబట్టి స్త్రీలకువిరివిగాఉద్యోగ సౌకర్యాలుకలిగించి వారిఆర్థిక సమస్యలను పరిష్కరిస్తుందని ఆశించటం కూడా పొరపాటే అవుతుంది. యీవిధంగా వ్యవహరించే భారత ప్రభుత్వం స్త్రీల సమస్యలను పరిష్కరించలేదనే విషయాన్ని కాదనలేము. రష్యాలో మాత్రము యిదిఎలా సాధ్యమయింది. అనే అనుమానం తప్పనిసరిగా కల్గుతుంది. అయితే అక్కడి ప్రభుత్వానికి, (రష్యాలో) భారతదేశంలో ఏర్పడిన ప్రభుత్వానికి మధ్యవున్న తేడాను గమనించితే రష్యాలో

మహిళలకు అంతటి ఉన్నత స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఎలా సాధ్యమయ్యాయో, భారతదేశంలో ఎందుకు కాలేక పోతున్నాయో స్పష్టమవుతుంది. రష్యాలో ఏర్పడిన ప్రభుత్వం మార్క్సుసిద్ధాంతాల ననుసరించి జమీందారీ, యినాందారీ, పెట్టుబడిదారీ వగైరా ప్రజాపీడక సంస్థలను నిర్ధాక్షిణ్యంగా రద్దు చేయటమే కాకుండా దేశ లేక సమాజ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రతిఒక వ్యక్తికి కల్పింపబడినాయి. ఫలితంగా కార్మికులు, రైతులు వగైరా బీదప్రజలు, యితరలకు లాభాలు చేకూర్చేందుకు మాత్రమే పనిచేసే పద్ధతిపోయి, తాము చేసేపనినుండి వచ్చే సంపూర్ణ ఫలితానికి (అక్కడిబీద ప్రజలే) వారే యజమానులైనారు. యీవిధంగా ఆర్థిక నికృష్ట స్థితినుంచి, ప్రతిఒకరు వుద్ధరింపబడటం ద్వారా అక్కడి ప్రజలలో జీవిత సుఖసౌఖ్యాలను, జీవిత వికాసాన్ని అభివృద్ధి చేసుకొనేందుకు కావలసిన అవకాశాలు లభించాయి. ప్రధానంగా రష్యాప్రభుత్వం స్త్రీల విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొని ఆర్థికంగా, నైతికంగా, రాజకీయంగా పురుషుని బానిసత్వాన్నుంచివిముక్తిని కలిగించిఅన్ని రంగాలలో పురుషునితో సమాన స్వేచ్ఛాగౌరవ మర్యాదలతో పాల్గొనే అవకాశాలను కల్గించింది.

యిందుకు విరుద్ధంగా భారతప్రభుత్వం జమీందారీ విధానాన్ని రద్దుచేయాలంటే, వారికి ప్రతిఫలంగా డబ్బు యివ్వాలంటుంది. అంటే పీడితప్రజలను, ఆడబ్బు పెట్టుబడిగా పెట్టి వేరొక రూపకంగా దోపిడీ చేసేందుకు అవకాశాలు

కలిగించాలంటుంది. పెట్టుబడి దార్లను తొలగించాలంటే, అది అన్యాయం, అక్రమం అంటుంది. అంటే దోపిడీ చేసే వారు, చేయబడేవారు తప్పనిసరిగా వుండాలంటుంది. అలాగే స్త్రీల విషయంలో కూడా గాంధీ, నెహ్రూ, రాధాక్రిష్ణన్ వగైరా గొప్ప గొప్ప నాయకులు మొదలుకొని, ప్రతి కాంగ్రెస్ వాదీ స్త్రీలు విద్యనభ్యసించి నప్పటికీ, వారి కార్యక్రమం అంతా యింటిలో నేగానీ, సాంఘిక, రాజకీయ, కార్య క్రమాలలో స్త్రీలు జోక్యం చేసుకోరాదంటూ స్పష్టంగా తెలవిస్తున్నారు. దీన్ని బట్టి తేలే దేమంటే, భారత బూర్జువా జాతీయ నాయకత్వం స్త్రీని గృహాబానిసగా, యజమాని వారసత్వాన్ని సృష్టించే యంత్రంగా మాత్రమే గుర్తిస్తూ, స్త్రీ కూడా తెలివితేటల నుపయోగించి, సాంఘిక, రాజకీయ రంగాల్లో పాల్గొని దేశ క్షేమంకొరకు పాటుపడే శక్తి స్థోమతలు కలిగుందనే విషయాన్ని గుర్తించ నిరాకరిస్తున్నారనే విషయం స్పష్టమౌతుంది.



# ముగింపు

ఆదిమ దశనుంచీ వివిధ దశలుగా, వివిధ రకాలైన ఆచార వ్యవహారాలను మార్చుకొంటూ నేటి సామాజిక విధివిధానాలకు చేరుకొన్నాము. (ఆచార వ్యవహారాలను) ప్రతి దశలోనూ వుత్పత్తి పరికరాలువికసింపటం, వుత్పత్తి విధానంలో వచ్చినమార్పుల కనుగుణంగా సామాజికనియమాలుకూడా మార్పుచెందుతూ రావటాన్ని చూశాము. ఒక్క ఆదిమ సామూహిక వ్యవస్థను మినహాయిస్తే ప్రతి దశలోను పీడించే వారూ, పీడింప బడేవారూ రెండు వర్గాలమధ్య ఘర్షణలూ, సమాజంపైన ఆర్థిక రాజకీయ అధికారాన్ని వహించినవర్గం తమ పెత్తనాన్ని సుస్థిరం చేసుకొనేందుకూ, పీడిత ప్రజలను అణచి పెట్టేందుకు అనుగుణంగా ధర్మం, నీతి, న్యాయాలను సృష్టిస్తూ వచ్చారనేది చరిత్ర మనకు తెలియజేసే యదార్థ సత్యం.

సమాజంలో ప్రైవేటుఆస్థి, వర్గరాజ్యాంగమూ పుట్టి ఆస్థిపైన, బానిసలపైన ఒకేవ్యక్తికి సంపూర్ణాధి కారాలను కల్గించటంతో, స్త్రీనికూడా సంపూర్ణ బానిసత్వం లోకి నెట్టుకొంటూ, అందుకుబలాన్ని చేకూర్చిపెట్టేవిధంగా స్త్రీ పురుష సంబంధాలలోకూడా ఆచార వ్యవహారాలు నూతన రూపందాలుస్తూ వచ్చాయి. ఫలితంగా సమాజంలో అనైతికత, అరాచకం, దుర్ఘటనలు వుత్పన్నమయి సమా

జమే దుర్గంధ పూరిత వాతావరణంలో మునిగిపోయింది.

కాబట్టి స్వార్థపూరిత దృక్పథంతో సృష్టించుకొంటూ రాబడిన ధర్మం, నీతి, న్యాయాల ముసుగున జరిగే యీ అనర్థాలను రూపుమాపి, సమాజ జీవితంలో ప్రతిఒకరు సుఖ సౌఖ్యాలనుభవించేందుకూ, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో తమ యొక్క సమాజంయొక్క నైతిక విలువను, ఆత్మగౌరవాన్ని పెంపొందించుకొనేటందుకూ నేటి విజ్ఞానయుగానికీ, సభ్యతకూ అను గుణ్యమైననూతనమైనటువంటిధర్మం, నీతిన్యాయాలను ఆచార వ్యవహారాలను ఆచరణలోకి తెచ్చేందుకు ప్రతిఒక అభ్యుదయవాది సమాజంతోనూ, యీసమాజ వ్యవస్థను యథాతథంగా వుంచాలనే పెట్టుబడిదారీ ప్రభుత్వంతోనూ, కేవలం మాటలద్వారా కాకుండా, ఆచరణద్వారా తీవ్రంగా పోరాడాల్సిన అవుసరం ఎంతైనావుంది.

మనం భవిష్యత్తులో వాంఛించే నూతన ధర్మాన్ని సోవియట్ రష్యాలో అమలులోకి తేవటంద్వారా అక్కడ ప్రధానంగా స్త్రీలయొక్క సుఖమయ జీవితం, సమాజంలో ఉన్నత స్థాయికి చేరుకొనటమే గాక సమాజంలో అవినీతి, అసభ్యత, అత్యాచారాలు వగైరాలను సమూలంగా రూపుమాపగల్గారు. యిదే ప్రాతిపదికపైన ఏర్పడిన నవచైనా, తూర్పు యూరప్ రాజ్యాలలోని ప్రజలూ, ప్రభుత్వాలూ (దాదాపు ప్రపంచంలోని జనాభాలో అర్థం) కూడా యీ నూతన ధర్మాన్ని సృష్టించి సమాజంలో, సుఖమయ వాతావరణంలో ముందుకు సాగిపోతున్నాయి.

యీయదార్థ విషయాలను రష్యావిజంట్లని పిలువబడే

ఏకమహ్యానిష్టులో చెప్పేటివి కాదు. భారతదేశంలో కమ్యూనిష్టులను నాశనం చేసేందుకు కంకణం కట్టుకొన్న భారత ప్రధాని నెహ్రూ కుమార్తె ఇందిరాగాంధీ, రాజకుమారి అమృతకౌర్, ఊర్మిళామెహతా, అన్నామాస్కరిన్, దేవీఫణిక్కర్ యింకా అనేకమంది స్త్రీలు, పురుషులు రష్యా చైనా దేశాలలో స్వయంగా పర్యటించి వచ్చిన తర్వాత రష్యాలో వాస్తవంగా స్త్రీలు ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా, స్వతంత్రులుగానూ బిడ్డలు సుఖమయ స్నేహపూరిత వాతావరణంలోనూ పోషింపబడు తున్నారనీ, పెట్టుబడిదారీ దేశాలతో పోల్చినపుడు రష్యా ఒకభూలోక స్వర్గంగా చెప్పవచ్చుననీ, సోవియట్ దేశ సందర్శనం ద్వారా తమకు విశ్వాసం కలిగిందనీ వెల్లడిచేస్తున్నారంటే అందులో సందేహించాల్సిన అవుసరం యింకేమాత్రమూ వుండదు.

భారతదేశంలో గతశతాబ్దం నుంచి వీరేశలింగం, గురజాడ అప్పారావు వగైరా యుగపురుషులు స్త్రీల విషమ పరిస్థితులను అభ్యుదయ దృక్పథంతో విచారించి, వాటి పరిష్కారం కొరకు తీవ్రంగా కృషిచేశారు. ఫలితంగా వితంతు వివాహాలకు నాందివాచకంగా 1902 సం॥లో గుంటూరులో ప్రథమ వితంతు వివాహం జరగటం శారదాచట్టం (బాల్య వివాహాలను నిషేధిస్తూ) ప్యాసుకావటం, 1935 సం॥ లో ప్రథమ పర్యాయంగా స్త్రీలకు వోటింగ్ హక్కులు కల్గించటం, 1941 సం॥ లో స్త్రీల హక్కుల విషయమై హిందూ న్యాయ శాస్త్రాన్ని పరిశీలించి సంస్కరించేందుకు గాను. బి. యన్. రావు కమిటీని నియమించటం 1944 సం॥

ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘాన్ని స్థాపించటం వగైరా విజయాలు లభ్యమయాయి. అంతేకాకుండా భారతదేశపు అన్ని రాష్ట్రాలలోను మహిళా సమస్యలు తలెత్తి పనిచెయ్యడం, మహిళా సంఘాలు ఏర్పడటం, స్త్రీల హక్కుల విషయమై ఆందోళన వగైరా కార్యక్రమాలు త్వరిత గతిని అభివృద్ధి చెందుతూ వస్తున్నాయి.

అయితే ముందున్న కర్తవ్యంతో పోల్చిచూచినప్పుడు యింతవరకు సాధించిన విజయాలు, కార్యక్రమం అంతా కూడా సముద్రంలో ఆవగింజకు సమానంగానే వుంటుంది. ఎందుకంటే? ప్రస్తుత భారతదేశ ప్రభుత్వం ఒకవైపు లక్ష్మీప్రసన్నులను సమర్థిస్తుంది. మరొకవైపు దరిద్ర నారాయణ మూర్తులను సమర్థిస్తుంది. అంటే భారతదేశంలో ప్రస్తుతం అమలులోవున్న ధర్మం, నీతి, న్యాయాల ప్రకారం దోపిడీ చేయబడేవారు, దోపిడీ చేసేవారుగల వ్యవస్థను, రూపాల్లో కొన్ని మార్పులు చేయటంద్వారా గుణాలను యథాతథంగా వుంచేటందుకు ప్రయత్నం చేస్తూవుంది. కాబట్టి కనీస మార్పులకొరకు విడాకులు, వారసత్వపు హక్కులు, బహుభార్యాత్వ నిషేధంరద్దు, వేశ్యావృత్తిద్వారా జీవించేవారికి ఆవృత్తిని రద్దుచేయటంతోపాటు వారి జీవిత విధానానికి యితరవృత్తులు కల్పించేటందుకు ప్రభుత్వబాధ్యత వగైరాల కొరకు ప్రచారంఆందోళనలద్వారా ప్రభుత్వంతోపోరాటం, సమాజంలో పాతుకుపోయిన మూఢభావాలను, ఛాందస ఆచారాలను తొలిగించేందుకు కృషిచేయటంద్వారా భావి కర్తవ్య నిర్వహణలో పయనించిన వారమౌతాము.

# తప్పు ఒప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 1 | 1 | జాతుల | జాలం |
| 2 | 1 | ఉత్పన్న | ఉత్పన్న |
| 2 | 7 | యీాదశలో | ఆదిమదశలోని |
| 3 | 9 | వుందనే | ఉంటుందనే |
| 5 | 8 | ధూరంగా పెట్టుతారు | దూరంగా పెట్టారు |
| 6 | 22 | సామూహకంగా | సామూహికంగా |
| 6 | 23 | ” | ” |
| 8 | 22 | కాబటి | కాబట్టి |
| 9 | 5 | సామూహకంగా | సామూహికంగా |
| 11 | 15 | పురుషులతో | పురుషులలో |
| 13 | 20 | ష్యైతమ్ | పైౖతమ్ |
| 13 | 4 | సమూజానికి | సమాజానికి |
| 13 | 14 | యీాదృచ్ఛికంగా | యాదృచ్ఛికంగా |
| 14 | 7 | అధికమించి | అధిగమించి |
| 15 | 12 | సత్యా | సత్య |
| 16 | 22 | కాపాడార్కో | కాపాడుకో |
| 17 | 22 | సధ్యావధూ | సద్యోవధూ |
| 18 | 18 | స్వవంగా | స్వయంగా |
| 19 | 8 | ఆధికోతలను | ఆధిక్యతలను |
| 20 | 20 | తయారు | తయాసు |
| 20 | 23 | కుటుంబాలలలోని | కుటుంబాలలోని |
| 20 | 24 | యుద్ధాలలలో | యుద్ధాలలో |
| 21 | 2 | క్రమాలలలో | క్రమాలలో |
| 22 | 6 | బలపడయే | బలపడుట |
| 23 | 2 | అతన | అతని |
| 24 | 3 | పురునికి | పురుషునికి |
| 24 | 15 | ఆ అధికాలం | ఆ అధికారాలు |
| 24 | 21 | అవశేవలకు | అవశేషాలకు |
| 25 | 6 | సంహరించలేక | సహించలేక |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 25 | 6 | సుందుని | సుందుని |
| 25 | 10 | రాక్షసుకండని | రాక్షసులు కండని |
| 27 | 2 | రక్షితణగా | రక్షితగా |
| 27 | 18 | యొక్క | యొక్క |
| 28 | 1 | ఆదశ్శము | ఆదర్శము |
| 28 | 10 | ప్రపత్తులు | ప్రపత్తులు |
| 28 | 13 | 800 | 300 |
| 28 | 14 | కద్దు | కద్దు |
| 28 | 16 | కేక | కేగ |
| 28 | 17 | వారదీలగ | వారదేలగ |
| 29 | 20 | అట్టిహారితో | అటివారితో |
| 30 | 10 | స్వర్షలు | స్వర్గలు |
| 34 | 3 | భాద్య | భార్య |
| 35 | 13 | బుత్యా | బుత్వి |
| 37 | 17 | జటలుడను | జటిలుడను |
| 37 | 20 | వుంటినట్లు | వుండినట్లు |
| 37 | 21 | సత్యం | సత్వం |
| 38 | 3 | బకరికి | బకరు |
| 38 | 8 | సత్యావతి | సత్యవతి |
| 41 | 9 | ఓళిదావతి | ఓఘావతి |
| 42 | 9 | తల్లిసరనేయు | తల్లిఆజ్ఞ అనుసరనీయం |
| 42 | 13 | చిరకారి | చిరకారిని |
| 44 | 8 | శ్వేచ్ఛా | స్వేచ్ఛా |
| 45 | 18 | దౌర్జన్యాకి | దౌర్జన్యానికి |
| 45 | 18 | యంప్రమూ | యంత్రమూ |
| 48 | 11 | ఆసమయంలో | అసమయంలో |
| 49 | 3 | పురుని | పురుషుని |
| 49 | 6 | ప్రధంగాంగా | ప్రధానంగా |
| 49 | 11 | యంది | యందు |
| 49 | 14 | ఆసంతాం | ఆసంతానం |
| 50 | 7 | పురుషుని | పురుషునికి |
| 50 | 8 | తీసుకోల్సి | తీసుకోవాల్సి |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 50 | 12 | పురుషుకు | పురుషులకు |
| 52 | 5 | కావసినన్ని | కావలసినన్ని |
| 52 | 10 | వశృంఖల | విశృంఖల |
| 54 | 1 | పిండిము | పిండము |
| 56 | 2 | పరోక్లా | పరోక్షా |
| 56 | 19 | స్వాలు | స్యాలు |
| 59 | 14 | లకే | ఒకే |
| 59 | 18 | (మహాత్మ | (మమాత్మ |
| 60 | 5 | దీపశిఖర | దీపశిఖ |
| 60 | 16 | నిష్కా-ను | నిష్కామ |
| 61 | 19 | నిప్పష్టంగా | విస్పష్టంగా |
| 62 | 4 | అంధం | అంధ |
| 62 | 6-7 | వెల్లదుకోన్ని | వెళ్లి దుఃఖాన్ని |
| 63 | 11 | సంగ్రి | సంక్రి |
| 66 | 16 | విర్యాధులు | విరోధులు |
| 66 | 17 | ఆకషించ | ఆకర్షించ |
| 73 | 20 | అవయువ | అవయవ |
| 73 | 20 | నుగ్న | నగ్న |
| 73 | 22 | భాగాన్ని | భావాన్ని |
| 74 | 22 | పరి | పవి |
| 76 | 2 | విస్త్రరణ | విస్తరణ |
| 76 | 13 | సామాన | సామాన్య |
| 79 | 16 | మొతాన్వి | మొత్తాన్ని |
| 80 | 15 | గడగెడ | గడగడ |
| 83 | 15 | ఆలోచజ | ఆలోచన |
| 85 | 9 | చేసే | చేస్తే |
| 86 | 18 | యావన | యావ్వనం |
| 86 | 19 | పూర్గయా | పూర్ణయవ్వ |
| 86 | 20 | యానం | యవ్వనం |
| 90 | 4 | ద్య | ద్ర్య |
| 91 | 10 | వుడు | మిడు |
| 91 | 18 | ఆమెహ్రు | ఆమెహృద |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 93 | 3 | ప్రేరిచించే | ప్రేరిమించే |
| 94 | 16 | అనీ | అవీ |
| 94 | 16 | అని | అవి |
| 94 | 20 | యేదృష్టా | యేదృష్ట్యా |
| 96 | 6 | కారులను | కాదులను |
| 96 | 12 | అత్యాచారాలను | అత్యాచారాలు |
| 97 | 10 | శిక్ష | శిక్షి |
| 98 | 11 | ధనారక్షణ | ధనాకర్షణ |
| 99 | 6 | వారి | వారు |
| 101 | 6 | వారికే | వారికీ |
| 106 | 18 | నువ | న |
| 107 | 12 | ర్వివాహాన కు | ర్వివాహాలకు |
| 108 | 9 | వితంత | వితంతు |
| 108 | 16 | డార్శ్మనికులూ | దార్శనికులూ |
| 109 | 16 | ధురిపర | ధ్రువపర |
| 111 | 3 | సౌందర్యా | సౌందర్యో |
| 112 | 21 | లిషులో | లిష్టులో |
| 113 | 2 | చైతన్యాల | చైతన్యం |
| 113 | 6 | మానవునివు | మానవుని |
| 113 | 11 | సాప్రదాయం | సాంప్రదాయం |
| 114 | 21 | మనప్రాతం | మనప్రాంతం |
| 117 | 24 | కల్గుతుంటే | కల్గుతుండే |
| 118 | 19 | అనే | అదే |
| 122 | 21 | సరస్వరం | పరస్పరం |
| 123 | 13 | (సాధ్య కాని) | (సాధ్యం కాని) |
| 126 | 12 | కుటుంబాలో | కుటుంబాల్లో |
| 127 | 3 | ఒక వేశ్య | ఒక ఫేషన్ |
| 128 | 8 | భాందస | ఛాందస |
| 133 | 19 | ఆత్యహత్య | ఆత్మ |
| 134 | 13 | అయిష్టి | అయిష్ట |
| 135 | 21 | పొదుగు | బొదుగు |
| 136 | 15 | ప్రజాసామ్య | ప్రజాస్వామ్య |

నవీన పద్ధతులతో
కళాకారులగు పనివారలచే 

## మా అచ్చుపనులు

ఇంగ్లీషు, తెలుగుభాషలలో
అన్నిరకముల పనులు,
సకాలములో
అందివ్వగలము.

ఫైన్ ఆర్టు హౌస్:

## ప్రభాత్ ప్రింటర్సు

మైదుకూరురోడ్డు, ప్రొద్దుటూరు.


ప్రతులకు:

జె. ఆర్. రెడ్డి,
చెవ్వారిపల్లె,
పైడిపాళెం, (పోస్టు)
కొండాపురం M. S. M.

